# కృతజ్ఞత

బాల్యంబుననె కావ్యవనవీథి విహరించి
కవికోకిలాలాప గతులు మెచ్చి;
సౌందర్యభావనాశబలిత చిత్తుఁడై
స్వర్గతుల్య మొనర్చి స్వగృహమును;
కలిమికి సహజమౌ గర్వంబు విడి మిత్ర
బృందహృత్ప్రీతిక నెక్కుఁ గలిగె;
అర్థికి గౌరవహాని దోఁపింపని
దానశిల్పములోని తత్త్వ మెఱిఁగె;

మాటలకుఁ జేతలకు మాఱుపాటు లేమి
వఱలె నీయందు రేబాలవంశచంద్ర
యనుచు నెల్లరుఁ బొగడంగ నలరినావు
రమ్యగుణమూర్తి శ్రీసుబ్బరామిరెడ్డి!

కర్తికిఁ గావ్యకళా సం
పత్తికి మొగదారులైన మనతొంటి నృపుల్
ఇత్తఱి నరుదేయైనను
బొత్తిగ విడిపోవు మనలఁ బూర్వాభిరుచుల్.

కొండవీటి రాజ్యేందిర క్రుంకిపోయె
నకట! దురదృష్టవశమున, నైననేమి?
నేఁడు సిరిగల ప్రతి రెడ్డివీడుకూడ
పండితులపాలిటికి "పిల్లకొండవీడు."

"జనకుని స్మృత్యర్థము నే
ననుకొంటిని నీదుకృతుల నచ్చొత్తింపన్
అనుమానమేల, నీవా
ననవోయీ" యన్న తీరు "లా" ననిపించెన్.

నీ రసికత, నీమైత్రియు,
నీరమ్యకళానుభూతి నిరతము శిల్ప
ప్రేరకమై నవకవితో
దారకమై పెంపుచెందుతన్ బ్రియమిత్రా!

నేను నీవును సకలంబు నిశ్చయముగఁ
గాలవాహిని నొకనాఁడు గలయఁగలము;
కాని, రమ్యమైన యపూర్వ కావ్యసృష్టి
అమరతం గూర్చుఁ గర్తకు నాశ్రితునకు!

సిరికిందగిన వదాన్యత,
పరువము, లలితాభిరుచుల బలిసిన భావ
స్ఫురణము, భోగప్రీతియు
విరిసెను నీబ్రతుకుఁ దీవ విరులటు మిత్రా.

ధనముండుట పరిపాటియె;
ధనమే సర్వంబుగాదు; ధనముండియు స
ద్వినియోగ బుద్ధిగలిగిన
మనుజుని భాగ్యంబె లోకమాన్యతగాంచున్.

రమయును వాణియుఁ బక్షపాతమువహించి
కూర్చి రర్థంబు విద్యయుఁ గొదవలేక;
అట్టియొద్దిక యందఱ కబ్బదోయి,
జీవితార్థంబు నిరుకేలఁ జిక్కఁబట్టు!!

# విన్నపము.

నా రచనలన్నియు, కావ్యములు, ఖండకావ్యములు, నాటకములు, సారస్వతవ్యాసములు అనునాలుగు సంపుటములుగ ప్రకటింపఁబడినవి. ఈసంపుటము లన్నిటియందును కృతులు రచనాకాలక్రమానుసారముగ సమకూర్పఁబడినవి. ప్రకటిత మైన కావ్యములలో మొదటిది నలజారమ్మ. అంతకుపూర్వము రచింపఁబడిన కావ్యములు నా యశ్రద్ధవలన శిథిలములైపోయిన భాగములుపోఁగా మిగిలినవి కొన్ని మచ్చునకుగా ఖండ కావ్య సంపుటమున చేర్చితిని.

నాకృతుకన్నియు (Complete Works) అచ్చగుచున్న వని విని కొందఱుమిత్రులు "కలమును కాగితంబు తనఖాపడె గుడ్బయి రామిరెడ్డి" అని పూర్వమన్నట్లుగనె యిప్పుడును "రామిరెడ్డి గవిడి మూసినాఁడు" అని మేలము చేయసాగిరి. నే నెట్లు చెప్పుటకును వీలులేదు. పూర్వమొకప్పుడు 'కడపటి వీడుకోలు' రచించిన వెనుక కొంతకాలమువఱకు కవితాస్పర్శ యే లేక యుండినది. కవిత నన్ను వదలెననియనుకొని "కవిసంశయావస్థ" అనికొన్ని పద్యములు వ్రాసియుంటిని:



శ్రీయుతులు రేబాల సుబ్బరామిరెడ్డిగారు.

"కడపటిపీడుకోలె మనకౌఁగిలి యొత్తులముద్దులాటకున్
గడపటిపీడుకో లగుటగాదుగదా! యనియేమొ నీవు నన్
విడతువటన్న సంశయము వేమఱు జీవిత వీణయందు కీ
ల్వడలిన తంత్రియట్లు వికలంబుగఁ బల్కు నపస్వరంబులన్"

ఇటువంటి సంశయము అప్పుడప్పుడు నామనస్సును నిరుత్సాహపఱచుచుండెడివి. కాని, యీపద్యములు వ్రాసిన మూఁడు నెలలకు "మీరాబాయి" నాటకమును, తరువాత రెండు మూఁడు నెలలకు "మాధవవిజయ"మను నాటకమును రచియించితిని. నా కవితా ఋతువునకు పురోగామిగా యీ "కవి సంశయావస్థ" దొరలినదని సమన్వయించుకొంటిని.

నేనీకృతులనన్నిటిని ప్రకటించుట "గమిడి మూసితి" నను భావముతో కాదు. మోపూరు నివాసులును కళోపాసకులును కవితారసజ్ఞులును నాకు మిత్రులును అగు

## శ్రీయుత రేబాల సుబ్బరామిరెడ్డిగారు

ఒకనాఁడు ప్రస్తావ వశమున నిట్లనిరి:

"నీ గ్రంథములు చెల్లా చెదరుగనున్నవి. మాసపత్రికలలో ప్రకటింపబడిన కొన్ని కావ్యములు గ్రంథరూపమున వెలువడనే లేదు. తుదకు నీపుస్తకములు ఎచ్చటదొరకునోయను సంగతి కూడ చాలమందికి తెలియదు. నీకృతులన్నియు ఒకే సంపు

టముగ నచ్చొత్తించిన భాగుగనుండును. నీ విష్టపడుదు వేని నేనందుకు వలసిన యేర్పాటు కావించెదను."

సుబ్బరామిరెడ్డిగారి కవితా ప్రియత్వము ఔదార్యము నన్ను ముగ్ధునిగావించినది. అర్థింపఁబడియు కవులకు సహాయము చేయు కవితా పోషకులు అరుదైన ఈకాలమున సుబ్బరామిరెడ్డిగారి ఈయయాచిత సాహాయ్యము ప్రశంసా పాత్రమని వేఱుగ చెప్పనక్కఱలేదు. నేను వారికెంతయు కృతజ్ఞుఁడను.

సుబ్బరామిరెడ్డిగారి జనకులు

## కీ. శే. రేబాల సుబ్బారెడ్డిగారి స్మృత్యర్థము

ఈ కవికోకిల గ్రంథావళి యచ్చొత్తింపఁబడినది.

ఈకావ్యసంపుటమునకు అభినవ తిక్కన బిరుదాంకితులు బ్రహ్మశ్రీ. దుర్భా సుబ్రహ్మణ్యశర్మగారు తొలిపలుకు రచియించిరి. శర్మగారు నాకు గురుప్రాయులు; మిత్రులు; హితులు; నా కవితా ప్రారంభదశయందు నేను వ్రాయునది కవిత్వమగునో కాదోయని నామనము సంశయగ్రస్తమైయున్నపుడు ఆత్మవిశ్వాసప్రేరకమగు ప్రోత్సాహమును సరియైన యదనున నొసంగి నా కవితాలతకు అల్లుపందిరి పెట్టిరి. వారికి నేను మరణ పర్యంతము ఋణబద్ధుఁడను.

నేను నెల్లూరిలోనుండి అచ్చుప్రూఫులు స్వయముగ దిద్దుకొన వీలు లేకయున్నందున నామిత్రులును, మృదుమధుర కవితారచయితలునగు గోనుగుంట్ల పున్నయ్యగారును, చిరకాలమిత్రులును "హాలిక" లాంఛన విశ్రుతులును ప్రభాత ముద్రణాలయాధికారులును అగు మరుపూరు కోదండరామరెడ్డిగారును ప్రూఫులుదిద్ది శ్రద్ధతో మిత్రకార్యము నెరవేర్చిరి. వారిసాహాయ్యమునకు నేనెంతయు కృతజ్ఞుడను.

నెల్లూరు.<br>2—12—1935

దువ్వూరి రామిరెడ్డి,

# విషయసూచిక

# తొలి పలుకు

తనకల్పనలు సత్యముగాఁ బొడకట్టఁజేసి తన సృజించిన కథాపురుషుల దశా విశేషములతోఁ బాఠకులకు గాఢమైన సహానుభూతి కలిగించి తన యనుభవించిన రసమునకు వారి హృదయముల నెలయించి యన్యమును మఱపించుటయే కవిత్వమునకు లక్షణమేని, రామిరెడ్డిగారు కవియేగాక కవి వతంసులనియుఁ జెప్ప నొప్పియున్నారు. కవితకు అపూర్వసృష్టి యే విశిష్ట లక్షణమైనను, సిద్ధపూర్వములకు మెఱుఁగుపెట్టు వారిని, వానిని భాషాంతరములకుఁ దార్చువారినిఁగూడ కవు లనుట చిరకాలాగతముగానున్న యాచారము. భారతము తెనిఁగింపేమైనను, తిక్కన కావించినది 'సృష్టి'యనియు, ఆయన 'కవిబ్రహ్మ'యనియుఁ బెద్ద లుగ్గడించియున్నారు. సృష్టి యనుట కథాసృష్టి మాత్రపరమేమైన,తిక్కన చేసిన సృష్టి యేమి యుఁ గానరాదు. భారతకథా సర్గమంతయు వ్యాసభగవానునిదే. కావున పాత్రకల్పల యనువదనములలో పాత్రరస నిర్వాహా దికములందుఁ దోఁచు నూతనత్వమునుగూడ పూర్వులు 'సృష్టి' పద వాచ్యముగా భావించిరనుట తెల్లము. ఈదృష్టులలో దేనఁ జూచినను రామిరెడ్డిగారికిఁ గవియశస్సు లభించితీరవలసి యున్నది. ఈ కావ్యగుచ్ఛములోని యేడురచనములలో నైదు

నూతన సృష్టులు. కడమ రెంటిలో తొలిది (నలజారమ్మ), పరం
పరా ప్రాప్తమైన యొక కాఁపుటిల్లాలి పాతివ్రత్య చరిత్రము.
రెండవది (పానశాల), పారసీకమునకుఁ బరివర్తనము. ఇందొ
క్కొక్కటియు నేనీవఱకుఁ బలుమాఱు పఠించినవే య
య్యును, ఈపీఠికకొఱకుఁ జదువునెడ నివి క్రొత్తయవిగాఁ
దోఁచి డెందమున కమందమైన యానందముం గూర్చినవి.
'క్షణేక్షణే యన్నవతాముపైతి తదేవరూపం రమణీయతాయాః'
యనుట యిట్టిరచనలఁ గూర్చియేకదా యని మరల శ్లాఘ
చేసికొంటిని.

తనహృదయమున కంటని యేవిషయము నేని, కవి చక్కఁ
గా దిద్దితీర్పనేరఁడు. క్షితిభుజుల ముఖోల్లాసము కొఱకో లోక
సమ్మానముకొఱకో యితివృత్తములఁ జేకొనవలసివచ్చిన
వాఁడు తనచేఁతచే సహృదయుల చేతముల వశీకరించుకొనఁ
గలఁడనుట కల్ల. తనహృదయమునఁ బుట్టి పొంగిపొరలి వెలి
కుఱుక వేగిరపడుచున్న యాశయ ప్రవాహము కవిత్వముగఁ
గాని యన్యము కానేరదు. గతానుగతిక మంత కంటెం
గానేరదు. రామిరెడ్డిగారి కవిత్వము ఈరెండుదోషములకు
దవిష్ఠముగా నుండఁబట్టియే యింత హృదయంగమముగా నున్న
దని నాతలంపు. 'నలజారమ్మ' వ్రాయునప్పటికి రెడ్డిగారికి ఇరు
వదియేండ్లు. నలజారమ్మ, తెనతల్లి (పెరుమాళెడ్డివారి) యింటి
యాడుఁబడుచు. వివాహాది శుభసందర్భములయందు ఆమె గుడి

కిఁబోయి మ్రొక్కుకొనుట తమవారి యాచారము. మఱి, యామె యగ్నిగుండాన నుఱికిన కథ యీమాణవున కెవరు నుడివిరో, యది చిన్ననాఁట నాతని చిత్తమున కెంతయత్తినదో, అదియే యాతనితొలి రచన కితివృత్తమైనది. ఇందు రెడ్డిగారి శైలి పరిపాకమునకు రాకపోయినను, మనఃప్రవృత్తుల పరిశీలనముచేయుశక్తి పరిమితముగానేయున్నను, కవి గతానుగతికుఁడు గాఁడనుటకు ఈ చిఱుతకృతిలోనే కావలసినంత సాక్ష్యమున్నది. సంతానమునకు నోచుకొనని నలజారమ్మ సాయంసమయమున గూఁటిలోని బిడ్డలకు మేఁతతెచ్చిన కలవింకమును, తల్లితోఁ జెరలాడు నాపులుఁగు నిసుఁగులను జూచి యట్టి ప్రేమమయ జీవితము తనకు లభింపక పోయెనేయని దురపిల్లుఁగాని, తన చింతను 'అపుత్రస్య గతి ర్నాస్తీ'త్యాది శాస్త్రసూత్రములతో ముడిపెట్టదు. కవిదృష్టికి చంద్రునిలోని కళంకము 'అభ్రకేదారమున' 'ఉడుగణమ నెడిపసిని' మేపుచున్న 'చంద్రుఁ' డనెడి 'గోపబాల'కుని 'గొంగడి' గాఁదోఁచుఁగాని అదృష్ట 'మంత్రబలమున'ఁ 'బితృస్థాన'మగు 'చంద్రమండలము'న కెక్కిన 'జనసమావర్జితస్వధా సలిలతిలల' మొత్తముగాఁదోఁపదు. కవి తాను బండొకచో తన్ను శంకించుకొన్నట్లు కర్షకపక్షపాతియో కాఁడో నేను చెప్పలేనుగాని, దానిని మించిన ప్రకృతి పక్షపాతము ఈతని కృతులలో నన్నింట నఖండముగాఁ గానవచ్చుచున్నది. ఈప్రకృతి పరాయణత్వమేగాక,

వెనుకఁ బ్రాకట్యమునకు వచ్చిన రెడ్డిగారి కవితా గుణము లన్నియు, నీచిఱుతకృతిలో బీజరూపముం దాల్చియున్నవనుట సత్యమునకు దూరముకాదు. గుణమాత్రము లేగాక, వెనుకటి కావ్యసరణులు కొన్నింటికి గమకములును నిందే కానవచ్చు చున్నవి. అస్తమయము వర్ణించుచుఁ గవివ్రాసిన యీపద్య ముం గనుఁడు:—

సీ. పండియల్లులు వంచు పైరుజొంపములకు
జాళువాపూఁతలు గీలుకొల్పి,
కన్నెపయ్యెగ కల్లఁ గదలుచు దోఁగాడు
జలదబాలల కెఱ్ఱకలప మలఁది,
కుజకోటరంబులఁ గూర్కెడు పెను గుడ్ల
గూబల మాద్యంబుఁ గొల్లకొట్టి,
ఎండరాపిళ్ళకు నెరియు కొ్రొన్నలకుఁ
బూర్వరాగంబును బొదలఁజేసి,
ఆలమందలఁ గదలించి హాలికులకుఁ
బనులుచాలింపఁ గనుసన్నఁ బరఁగఁ దెలిపి
భర్తలనుగూడ నుత్కంఠ భామినులకుఁ
గొలిపి రజనీముఖంబునఁ గొఱతె నినుఁడు.

"జలద"మును "బాలిక" యనుట వింతయూహ. ఈ బాలికయేకదా కొన్నేఁడుల కావలనీడేటి వేఁడివేల్పుతోఁ గూడి మాడిన కోమలాంగి. ఇందలి హాలికుల పనుల స్ఫురణలే కదా "కృషీవలుని" యద్భుతవృత్తమైనది. నలజారమ్మ తండ్రి ధర్మ సందేహముం దీర్చుచు,

మును రక్షోహృతయైన సీతను సతీ మోహంబునన్ రామచం
ద్రి నరేంద్రుండు గ్రహించెనంచుఁ బలునిందల్ వల్కఁ బౌరుల్ ధరా
జను గాంతాగనివాసినిన్ సలుపఁడే శంకింప రా రాముఁడున్;
మనవారల్ పెఱవారలంచును జనుల్ న్యాయంబు పోఁజూతురే?

ఇందలివస్తువేకదా వెనుక 'సీతావనవాస' నాటకమైనది.

ఇవియెల్ల ఘుణాక్షరన్యాయమునకు లక్ష్యములుగాక భూతార్థములే యయ్యెనా, రెడ్డిగారు,

మును కౌరవ్యులు ద్రౌపదిన్ గినుకనై భూపాల సంఘంబు మూఁ
గిన పేరోలగమందుఁ జీరలొలువన్ గీడ్పాటు నీక్షించుచున్
ఘను లా పాండవులుండరే వెడగులై న్యాయైక బద్ధాత్ములై
జనకా, కూడవు పక్షపాత విధముల్ సత్యంబు పాలించుచోన్.

అనుపద్యములోని సందర్భమునుగూడ నాటకముగా వ్రాసి, లోకమునకుఁ దానుబడిన బాకీ తీర్చుకొనవలసినవారుగానున్నారు

'నలజారమ్మ' స్వకుటుంబ వృత్తాంతమై కవిడెందమును బందిగొని యున్న, కృషీవలుఁడు స్వకుల వృత్తాంతమై యాతని మనంబు తనవంకకుం ద్రిప్పుకొని యుండవలెను. అతిసాధారణమైన సైరికుని దైనికవృత్తము కవిత్వ తుల నారోహింపఁ జేయుట రామిరెడ్డి వంటి సహృదయునకే గాని సాధ్యము కాని

పని. కృషీవలుని జీవితముం దడవు వర్ణనలు వాఙ్మయమున నెడ
నెడఁ గానవచ్చుం గాని యవి యున్నను లేకున్నను ఆకా
వ్యములకుఁ గావ్యత్వహాని లేదు. వానివలన ఆకావ్యములకుఁ
బుష్టియొండె, దదభావమున నష్టియొండెఁ గానరాదు. అటు
గాక 'కృషీవలు'నిలోని వస్తువే కర్షకుని దైనందిన జీవితమున
ఎక్కడికక్కడఁ దెగిపోవు భావముల కన్నింటి కేక వాక్యత
కల్పించి దానిం గథ పోలె నడపుట యెంతకష్టమో యది శిల్ప
విదులకే విదితము. ఒం డొంటితోడి కూడిక పనిలేని పద్యములు
వేయింటి వ్రాయుటకన్న పదిపద్యములు కథఁగాఁ బొసఁగించి
వ్రాయుటయందలి కష్టము కలావిదు లెఱుఁగనిది కాదు. మఱి
కథయేమనియు లేని యిట్టి యతుకులం గొని 'సంయోగము' చెడ
కుండునట్లు కథగా నేతోఁచునట్లు ఒకకబ్బము నిర్వహించుటకుఁ
గవి కెంత ప్రజ్ఞ వలయునో పాఠకు లూహించుకోవలయును.
అంగలాది భాషలలో నిట్టివి కలవఁట. ఆంధ్రికి మాత్రమిది యభి
నవ సృష్టి యని నేను భావించుచున్నాఁడను. ఈమార్గమున నితర
వృత్తులవారి మనుగడలఁ గూడ నభివర్ణించుట ప్రతిభయు
రసానుభూతియుఁ గల కవికుమారులకడంకకుఁ బాత్రము కాఁద
గిన విషయమని హెచ్చరించుచున్నాఁడను.

"యువకస్వప్నమున" స్వకుటుంబ స్వకులాభిమానముల
దాఁటి కవిహృదయము స్వదేశము దెసకుఁ బ్రసరిల్లినది. మఱి
యు, "జలదాంగన"లో నీయభిమానము మంటిని మింటిని నేక

సూత్రమునఁగట్టివైచినది. "జలదాంగన"లో జలదముయొక్క జన్మవృద్ధిపరిణత్యపక్షయాదుల నొకవంక భౌతికశాస్త్ర సూత్రములతోను, ఒకవంక భర్తృమతీ జీవితముతోను సమన్వయము చేయవలసియుండుటచేతను, "యువకస్వప్నము"లో వృత్తాంతమును విషయ నిగరణ ముఖమున చెప్పవలసివచ్చుటచేతను, కవి స్వేచ్ఛ యరికట్టఁబడినను, తటములఁదెగఁ గోసికొని పాఱు స్రోతస్వినివలె, రెడ్డిగారి కవిత యనర్గళ గమన వేగమునఁ బ్రవహించుచునేయున్నది. "యువకస్వప్న" మందలి నైరంకుశ్య తత్త్వ విమర్శముంబోలె జలదాంగనలోని యభ్యూహకత్వము (imagination) అత్యంతపరితోషకారిగానున్నది. ఇఁక నందలి ప్రకృతివర్ణనములా? అవి రసికజనైక భోగ్యములు! జలదాంగన సూర్యునితోడఁ గాఁపురము చేయుచున్న సమయమున తన చర్యలం గవికుమారునకుఁ జెప్పుకొను ఘట్టము నుండి యివే నాల్గుపద్యముల నుదాహరించుచున్నాను.

సాంధ్యవేళలఁ బడమటి చఱుల యందుఁ
బొటమరించెడు నపరంజి పొడుపుకేటి
యందు నీరాడి వెన్నెలు లార్చుకొనుచు
వచ్చుచుందును గవుల భావమ్ము లలర.
పండువెన్నెల లలరు శర్వరులయందు,
వలిపపుముసుంగు నోరగా వలనుపఱచి
వెన్నెల పులుంగు పిల్లల చిన్నినోళ్ళ
నమృతరసముఁ బూరింతు నెయ్యంబుగదుర.

ప్రొద్దుపొడుపున విరియు క్రొంబువులయందుఁ
గాఁపురంబుండు నిందిర కంఠసీమ
మంచుతుంపర ముత్యాల మాలఁగట్టి
వేయుచుండును నానందవర్ధనముగ.

అభ్రగంగా ప్రవాహంబు నవలదాఁటఁ
గమ్రమణుల సురేశుండు గట్టినట్టి
యింద్రధనువను వంతెన నెక్కిపోదు
జలకమాడిన తెఱగంటి చెలులతోడ.

'పానశాల' పారసీకమునకుఁ దెనిఁగింపు. రామిరెడ్డి ఖయ్యామునకుఁగల యాంగ్లీకరణములఁబట్టిగాక స్వయము పారసీక భాషఁ జదివి మూలార్థ మవగతము చేసికొన్న వాఁడుఁ. కొన్ని యెడల ఆంగ్లానువాదకులు కవిహృదయ మెఱుంగ నేరక పడిన పొరపాట్లుం గూడ వీరు తమ తెనిఁగింపులోఁ జక్క పఱచి కొన్నట్లు వినికి. ఇది యెంత దనుక సత్యమో మూలభాష నెఱుఁగని నాకుఁ దెలియుట అసాధ్యము. కాని రెడ్డిగారి భాషాంతరీకరణము ఎచ్చటను దర్జమాగా (దోఁపక స్వతంత్రరచనవలెఁ గానవచ్చుచున్నది. పద్యములలోని పారసీక పదములు, ఆయా భాగములం గానవచ్చు నార్యకవి సమయోల్లంఘనములు—ఇవి లేక యున్న ఇది విదేశీయకృతియని గుఱితింపనే యనువు కాదేమో! మన భాషతో సకల విధముల సాజాత్యము గల సంస్కృతముబడి వ్రాయువారలే తెలుంగు పోకడలు చెడ

కుండ కృతుల నిర్వహింపనేరకుండఁగా రెడ్డిగారు దీనినింత ప్రసాదసుభగముగా రచింపఁ గలుగుట వారిభావజ్ఞతకును, బద్యరచన పై వారికిఁగల యధికారమునకు నిదర్శనము. రామిరెడ్డిగారికృతులలో నాంగ్లవాఙ్మయచ్ఛాయ లున్నవనుట తద్భాషాకోవిదుల కెల్లందెల్లము. ఈనాఁటిభావకవుల కవితామండనములు పెక్కులు అరయ్యాంగ్ల సారస్వత విపణులం గొన్నవియే కదా! కానియాభావకవులు ఆంగ్లము లోని నవీనాశయముల మన నుడికారమునఁ బొసఁగించుటకుఁ బడిన శ్రమము వారు వడసిన ఫలసిద్ధికి అనురూపము గాక యున్నది. పదములకు లేనియర్థములు గల్పించుకొనుట అర్థములేని పదములు గుప్పించుట, తమకేయందని యూహను వివరింపఁ బోవుట ఊహాయే లేని చోట నున్నట్లు దోఁపఁచేయ యత్నించుట ఇత్యాది కైతవములచే కవిత్వ మర్హణమునకు మాఱుగర్హణమునకుఁ బాత్రమైనది. శ్రీ. రామిరెడ్డిగారు ఆంగ్లమునుండి కొన్న కొన్ని యభిప్రాయములఁ మననాతిరేకమున వాని స్వీయములు గావించుకొని ప్రాయికముగాఁ దెనుఁగు పలుకుబడి పోలివోవని తెలుంగున వానిం దమకబ్బములఁ గూర్చుట చేత ఆభాషణములు విజాతీయములుగాఁ దోఁపక ఆంధ్రవాణి ఏనాఁడును ధరించు నమూల్య భూషణములుగానే చూపఱకుఁ గాన్పించుచున్నవి. ఈసిద్ధి కృతహస్తులగు కతిపయ కవులకే సాధ్యము.

ఇఁక శేషించినవి "వనకుమారి"యు, "కడపటివీడుకో లు"ను. ఇందుఁ దొలిది పుట్టిన వెంటనే తన యపూర్వ సౌంద ర్యముచే మహారాజు దృష్టి నాకర్షింపఁగలిగినది. ఆవలఁ దన మనోహరాలాపములచే, మనోజ్ఞభావములచే, నానాదేశస్థ రసికజన హృదయములఁ గొల్లలాడినది. ఈ రెండింటను కవి, ఒకదాన నిర్జనారణ్యమును, ఒకదాన నాశ్రమవనవాటికను కథాస్థలములఁ గావించి, కథానాయికలఁ దమ ప్రియులతో ప్రవేశపెట్టి కథాచ్ఛలమున వారినందు విహరింపఁజేసి ప్రకృతి రామణీయక వర్ణనములందుఁ దనకుఁగల యపారతృష్ణ నపన యించుకొని యున్నాఁడు.

ఆకారమునఁ జిన్నదయ్యు, "వనకుమారి"కంటె నన్ని తెలుఁగుల నుత్తమమైనది. "కడపటివీడుకోలు". ఇది వ్రాయు నాఁటికిఁ గవియొక్క శైలి చక్కని పరిపాకమునకు వచ్చుట యేగాక, మన స్తత్త్వపరిశీలనశక్తియును మహనీయ వికాసముం గాంచినది. ఇఁక "భావనాశక్తి" కవి కుగ్గుఁబాలతోనే లభిం చిన విద్యకదా! ఏహేతువు చేతనేని కృతులన్నియు నష్టములై పోయినను ఈనూటయేఁబది పద్యములకృతి యొక్కటియే రామిరెడ్డి కవి యశస్సుం దిరముసేయఁ జాలియున్నది. రామిరెడ్డివంటి యార్ద్రహృదయుఁడు ఈ విషమదృశ్యము నెట్లు భావింపఁగలిగెనో, తనసృజించిన రసనిర్ఝరిణిలోఁబడి మునిఁగి

పోక దీనినెట్లు తుదముట్టింపనోపెనో నాతివిస్తృతకథా సం
విధానముగల యింత చిన్నకృతిలో నింతరసము నెట్లు చిప్పిలఁ
జేసెనో నాకుఁదీఱని సందేహములు. ఈకృతిని దొల్త నేను
జూచినపుడు, రామిరెడ్డి యెడఁ జనవునంజేసి కవ్యుపాలంభముగా
వ్రాసి పెక్కింటివలెనే ముద్రితములుగాక యుంచిన పద్య
ములలోఁ గొన్నింటి నిందుఁ బొందుపఱిచి, కవి కలిగించిన
నిస్సీమ నిర్వృతికి అతనికి నేఁబడిన యప్పు కొంతకుఁ గొంత
తీర్చుకొనియెద.

## ఆప్తవాక్యము.

పువ్వులలోనఁ బువ్వయి, తపోవనవాటి నలంకరించు లే
జవ్వని కీసుఁ జోడగు యశస్విపయిన్ బ్రణయంబు గొల్పి యా
మవ్వపుఁ బ్రేమవల్లి క్షణమాత్రమునన్ మొదలంటఁ గోసెదే!
యెవ్విధినోపితోయి లిఖియింపఁగ నిట్టి కఠోరచిత్రమున్.

పరిజలహృదయంబుపైఁ బ్రభుత్వము వెలార్చు
కవుల కొక్కింత కారుణ్యకలన వలదె?
ఇంత యొరియించిరే విషాదాంతకథలఁ
బ్రాక్కువీక్ష్వరు లెవరేని బరితృజనుల.

*        *        *

ఒండొకరుండవైన నిటులొత్తివచింప, నదేమొకాని, మి
త్త్రుఁడ! త్వదీయభావరస ధూర్వహ భవ్యవచః పరంపరల్
పండువుసేయు వీనుల కవార్యములై, యొలయించుఁ జేతమున్,
గొండొక నూత్నవిశ్వమునకున్ గొనిపోవును భావకావళిన్.

బ్రహ్మసృష్టికన్న బహురూప కవిసృష్టి
యజర మమర మద్భుతావహంబు;
కాన విషమదృశ్య కల్పనమ్ములకంటె
భవ్యదృశ్యసృష్టి ప్రార్థ్యతరము.

తుది భూనందనఁ గూర్చె రామునకు సంస్తుత్యంబుగా నైనఁ బూ
ర్వదశా తద్విరహావ్యథాకథనముల్ పాటించి వల్మీక జ
న్ముఁడగన్ దూఱెఁ గఠోర చేతుఁడనుచున్ భోజాధిపుం డిట్టిచో
నెదనీరై చనునీకృతిన్ జదువా రేమందురో నిన్ నెచ్చెలీ!

*　　　*　　　*

అరుణారుణాంశు నవ్యస్పర్శనంబుల
　లాలించి మమునల్ల మేలుకొల్పి
మునికన్య సరసిమున్గిన గౌతముని పూన్కి-
　మనఁజేసి తెఱపిగట్టునకుఁ జేర్చి
ఆవల వసంతంపుటాలి పాటలఁ గన్న
　సొబగు మాకనులకుఁ జూఱలిచ్చి
కేల్గేల ననిచి సఖీసఖులను బండు
　వెన్నెల నుద్యానవీథిఁ ద్రిప్పి
ఆమ్రితరుశాఖ నునిచి యుయ్యాలలూఁచి
తుదకు నడివాకలోనఁ ద్రోయుదువె వారి?
బువ్వపున్ బంతిసాగించి పోయుఁదయ్య
'నమృతమస్తు'ని చేతిలో హాలహలము!!

(16—7—1923)

రామిరెడ్డి చిత్రకారుఁడని పెక్కండ్రెఱుంగరేమో,
అతఁడు వర్ణించు దృశ్యముల మనకుఁ బ్రత్యక్షీకరింపఁజేయుట

కీకళ యాయనకు మిగులఁ దోడ్పడుచున్నదని నాయాశయము. చిత్రికారుని దృష్టి మనదృష్టికంటె విలక్షణమైనది. ఒక చిత్రి ముందీర్పవలయునన్న అతఁడు మనవలెనే స్థూలముగా ఆకార మునంతయు మనస్సునకుఁ దెచ్చుకొన్నను ఏయే భావముల నెల్లెట్లుతీర్చిన చిత్రము సజీవముగాఁ గానవచ్చునో యారహస్య మతని కప్రయత్నముగ గోచరించును. ఒక్క రేఖ, ఒక్క చుక్క, వర్ణసమ్మేళనమున నొక్కింతమార్పు, ఇట్టివానిచే నతఁడు చిత్రి మునఁ దాను వెలయింపఁ దలఁచిన భావముల నిపుణముగ నా విష్కరింపఁగలఁడు. వర్ణనాంశములలో కవి సేయు పనియు నింత కన్న భిన్నముకాదు. తొలికవితయైన "నలజారమ్మ" దొరఁకొని 'కడపటి వీడుకోలు' వఱకుంగల కావ్యపరంపరలో నెచ్చటఁ జూచినను రెడ్డిగారి యీచిత్రణనైపుణ్య మకుంఠితముగాఁ గానవచ్చుచున్నది. వర్ణితుఁడు కృషికుఁడు గానీ, ఋషి కుమారుఁడు గానీ, వర్ణిత రాకుమారిగానీ, నీటమునిఁగిపోవు మునికన్యగానీ, వర్ణ్యము పంటపొలములుగానీ, మింటఁ బ్రేలాడు జలదశకలములుగానీ, అవియెల్లఁగనులకుఁ గట్టినట్లు కానరావల సినవే. ఇట్టిస్థిరములనేకాక, చిత్రమునకందని పారిప్లవములం గూడ రెడ్డిగారు మనకు సాక్షాత్కరింపఁజేయఁగలరనుటకు గ్రంథములఁ దార్కాణములు బంధురములుగా నున్నవి.

కవి తాను ప్రత్యక్షము సేసికొనక, ఒకదృశ్యమును ఇతరులమ్రోల సాక్షాత్కరింపఁజేయ నేరఁడు. తొల్తఁదాను

జూడవలయును; వెనుక నొరులకుఁ జూపవలయును. ఆ చూపు కవివరేణ్యులకుఁగాక యన్యులకు లభించునట్టిదా? లభింప దనుటకు రామిరెడ్డియే మనకుసాక్ష్యము.

రార, సైరిక! కనుఁగొమ్ము రమ్యమైన
సస్యకేదార ఖండంబు; సత్కవీశ
భావలోచన మెరవుగాఁ బడయుచున్నఁ
గాంచనేర వంతర్లీనకాంతి సరణి.

ఇట్టి బహిర్దృశ్యములనేగాక యంతర్దృశ్యములఁ (చిత్తవృత్తుల) గూడ రామిరెడ్డి చక్కఁగాఁ దీర్చియున్నాఁడు. ఇవి తొలికృతులలో నంతగాఁ గానరావుగాని వెనుకవెనుకవానిలో వెల్లివిరిసి కావ్యశోభ నినుమడింపఁజేయుచున్నవి. "కడపటి వీడుకోలు"లో

శారదా! రమ్ముచంద్రికాస్పర్శనముల
మత్తహృదయులమై మేను మఱచినాము;
తాపసాంగన లెల్లరుఁ దరలినారు
ఉటజముల, కింక మనకిట నుండఁదగదు.

అని సంబోధించునెడ "తననామాక్షరములు" "తేనెముత్తెములట్లు" "మునితనయుని" "నోటరాలినందుకే" "ముగుద" "యంతరంగమునఁ బొందిన" "గూఢపత్నిమద" మొక యుదాహరణము. "తేనెముత్తెములు"— ఇదిద్వంద్వమా? కర్మధార

యమా? రెండవపక్షమున నర్థమేమి? అక్షరముల ముత్తెములతోఁ బోల్పవచ్చుంగాక, శబ్దమాత్రము నట్లనుట తగునా? ఈవిమర్శ "వస్త్రమూల్యవిచింతకుల"కు వదలి మనము కవిహృదయము మాత్రము గ్రహింతముగాక. మఱియు వాఁగుపై "వంతెన యట్టులు" "వంగియున్న" కొమ్మయుయ్యెల మీఁదఁ గూర్చున్న సమయమున, తమరిర్వురు వేర్వేఱుగా నున్నను వాఁగునీటఁ దమప్రతిబింబము లొండొంటి దొరయునెడ, ఆ ముగ్ధముని బాలిక చూపిచెప్పిన యీపద్యము సర్థముం దిలకింపుఁడు.

> కనుమోయీ, యనుఁగుంజెలి!
> మనయిద్దఱ నీడ లిపుడు మధురాశ్లేషం
> బునఁ దమమాత్మక లెఱుఁగని
> యనుభూతినిబొందు జడము లయ్యెను నహహా!

వెంటవెంటఁ బాటిల్లిన సంభాషణ క్రమము ననుసంధింపుఁడు. ప్రణయపరిణామముల నింత సుకుమారముగా వర్ణింపఁగల కవీంద్రుని యభిరుచి యెంత విమలమో కదా! ఇట్టి వీ కావ్యములలో ననేకములు గానవచ్చుచున్నవి.

జీవిత పరమార్థముం గూర్చి కవియాశయము లెట్టివి యని ప్రశ్నించుకొని తద్దృష్టితో నాతని కృతులఁ బరిశీలించుట ప్రాజ్ఞుల యాచారము. మనదేశమున మతమువలని కట్టు

పాట్లు అవిలంఘ్యములు కావునను, పురుషార్థవిమర్శ యొక్క-
క్కఁడును దాను చేసికొనవలసినది కాక యీవలఅకే మహా
పురుషులచే నిర్ణీతమైనది కావునను, ఆర్యకవుల ప్రబంధముల
నీ దృష్టితోఁ బరికించుట ఫలకారి కానేరదు. వారియెల్లర
దృష్టియు నొక్క-టే. కావున వారి 'సందేశమును' ఒక్క-
టియే. అవి యెల్ల నిర్ణీత పూర్వపురుషార్థాంతః పాతులు.
మన రెడ్డిగారు ఈ తెగకుఁ జేరని 'స్వైర విహారధీరు'లు.
కావున వీరికృతులఁ బూర్వోక్త దృష్టితోఁ బరిశీలించుట ప్రి
యోజకము కావచ్చును. ఇట్లుసేయుటలోఁ బాత్రౌచిత్యము
కొఱకుఁ గథా పురుషులనోట వారు పలికించిన వాక్కులు
వారి తలంపులుగా మనము భ్రమింపకుండవలయును. 'శారద'
వ్యష్టి జీవితమునందలి సుఖభోగముల నుగ్గడించినను, 'గౌత
ముఁడు' విశ్వమయ జీవితమునందలి యానందము నగ్గించినను
అవి వారివారి తలపోఁతలుగాని కవితలంపులు కానేరవు.
'వనకుమారి,' యడవిలోని స్వచ్ఛంద జీవితసుఖముల నభి
వర్ణించినను, 'రాకుమారుఁడు', రాజాంతఃపుర విలాసములఁ
బొగడినను, అవి వారివారి తలంపులుకాని కవివి కావు. ఈ
తెరచాటు మాటలలోఁ గవి హృదయ మేవంకకు ములు
సూపుచున్నదో కొంతకుఁ గొంత మనము గ్రహింపవచ్చుం
గాని యిదమిత్థమని రూఢిచేసికోరాకయుండును. అట్లుగాక,
కవి సొంతమాటల మూలమునఁ దేలు సిద్ధాంతములు మనకుఁ

ప్రమాణీకరింపఁ దగియుండును. ఈ సంపుటములోని కృతులలో 'కృషీవలుఁడు' ఆజాతికిఁ జేరినది. ఇందుఁ గవి స్వయము కృషీవలునిఁ దత్కాంతను సంబోధించి 'విజ్ఞానమత' బోధ గావించుచున్నాఁడు. ఇందుఁ గవికిఁగల కృత్రిమ నాగరకతా వైముఖ్యమును, పల్లెటూరివారి ముగ్ధజీవితమునందలి ప్రీతియు విస్ఫుటములుగాఁ గాన్పించుచున్నది. 'జలదాంగన' వృత్తమును వినుటకుఁ గవి తానే 'భావమున' 'సబ్దసారూప్యముం' బొంది యెడనెడఁ దనతలంపుల తెల్లము కావించి యున్నాఁడు. 'జలదాంగన' మంచుకొండ నెత్తముల మనోహర దృశ్యముల వర్ణించి చెప్పునపుడు కవి తత్ప్రత్య ప్రకృతి రామణీయకము సందర్శించుటకుఁ దనకును మేఘమునకుఁ బోలె కామచారము లేమికిఁ బొగులు చున్నాఁడు. 'యువకస్వప్నము' లోని 'తరుణుఁడు' కవియేయని చెప్పనక్కఱలేదుకదా. 'ప్రతీకారశక్తి' తోను 'జనయిత్రి' తోను, అతనికిఁ బొసఁగిన సంభాషణములోని యీ క్రిందిపద్యముల, జీవయాత్రా స్వరూపము — కవిగ్రహించిన తెఱంగున —మనకు గోచరమగుచున్నది.

అంతుగనరాని సాగరమందు సలిల
బిందువటు లెన్నఁడో మున్ను నేఱుపడితి;
వడుపఁ జుక్కాని లేనట్టి నావమీఁదఁ
జనుచు నున్నాఁడఁ గాలవాహినిఁ దరిపఁ.

ఎన్ని రేవుల లంగరు లెత్తినానొ!
వెండి యెన్నిట నింకను వేయవలెనొ!
నేడు నీవార్ధితటమున నిలిచినాఁడ;
రేపు తెలియదు లంగ రే రేవునందొ.

నట్టనడి బాటలఁ దుపాను గొట్టుకున్నఁ
గ్రిందిచట్టము గిరిదాఁకి వ్రీలకున్న
దెసలు గుర్తింప ధ్రువతార యొసఁగుచున్నఁ
జేరవచ్చు జన్మస్థానసీమ త్వరగ.

మఱియు, బలహీనుల నోడిచి సౌఖ్యములఁబడయు బలవంతుల దెసఁ గవికిఁగల యమర్షము ఈక్రిందిపద్యములఁ గానవచ్చుచున్నది.

బలయుతమైన జాతి యిలఁ బాలనసేయుఁ; నధర్మమయ్యు భూ
తలపతి ముద్రవడ్డ నది ధర్మము యౌను; బ్రజాళి సౌఖ్యముం
దలఁపక యాత్మభోగపరతం జరియించు వసుంధరాపతుల్
పలువురు లోకకంటకులు పాలనసేయఁగ శాంతికల్గునే?

కడుపునకుఁగూడుదొరకక గాసిఁజెంది
అన్నమును దొంగిలించిన యతఁడు దొంగ;
రాజ్యలోభంబునను బరప్రజలహత్య
సలుప నసిఁబూన ధర్మశాసనుఁడతండు!

సంఘసరసి దురాచార శైవలములు
గప్పివైచెను నీరంబు కంపుపట్టు;
సతము స్వాతంత్ర్యముంగోరు సారసములు
నిలువ నొక యంగుళంబైన నెలవులేదు.

మొత్తముమీఁద, కవి కవిత్వమునందుంబోలె సాంఘిక రాజకీయములందును కృత్రిమ నిర్బంధములనుండి విడివడి సత్య సరణి గమనింపఁ గోరుచున్న స్వాతంత్ర్యలాలసుఁడు. ఇఁక, నాధ్యాత్మికమునందో, శారదా గౌతముల సంభాషణములు తుల్యబలము కలిగియున్నను, కవికి గౌతముని పక్షమే యాదర్శ ముగాఁ దోఁచె ననుట యుక్తము. ఐనను రెడ్డిగారు ఆదర్శ ములకొఱకును, ఉపదేశముల కొఱకును వ్రాయువారు కారు. వారు రసపిపాసువులు. రసముకొఱకే వ్రాయుదురు. అది యెందున్నను, విషయమునుండి పిండి కోరిలఁగల సమర్థులు. ఇంతియగాక దాని నితరుల కందీయఁగల రససిద్ధులు. కావుననే, "కడపటివీడుకోలు"లో భోగాస్థైర్యము సంతగా వర్ణించిన రెడ్డిగారు కామోపభోగపరమైన "పానశాలం" గూడఁబాఠకుల కుపాదేయ మనియే దోఁచునట్లు వ్రాయఁగల్గినారు. కవిడెందము విరాగ భోగములలో నొకఁ డొప్పు డొకపరికి వేఱొకప్పు డొక పరికిఁ దూఁగు సందిగ్ధావస్థయందున్నదని మన మూహించుట యసమంజసముకాదు. అది జీవహృదయపరిణామమునఁ బర మార్థమునకు నసతి దూరముననున్న యొక యవస్థా విశేషము.

కథాపురుషుల చిత్తవృత్తుల, కథాంశముల, కనికట్టు విద్యచేతంబోలె మనమోరిల స్ఫురింపఁజేయు శబ్ద వర్ణనల యొక్కయు, సంభాషణములయొక్కయు నౌచిత్యముచేతను, రెడ్డి

గారి కవిత యందలి యర్థవిభవ మెంత మనోహరముగా నున్న దో, ప్రసాద సమృద్ధిచేతను, శయ్యాసౌభాగ్యముచేతను, శబ్ద వైభవము కూడ నంత శ్రవణసుభగముగా నున్నది. ఈయ నకుఁ గొన్ని యేండ్లనాఁడు బెజవాడలోఁ గూడిన 'యాంధ్ర మహాసభ' వారు 'కవికోకిల' బిరుదముం బ్రసాదించియున్నారు. అది యెంత యుచితమో యీయన కృతులఁ జదివి మాధు ర్యము ననుభవింపఁగల సరళ మతుల కెఱుక. ఈబిరుదమునకుఁ గవియు నెంత సంతుష్టుఁడై యుండవలెనో ఈనవప్రియుఁడు వన ప్రియములం గూర్చితనకృతులలో నందందు వ్రాసిన యీపద్య ములంబట్టి యూహ్యము.

గొఱియలమేఁతకుఁ గిరులు కోమల ఘాస లతా నికుంజ ని
ర్ఝరకలితంబులై యచట రాజిలునే? హరిణీ కుమారికా
త్కరములు నిర్భయాత్మలయి కానఁగనౌనె తృణాంకితావనిన్,
సరస కలాస్ఫుటారవము సల్పు పికాంగనలున్నె మావులన్.

కలరవ కోమలంబగు వికస్వర సుస్వరమెత్తి నీహృదిం
గల సరసానురాగ మెసకమ్మగఁ బాడెద, విట్టివిద్య నెం
దుల మును నభ్యసించితివి? దుఃఖ నిమగ్నను జేయుచుం బ్రియసుం
డలవడఁ డేమొ నీకును బికాంగన, పల్కుము ముద్దుగుల్కఁగన్.

మధుర మధుమాసనిశ గున్నమావియందుఁ
గొమ్మలాకుల నేడనో గూరుచుండి
ముగ్ధమగునాటవిక గానములను జేయు
కోకిలను నేను బ్రేమింతుఁ గువలయాక్షి.

వెనుక వేయిగుణములున్నను కావ్యములలోఁ దొలుత నావశ్యకమైనది శ్రవణప్రసాదనము. దీనికిఁ దనిసియే కదా పూర్వులు కథాసృష్టి రసపోషణాదులు లోకోత్తరములుగా నున్నను వాల్మీకిం గోకిలమని కొనియాడినది. 'మధుర' మను టతోఁదనియక 'మధురాక్షరమ్మ 'నియన్న యాప్రశంసకుని పద లాలిత్య పరాయణత్వముం బరికింపుఁడు. ఇట్టి పదలా లిత్యమును,అర్థగాంభీర్యముతో సమరసింపఁజేయఁగల రచయిత కృతార్థుఁడు. అట్టి కృతార్థకతిపయులలో రెడ్డిగారు ఒకరు.

ఈసంపుటములో చ్యుతసంస్కారములు క్వాచిత్క ముగాగానవచ్చు చున్నవి. అవి పన్నీటి పుష్పము నంటియున్న కంటకములవంటివి. వాని నంటక, యచటి సౌరభము ననుభ వింపఁగల వారే వివేకులు. రెడ్డిగారి తక్కినగ్రంథ సంపు టములునుగూడ నవిలంబముగ వెలువడి రసికవరుల కరములఁ గైసేయుఁగాతమని యాశించుచున్నాఁడను.

| | |
|---|---|
| నెల్లూరు.<br>విజయదశమి, భావ,<br>17—10—1934. | దుర్భా సుబ్రహ్మణ్యశర్మ,<br>ప్రధానాంధ్ర పండితుఁడు,<br>కలాశాల. |

# శుద్ధిపత్రము

## కృతజ్ఞత

| పుట. | పద్యము. | పంక్తి. | తప్పు. | ఒప్పు. |
|---|---|---|---|---|
| iii | 1 | 4 | స్వగృహమును | స్వభవనమును; |
| iv | 3 | 4 | దారకమై | ధారకమై |

## నలజారమ్మ

| పుట. | పద్యము. | పంక్తి. | తప్పు. | ఒప్పు. |
|---|---|---|---|---|
| iii | 2 | 2 | పకృతి | ప్రకృతి |
| 12 | 31 | 4 | భక్తిశ్రిధ్ధలతోఁడఁగ | భక్తిశ్రిద్ధముఁదోలఁగ |
| 13 | 37 | 2 | గూండు | గూండ్లు |
| 15 | 48 | 4 | టుదుటుదీర | టుదుటుదీఱ |
| 16 | 51 | 1 | బిలల | బిల్లల |
| 16 | 53 | 4 | బొనరుచునుండంగ | బొనరుచుచుండంగ |
| 28 | 106 | 3 | యేమనఁ,దొయ్యలి | యేమనఁదొయ్యలి, |
| 29 | 115 | 4 | దిజ్ముఖ | దిఙ్ముఖ |
| 33 | 127 | 5 | గుండాలఁ | గుండానఁ |

## వనకుమారి

| పుట. | పద్యము. | పంక్తి. | తప్పు. | ఒప్పు. |
|---|---|---|---|---|
| 41 | 2 | 2 | బొరిసారఁ | బొరిఁజొరఁ |
| 49 | 35 | 2 | దంటుఁవనిం | దంటలవనిం |
| 52 | 47 | 2 | రుధిరమున | రుధిరమును |
| 57 | 24 | 4 | దేహసౌష్టవ | దేహసౌష్ఠవ |

| పుట. | పద్యము. | పంక్తి. | తప్పు. | ఒప్పు. |
|---|---|---|---|---|
| 61 | 41 | 4 | మొందదెగ్రిప్మజ | మొందుశగజ్జ |
| 64 | 8 | 1 | జిలుపుఁగ్గలు | జిలుపుఁగ్గల |
| 65 | 11 | 4 | గాయఁగణ | గావగణ |
| 77 | 34 | 1 | నిటుల | నిట్టుల |
| 79 | 47 | 2 | లగ్గలుపట్టు | ముట్టడివేయ |
| 82 | 4 | 4 | తట్టుల | తట్టున |
| 94 | 21 | 1 | బఱఁగు | బరఁగు |
| ,, | ,, | 3 | నీలనీలద | నీలనీరద |
| ,, | 23 | 3 | పుష్పాకీణులుం | పుష్కరిణులుం |
| 95 | 26 | 1 | పదపాంను | పదపాంసు |
| 98 | 41 | 2 | నక్షత్రిమున | నక్షత్రికుల |
| 101 | 4 | 1 | లడంచ | లడంప |
| 106 | 25 | 4 | దెఱను | దెరను |
| 108 | 36 | 4 | మనోహర, | మనోహర |
| 110 | 47 | 3 | ఽలీన | ఽలీన |
| 111 | 2 | 4 | మేఁగ | మరిగ |
| 111 | 3 | 1 | విసినమందు | ఽపినమందు |
| 119 | 42 | 4 | దుర్ధమం | దుర్దమం |
| 120 | 43 | 2 | మున్ను నేలిన | పూర్వమేలిన |

## కృషీవలుఁడు

| పుట. | పద్యము. | పంక్తి. | తప్పు. | ఒప్పు. |
|---|---|---|---|---|
| 135 | 2 | 2 | నిడుకొన్న | నిడికొన్న |
| 136 | 5 | 2 | వేనీళ్ళు | వేన్నీళ్ళు |

| పుట. | పద్యము. | పఙ్క్తి. | తప్పు. | ఒప్పు. |
| --- | --- | --- | --- | --- |
| 143 | 32 | 1 | దగును | దగునుగాని |
| 144 | 37 | 3 | బాంధ్యవమున | బాంధవ్యమున |
| 144 | 39 | 4 | బూరేకుఞ్ | బూరేకుల్ |
| 145 | 45 | 4 | నురలె | మరలె |
| 146 | 49 | 3 | నింట్రికి | యింట్రికి |
| 152 | 77 | 3 | కొదువ | కొదవ |
| 155 | 92 | 2 | మరుగు | మఱుఁగు |
| 156 | 99 | 1 | గుచ్చివిడ్డ | గుచ్చిలిడ్డ |
| 158 | 102 | 4 | ధాన్యంబుటప్పు | ధాన్యంపుటప్పు |
| 159 | 106 | 1 | పంచాయసతీభా | పంచాయతీసభా |
| 160 | 111 | 2 | సాంధ్యలక్షి | సాంధ్యలక్ష్మి |

---

## జలదాంగన

| పుట. | పద్యము. | పఙ్క్తి. | తప్పు. | ఒప్పు. |
| --- | --- | --- | --- | --- |
| 166 | 4 | 2 | కేఁకులు | కేకులు |
| 167 | 11 | 4 | యరుదెంచెనంగ | యరుదెంచెననంగ |
| 168 | 13 | 2 | నేలకో | నేలోకో |
| 168 | 16 | 3 | చెప్పింపనాసయేమి | జెప్పింప నాసయేని |
| 169 | 17 | 2 | సమస్తముఞ్ | సమస్తవిశ్వముఞ్ |
| 171 | 31 | 4 | సెలవుకన్నెకున్ డాజ్ఞించు | సెలవునకుమించి యాజ్ఞించు |
| 172 | 32 | 4 | యకావికలై | వకావకలై |
| 173 | 37 | 4 | యపూర్వపు | అపూర్వపు |
| 178 | 64 | 1 | గగనంబులకుం | గగనంబునకుం |

| పుట. | పద్యము. | పంక్తి | తప్పు. | ఒప్పు. |
|---|---|---|---|---|
| 182 | 82 | 1 | (ఈసీస పద్యముయొక్క నాలుగు పాదములలోని వలకాల, వలకేల, వలరొమ్ము వలకొప్పు, అను పదములు డాకాల, డాకేల, డారొమ్ము, డాకొప్పు అని అర్థము చేసికొనవలయును. ఈపద్యమును ఈతూరి ముద్రణమున మార్చివ్రాసెదను.) | |
| 186 | 99 | 2 | గారుచు | గాఱుచు |
| ,, | ,, | 4 | యాత్మవికత్వము | యాత్మవికలత్వము |
| ,, | 101 | 4 | కనుల | కలను |

## యువకస్వప్నము

| | | | | |
|---|---|---|---|---|
| 189 | 1 | 1 | నాంద్రమ్ముగన్ | సాంద్రమ్ముగన్ |
| 190 | 7 | 4 | హారముల | హీరముల |
| 191 | 8 | 4 | గాంతిలుచుండె | కాంతిలుచుండె |
| 193 | 19 | 1 | దడసిన | దడిసిన |
| 195 | 32 | 2 | గిరిదాఁక | గిరిదాఁకి |
| 197 | 46 | 3 | స్యాతంత్ర్యము | స్వాతంత్ర్యము |
| 205 | 87 | 1 | స్పర్శవేది | స్పర్శవేధి |
| 206 | 92 | 3 | జనింపఁగఁ | జనింపఁగవల్లఁ |
| 206 | 93 | 1 | మ్రొక్కివిూ | మ్రొక్కియూ |

## కడపటి వీడుకోలు

| | | | | |
|---|---|---|---|---|
| 214 | 7 | 1 | తియ్యదనాలకు | తియ్యఁదనాలకు |
| 215 | 11 | 1 | బారెడు | బారెఁడు |

| పుట | పద్యము. | పంక్తి. | తప్పు. | ఒప్పు. |
|---|---|---|---|---|
| 217 | 20 | 1 | ఊఁకులు | ఊకులు |
| 219 | 32 | 2 | గారింప | గాఱింప |
| 220 | 34 | 4 | వీ:కల | వీధికల |
| 224 | 57 | 1 | కేఁగిఃట్రి | కేఁగుదెంచు |
| 225 | 59 | 3 | దిఁగగారఁగ | దిగఁగాఱఁగ |
| 228 | 73 | 4 | కిపని | కి వని |
| 228 | 76 | 3 | గాఁటుక | గాటుక |
| 231 | 87 | 1 | సంజయొ | సంజయు |
| 231 | 89 | 4 | శీతసు ధేంద్రజాలికి | శీతసు ధైంద్రజాలిక |
| 232 | 93 | 4 | దీరిక | దీఱిక |
| 234 | 103 | 4 | లెడను | లెడలు |
| 234 | 104 | 3 | నూత్మ | మాత్మ |
| 239 | 128 | 1 | చక్క.దనాల | చక్కఁదనాల |

---

# బాష్పాంజలి.

---

ఏబాలలేనగ వెలమి హృత్కుముదంబు
 వికసింపఁజేయు చంద్రికలగుంపు,
ఏకందు వదనేందు వింపారనాకన్న
 వెన్నెలపులుఁగులు గన్నవిందు,
ఏకొమ్మ మవ్వంపు టీక్షణంబులు మేన
 వర్షించునమృతంపు వానజాలు,
ఏపాప మురిపెంపుఁ దీపు క్రొంబలుకులు
 వీనుల కవ్యక్తమైన ముదము,

అట్టిలావణ్యసీను పుణ్యప్రకాము
చిన్నిప్రాయంబున న్దివిఁజేరినట్టి
రుక్మసమదేహ చిన్నారి రుక్మిణమ్మ
నాదుచెల్లెలి స్మరియింతు నాదరమున.

జలదమునందుఁగ్రొమ్మెఱుఁగుచాడ్పునఁ గన్నులఁగట్టియంతలోఁ
జెలియల, పోయితే పకృతి జీవనమెంతయు దుష్టమంచు; నీ
కలికిమొగంబు నేఁటికిని గన్నులఁగట్టు, ననూనభావనా
విలసితమూర్తియై; ప్రణయవేగము కాలములెక్కసేయునే?

నినుఁ దలపోసినయంతనె
కనుగొనలను దుఃఖబాష్పకణములు జాఱున్;
మనప్రేమ లతలఁ గాలం
బను ఖడ్గముగోయఁజాల దనుజాత, వెసన్.

ఇరువదివత్సరంబులకె యేమని దెల్పుదుఁ జెల్లెలా, వ్యథా
భరమునఁ గ్రుంగెఁ జిత్తము; ప్రభాతమనోహరమయ్యు లోకము
త్కరతిమిరావిలంబగు విధంబునఁ దోఁచు; మహిం జరించు లే
కరము నసహ్యమయ్యెఁ; జనఁగాఁదడవేలొకొ స్వర్గభూమికిన్.

ప్రణయసూత్రంపు టురులలోఁ బదిలపఱచి
చేదికో నన్ను దివిసేర శీఘ్రగతిని
చెల్లెలా, యేమిసెప్పుదుఁ జిత్తమిపుడు
చెప్పరానట్టిశూన్యతఁ జెందెనేమొ!

కష్టసుఖవార్ధి కల్లోల కాండములను
ముందువెనుకలు దెలియక మునుఁగ నేను
నంబరాపగా సికతాస్థలంబులందు
నాడరమ్మని పిలిచెదో యమ్మ, నీవు.

విమలసంధ్యామనోజ్ఞ పశ్చిమదిశాంబు
జాక్షిగర్భంబునందు గాఢాంధకార
సంతతులువుట్టె చెల్లెలా, చతురసృష్టి!
చిత్రశల్యంబ యుజ్జగజ్జీవనంబు.

మంజులనందనాంతర సముంచితకల్పలతాకుడుంగ మం
దంజిక లేక రత్నరచితాయతవేదిక విశ్రమించి, గం
గం జరియించు చల్లనగు గాడ్పులుసోక ముదంబునొందుచున్
సంజమనోజ్ఞదీధితుల సఖ్యము నెంచెదు రుక్మిణమ్మ, బా
ష్పాంజలితోడ నీకుఁ గృతి సంకితమిచ్చితిఁ గొమ్ము ప్రేముడిన్.

ఇట్లు, నీప్రియసోదరుఁడు.

శ్రీ

# నలజారమ్మ.

శ్రీలలనా దృగంచల వశీకృతుఁడాయెను గృష్ణుఁడంచు రా
ధాలలితాంగి యుల్కమెయిఁ దల్పమునం బవళింప "నింత కాం
తాళమ ప్రేయసీ," యనుచుఁ దన్వి కపోలము పుల్కరింపఁగా
హాళిని ముద్దులాడెడు మురాంతకుఁ డోముత భక్తలోకమున్!

చెక్కుల దానధారలకుఁ జిత్తమురంజిలఁ దేఁటి కూటువల్
ద్రొక్కిడిగాఁగ మూఁగ నెటుఁదోఁపక పందిరి నల్లియున్న సొం
పెక్కిన చంపక స్తబక మేడ్తెఱఁ ద్రుంచి మిళిందబృందమున్
గ్రక్కునఁదోలుఁ విఘ్నపతి కావ్యవిఘాత లతా లవిత్రుఁడై. 2

సరసిజసంభవాస్య నవసారస సారమరందపాన త
త్పరత ముదంబు నొందకయు తద్దయుఁ బండిత చిత్తనీరజో
త్కర మకరంద పానవశతం గడు జొక్కెడు నల్వరాణి నా
దు రసనఁ గొల్వుదీరి రసతుందిలకావ్యము వల్కఁగావుతన్! 3

బాలుఁడనయ్యు నీకృపకుఁ బాత్రుఁడనంచుఁ దలంచి పూర్వమేఁ
జాలకృతుల్ రచించితిని సారససంభవురాణి, వాణి, మ
ద్బాలదశా విశేషములు వాయకమున్న రచింతుఁ గావు స
చ్ఛీల పవిత్రమాచరిత, చిందఁగఁగమ్మని పూవుఁదేనియల్. 4

సారకవిత్వసంఘటన చాతురిగల్గుట పూర్వజన్మ సం
స్కారమటంచుఁబల్కెదురు సత్కవివర్యు; లదెట్టులున్న ని
ష్కారణ వత్సలత్వమున సంతతము న్నను బ్రోచినట్టి త్వ
త్కారుణికత్వముం దలఁతుఁ దామరసోద్భవచిత్తహారిణీ! 5

అనిశముఁ బుష్పితద్రుమమునందు వసించియుఁ జీడపుర్వు త
ద్ఘన కుసుమాసవంబునకుఁగా మతిసేయునె పండుటాకులం
దిని మనుఁగాక; షట్పదము తియ్యని తేనెలు గ్రోలి మోదముం
గనుఁ; నిటులేగదా తెలియఁ గాకవి సత్కవి తారతమ్యముల్!

శ్రీసింహపురీ మండల
కాసార మరాళమనఁగఁ గాంతిల్లి రమా
వాసంబయి సతతంబును
వాసి న్గాదూరు మిగుల వర్ధిలుచుండున్. 7

ఖులలను సంస్కరింపఁ దమకమ్మున శిష్టుల రక్షసేయఁగా,
నిల హరి విగ్రహంబయి రహింపఁగ, నంత వికుంఠవిష్టపం
బలరఁగ దేవతాయతన మయ్యెనొ నా నణికెక్కు నప్పురిం
గల ప్రతిదేవమందిరము కందసమాశ్రిత గోపురంబుగన్. 8

నెలకొని భూసురోత్తములు నీరజ షండపరాగ పూగ సం
కలిత జలపరిపూర్ణమయి క్రాలు జలాశయమందు వేకువన్
సలిలములాడి వేదవిధి సక్కఁగఁదీర్చి విధాతలో యనం
జెలువుగ వేదశాస్త్రములు సెప్పుచునుందురు శిష్యకోటికిన్. 9

జానపదులు గోధు చక్కెఱ బెల్లంబు
నుప్పుమిరపకాయ పప్పులాది
వస్తు నికర మమ్మి వైశ్యు లార్జోలను
నర్థనిధులఁగూర్చి యలరుచుంద్రు. 10

కుక్కుట జాలంబు కొక్కొరోయని కూయ
నీల్గుచు మూల్గుచు నిదుర లేచి,
యతివల కౌఁగిళ్ళ నల్లన సడలించి
తల్పంబులన్ డిగి తడవికొనుచుఁ,
బడకటిండ్లను వీడి తడుపుఁ బాతయుఁ జేతి
కట్టియుఁ గైకొని కడురయమునఁ
బైరుపచ్చలుచూడఁ బసులను గాపాడ
మడవలుగట్టంగ మడులుదున్న

నెండవాన లనాక యుద్దండలీలఁ
బ్రొద్దువొడిచిన దాదిగాఁ బ్రొద్దుగ్రుంకు
వఱకుఁ బొలములఁ గష్టించి వచ్చుచుందు
రప్పురంబున యువకులో హాలికవరులు. 11

పైరులుఁబంటలుంగలిగి పంటవలంతికిఁ బచ్చతాల బం
గారపుఁ గొప్పు బిళ్ళలనఁగాఁ జెలువొప్పును నప్పురంపు ము
క్కారులు పండుచేలు, మును గాఁపులొసంగిన యప్పుదీర్ప న
ద్ధారుణి ధాన్యరాసులను దాఁచిన గాదులనంగ మీఱుచున్.

ప్రోలికి దక్షిణంపుదిశఁ బుష్కరపుష్కలమై, ప్రకంపనాం
దోళిత వీచికానికర తుందిలమై, కలహంసచక్రమీ
నాలయమై, విశుద్ధసలిలాశయమై తనరుం దటాక ము
త్తాల తటావృతంబునయి తగ్గక నీరు నిదాఘకాలమేన్. 13

చెఱకుగానుగలను జిందిన రసబిందు
లాన నీఁగలు ఝుమ్మురంచుమూఁగఁ;
జెఱకుఁబిప్పినిమేసి చెలువాఱు సెలపెయ్య
దాటులు బీళ్ళకుఁ దరలుచుండ ;
నెదురుమోసులు తుంగ కుదురులు తెగమెక్కి
యూరపందులబారు గేరితిరుగ ;
గళమునందున వ్రేలు గంటలుమ్రోయంగ
మేఁకమందలు పచ్చ మేఁతకేఁగ

బనికిఁగొఱగాని సోమరి పడుచువాండ్రు
దిరుగుచుండఁగ బాజారు తెరువులందుఁ,
బల్లెటూరి మిటారులు పణ్యవీథి
బేరమాడఁగ సవ్వడు దోరమలరు. 14

ఆపురమందునఁ గాఁపుల
కాఁపురములు పెక్కుగలవు కంజాలయకుం
గాఁపురములు, నతిథులకుఁ
దాపురమైనట్టి యన్నదానపుటిక్కల్. 15

అవ్వీటి కాఁపు మేటులందు. 16

కొలిచిన మూరకెక్కుడగుగొప్పయురంబును, మాంసలంబులై
మెలికలుకొన్న బాహువులు, మిట్టనొసల్, రుదురాకవన్నె చె
న్నొలసెడు మేనిసిగ్గుగల యొక్కఁడు వెంకటరెడ్డినాఁగఁ బే
ర్వెలసెను గష్టజీవియయి పెద్దలనాఁటి ధనంబు లొప్పఁగన్.

వాయురోగంబునందాను బాల్యమందు
వనర, నతనికి జనయిత్రి పసపుఁజేత
నుదుటఁ గాల్చిన మచ్చసొంపొదవుచుండు
నిటలలోచను మూఁడవ నేత్రమనఁగ. 18

చెరువునీటనుమున్గఁ జేవురించెనెగాని
పెన్నెరి విప్పిన వెన్నుదాటు;
స్ఫోటకచిహ్నాలు వాటిల్లినేగాని
మొలకనవ్వులుగుల్కు ముద్దుమోము;

కావడిమోఁతలఁ గాయగాచెనెగాని
భుజపాళి యుబ్బి సొంపులుఘటించుఁ;
జదువురాకుండుటఁ గొదుకుమాటలెకాని
చతురత సుంతైన సందువోదు;
మడవకట్టుగాండ్రి మడవవ్యాజ్యములలోఁ
దనదె పెద్దగొంతు దనరుచుండు;
సేద్యమందు వళవు సెప్పఁజాలిన మేటి;
పట్టువిడుపుదెలియు దిట్ట యతఁడు. 19

పెరుమారెడ్డి సువంశమందుఁగలిగెం బెంపార నొక్కర్తె మున్
సిరివారాన్నిధి నుద్భవించినటులన్ శృంగారపున్దీవియో,
సరసంబౌ నవనీత విగ్రహమొ నా జానొప్పు నక్కన్యకన్
హారువొప్పారఁగఁ బెండ్లియాడె హాలికుం డానందనిర్మగ్నుఁడై.

నలజారమ్మ యనంగను
సలలితమౌపేరుగల్గి సారసముఖి, కాఁ
పుల పూఁబోఁణులఁ దానొక
తలమానికమటులఁ దనరెఁ దలమా పొగడన్! 20

నిమ్మపండువంటి నెమ్మేని జిగితోడఁ
గురుల నీలిపసలు గునిసియాడ,
గంగ యముననీరు గలిసిపారినరీతిఁ
జెలియసోయగంబు చెలువుమీఱె. 22

కన్నుఁదమ్ములు పెద్దవేగాని, కొనలఁ
బచ్చవాడిచిన సోగలు పరిఢవిల్లఁ
గాంచువారికి మఱియింతగాఁగ, జిగులఁ
గ్రుమ్మరించుచుఁ గందోయి కులుకులెసఁగు. 23

సందిటఁ బచ్చలబాజీ
బందులపస నొసఁగుచుండఁ బచ్చవొడుపుఁ బూ
వుండీపల యందము లా
కుందరదన బాహులతలకుం దొడవులనఁ. 24

పూవుఁగొమ్మల నెలదేంట్లు మూఁగి జుమ్మ
జుమ్మరంచని రవళించు జోకదోఁపఁ
గాంత మణిబంధయుగమునఁ గాంతిగొల్పు
జిలుఁగు నీలాలగాజులు నులివులొలయు. 25

నల్లబూసల పేరులో నాణెమైన
గిన్నెబొట్టు, కడానివంకీలు, మట్టె,
లంచుకమ్మలు, ముక్కెర యందమెసఁగుఁ
గలికినెమ్మేని నిగ్గుల చెలిమి కలిమి. 26

దైవభక్తిగల్గి దైవాఱు నాసతి
పతియె దైవమంచుఁ బ్రణుతిసల్పుఁ,
దొలసి పూజసేయు దురితకార్యంబులఁ
జిత్తమందుఁ జింతసేయ దెపుడు. 27

ఇంటికి నమ్మ, భిక్షుని యెవ్వరువచ్చినఁ బొమ్మపొమ్మ నీ
వంటిరుచాలమంది యని వాదులుసల్పక వడ్లో, బియ్యమో
వంటకమో తగుంగొలఁది వచ్చినయర్థుల కిచ్చి పంపు వా
ల్గంటి ప్రమోదచిత్తయయి, కల్గినదిద్దియె యంచుఁ జెప్పుచున్.

ఇరుగులనున్న వారి తగు వెయ్యది యేమనితీర్పనేగదా
పరమపతివ్రతామణి ప్రభాతమునందున గేహకృత్యముల్
సరగునఁదీర్చి రాట్నమును సజ్జనిత్రిప్పుచు వడుకుచుండు సుం
దర బిసనాళ తంతువు లనందగు సన్నని నూలుపోఁగులన్.

పరపురుషాస్యముం గనినఁబద్మవిలోచన మోమువాంచుఁ; దాం
దరపని లేకయున్న నిలుఁ దా విడనాడదు; పోదు మాటికిం
బరగృహ పణ్యవీథులకు; బంధులఁజూచినఁ దల్లిదండ్రులం
గరమనురక్తిఁ గాంచినటుగా మరియాదలు సల్పుఁ బ్రీతిగన్.

పతి చిత్తవృత్తిఁ గనుఁగొని
సతతము నతఁడాజ్ఞయిచ్చు చొప్పున వ్యతిరే
కతలేక కార్యముల నా
సతి సేయుచునుండు భక్తి శ్రద్ధలతోడన్. 31

ఈరీతిఁ గొంతకాలము
సైరిక మిథునంబు ముదము సంధిల్లఁగ సం
సారము సేయుచునుండెను
దూరీకృత దురితముగ నధోక్షజుభక్తిన్. 32

పొలమున కేగియున్న పతి భోజనకార్యము దీర్పరాక యు
న్న, లలనయింటరాట్నము ఘనంబుగఁద్రిప్పుచుఁజూరునందుఁగి
లికిలమనిపలుకు పిచ్చుకల క్రీడలుసూచుచునుండ నంతలో
వెలుపలనుండి పిల్లలకు వేగమ మేఁతలు దెచ్చె తల్లియున్.33

తల్లినిజూచి పిల్లలు ముదంబునఁ గంధరముల్ నిగుడ్చి సొం
పుల్లసిలంగఁ జంచువుల నొండొరు మీఱఁగఁజాఁపి యేపునం
గిల్లని తల్లియున్న దెసఁ గ్రిక్కిఱియం, గలవింక మంత న
ల్లల్లన మేఁతవెట్ట నది యంతయుఁగాంచుచునుండెఁగాంతయున్.

అంతరంగంబున వింతవొడమ నయ్యలికుంతల యీరీతిఁ
జింతించు:

ఔరా! సృష్టివిచిత్రిమెన్నఁదరమా? యంభోజగర్భుండు సొం
పారం బిట్టకునైన నిట్టి వలపత్యంతంబుఁ గల్పించి సం
సారాం భోధితరంగ డోలికల నూఁచంగల్గె నీ లోకమున్;
ఈరీతిన్ విధిసేయకున్ననగునే యొందైన సంసారముల్. 36

ఱెక్కలు వచ్చినంతనె తటాలగని పాడఱ వీడి నీడ మే
దిక్కున నేకుజంబులనొ తేఁకున గూండ్లు రచించి తల్లియున్
మక్కువ లేకయుండు కసుమాలపుఁ బిల్లలమీఁదఁ బక్షికీ
మక్కువయున్నదే! యింకను మానవులన్వలపుంట దొడ్డమే?

పిట్టలకైనఁగాని యిటు పిల్లలఁజూచినయంత నుల్లమం
దెట్టులనుండునో మమతయెవ్వరికైనను జెప్పశక్యమే?
కట్టిడిగాఁడె బ్రహ్మయును కౌతుకయుక్తులఁ జేసిపక్షులన్
దిట్టతనాన నన్నుఁ గడుదీనత సృక్కఁగఁ జేసె నక్కటా! 38

మునుబుడబుక్కవానికిని మోదమునన్ జరిచీరయిచ్చు నా
కనువుగ వంశితాయెతున యంత్రముసంఘటియించి యిచ్చెనా
యనఘుఁడ; దేమొకాని యటులైనను నొక్కయపత్యమింతకుం
బనవుటెకానికల్గదుగ! ప్రాగ్భవ దుష్కృత మెంతగాఢమో? 39

నాసరి వారిజాక్షులు మనంబున సంతసముప్పతిల్ల వి
శ్వాసమునం దనూజులను జక్కలిగింతలు వెట్టి పాద వి
న్యాసవిలాసముం గనుచు నాననచుంబన మాచరించుచున్
వాసరముల్ తమింగడుప నాకిటు వంజతనంబు చెల్లునే? 40

పూర్వం బెట్టియఘంబు సల్పితినొ? యేపుణ్యాత్మ సంఘంబులన్
గర్వాంధంబునఁ గష్టవెట్టితినొ? యేకళ్యాణి సత్పుత్రి నే
సర్వాంగంబుఁ గఠోరశస్త్రికలచే స్రగ్గించినానో? నను
బర్వెం దద్వృజినావళుల్ కటకటా! వంధ్యాత్వమూలంబునన్

కలుగునొ కల్గఁడో సుతుఁడు గన్నులకానెతగాఁగ; పాలడాల్
గులికెడు లేఁతబుగ్గలను గూరిమి ముద్దిడు భాగ్యమబ్బదో?
యిల సుతహీనయైన సతి కేమిసుఖంబగు? భోగభాగ్యముల్
బలిసియు వ్యర్థమౌఁగద, క్షపాకరహీన నిశా విధంబుగన్, 42

అనిఋటులఁదలపోయుచు దుఃఖాక్రాంతమానసయై.

లలితపుఁ బద్మపత్రి ముకుళంబులనుండి స్రవించు తేనెకా
ల్వలవలె బాష్పపూరములు పద్మదళాక్షి దృగంచలంబులం
దొలఁకి పయోధరాగ్రములతో నెకసక్కెములాడుభంగి, న
ప్పొలఁతుక వెక్కి-యేడ్చె నిజపూర్వకృతాఘనిదాఘతప్తయై.

అంతఁ బొలంబెల్లఁ గలియంగుమ్మరి యుస్సురనుచు
నా హాలికుండు. 45

పటు సూర్యాతప సంహతి
నిటలంబున ఘర్మబిందునికరము లొలయం
దటుకునఁ జని యాటికిఁ బ్రి
స్ఫుట దుఃఖవివర్ణవదన సుదతినిగాంచెన్. 46

కాంచి, విషాదము పెనఁగొనఁ
జంచన్నవ పల్లవాంగి చక్కి-కరిగి, యో
పంచాననమధ్యా, యీ
సంచున శోకింపనేల? సదయతఁ జెపుమా. 47

ఇరుగుపొరుగు గఱితలెవరైన నీతోడఁ
దగవు పెట్టికొనిరో? తల్లిదండ్రు
లేమితిట్టినారొ? లేమరో, సెప్పుము
హృదయముందుఁ గుందు టుదుటుదీర. 48

విరిసిన తమ్మిఁ దేఁటిజత వేడ్కమరందముఁగాని యెక్కుడై
న రసము గ్రక్కెనో యనఁగ నాతిరొ, కన్నుల బాష్పపూరముల్
పారలఁగనేల? కేలను గపోలము నూనఁగనేల? బేలవో?
చిరుతవొ? చెప్పరాదొ? యని చింతదొలంకఁగ భర్త యత్తఱిన్

అన; విని కాంచనాంగియు దృగంచలకాంతి విషాదతప్తమై
కణికలు గట్టెనో యనఁగఁ గజ్జలసమ్మిళితాశ్రుబిందువుల్
గునియుచుఁ గన్నులం దొరఁగ గోటను మీటుచు, దంతదీధితుల్
కనదధరోష్ఠరాగమును గప్ప వచించె విపంచికాధ్వనిన్. 50

పిట్టలకైన సంతసము పేర్చును బిల్లలఁ గూడియుంట; నా
కట్టిడి బ్రహ్మ యేలొకొ సుఖంబులు సంపదలిచ్చి యొక్కనిం
బట్టిని గల్గజేయఁడు? ప్రపంచము నందిఁక నిట్టి జీవితం
బెట్టులఁ బుచ్చనౌను; హృదయేశ్వర, యీశ్వరమాయ యెట్టిదో!

అనవిని, భర్త యిట్టులను: నంబుజనేత్రరొ, యీశ్వరున్ వృథా
పనవుచు దూఱనేల?; మనపాపము కొండలమీఱ నూరకే
వనరిన నేమిసేయఁగల వారము? పారము ముట్టకుండు నే
మనదగు కోర్కె? వృద్ధులమె? మానుము శోకము మానినీమణీ.

అనియిటు భార్యను హాలికుఁడు
చనవునఁ దాఁగుస్తరించి సంతోషమునన్
మునుపటివలె సంసారం
బొనరుచునుండంగ దైవయోగము చేతన్. 53

నెలమసలె; చీరచిక్కెను;
బులుసులపై నిచ్చగలిగెఁ; బొసఁగె గతులయం
దలసత; నెలఁతకుఁ జెక్కుల
వెలిజిగి దలకొనియె; వళులు బెరసెను జదునై. 54

చనుమొనలు నల్లవాఱెను;
మినమినవిడి పెదవులొలసె మృత్తికతావిం;
దనరెను జిట్టుము లరుచియుఁ;
దనువున శ్రమహెచ్చెఁ;గౌను తరుణికి బలిసెఁ. 55

ఇటుల నాబోటి దుర్భరగర్భలాలసమైయుండ నొక్కనాఁడు.

కాలశాక్తేయుఁ డంధికాకాళి కధిక
భక్తిఁ గడసంజ తగరును బలిగనీయఁ
గ్రొత్తనెత్తుటిధారలు గురిసెననఁగఁ
జేవురించెను దిక్కులు చెలువుమీఱి. 57

పండి యఱ్ఱులువంచు పైరుజొంపములకు
జాళువాపూఁతలు గీలుకొల్పి,
కన్నెపయ్యెర కల్లఁ గదలుచుదోఁగాడు
జలదబాలలకెఱ్ఱ కలప మలఁది,
కుజకోటరంబులఁ గూర్కెడు పెనుగుడ్ల
గూబల మాంద్యంబుఁ గొల్లగొట్టి,
మొండరాపిళ్ళకు నెరియు గ్రొన్ననలకుఁ
బూర్వరాగంబును బొదలఁజేసి,

ఆలమందలఁగదలించి, హాళికులకుఁ
బనులు చాలింపఁ గనుసన్నఁబరఁగఁదెలిపి
భర్తలనుగూడ నుత్కంఠ భామినులకుఁ
గొలిపి, రజనీముఖంబునఁ గొఱలె నినుఁడు. 58

సాంధ్యరాగంబు వృక్షాగ్ర శాఖలందు
నలమికొనినంత వహ్నికీలలుగ నెంచి
పక్షులెల్లను గూయుచుఁ బఱచుచుండెఁ
గాలిపోవును గూళ్ళంచుఁ గడురయమున. 59

తార లుల్లసిల్లె; జారుల మనములు
కలువలట్ల కాంతి గడలుకొనియెఁ
జక్రవాకకాంత స్వాంతంబుపోలికఁ
దమ్మి మోముమోడ్చె నుమ్మలించి. 60

అభ్ర కేదారమునఁ జంద్రుఁడనెడు గోప
బాలకుం డుడుగణమను పసిని మేపు
చుండు బోయగ పుత్తెఱి నొప్పె; నటులఁ
గాక, చిహ్నమౌ గొంగడి గలుగుటెట్లు? 61

హంసబాలిక లంబు విహారలీల
నంబరాపగ తరగల నాటలాడఁ,
గంపితంబయి యంభోజకాండరజము
లలమికొనెనన వెన్నెల లలరె మింట. 62

అంత నాకాంత భర్తకు నన్నమునిడి
చంద్రికామోహానంబైన శర్వరి నటు
పవ్వళింపఁగ మంచము బయటవైచె
నడుగువెట్టుట యామడ యట్లుఁగాఁగ. 63

పతియు భుజించివచ్చి 'సతి, పందులుదున్నలుఁగోవ యావులున్
సతతము జొన్న చేలఁబడి సర్వమునాశము చేసెనంట ; యా
వితమును నేఁటిరాత్రిఁగని వేకువవత్తు'నటన్న భర్త, యా
సతియిటుపల్కె 'నాథ, మదిసంధిలెఁ గోర్కెయొకండు తెల్పెదన్

ఊఁచబియ్యముమీఁద నాకూహ వొడమెఁ,
దిరిగివచ్చెదు నప్పుడు తెమ్మ జొన్న
కంకు లొకపది'యని చెప్పఁ గలికి, హలికుఁ
డట్లనే యని తలయూఁచి యరిగెనపుడు. 65

పొలఁతి యొకింతసేపు కనుమోడిచి, స్వప్నము రాఁగ లేచి యీ
కల ఫలమేమొ? మట్టియలు ఘల్లని వీడెను, గ్రొత్తచీర నా
తలపయిఁ గప్పినట్లుపడె, దారుణవహ్నిశిఖాముఖంబునం
బలువురు దండసంభృతులు బల్మి ననుంబడఁ ద్రోచిరుగ్రులై.

సారసగంధి యిప్పుగిది స్వప్నవిధంబును జింతచేసి 'యో
సారససంభవాది సురసత్తమవందిత పాదపద్మ, ని
ష్కారకృపాపరా, పతికి బాధయొకింతయు నెప్పుడేనియున్
గూరక యుండుఁగాత!'మని కూర్మిఁదలంచె రమామనోహరున్.

మాటికి స్వప్నసంగతులు మానసవీథిఁగలంచఁ గాఁపు నీ
మాటి భయార్తచిత్తయయి మంచము గేహమునందువైచి, దీ
గూటను దీపమున్నిలిపి కూర్కెనొకించుక, యంత శ్రావ్యమై
వాటిలెఁ గిల్కిలారవము పక్షికులాయములందుఁ బెల్లుగన్.

కొక్కొరోయని కూసెఁ గుక్కుటనికరంబు
    ఱెక్కలు దట్టించి నిక్కినిక్కి,
చెరువునీటికిఁబోవు చేడెల యందెల
    ఘల్లుఘల్లురావము గడలుకొనియెఁ,
బైరుచేలకు నేగు సైరిక ప్రకరంబు
    లొండొరుఁ బిల్చు పెన్నులివు లొప్పె,
గొఱ్ఱెమందలలోన గొల్లల పిల్లన
    గ్రోవిసంగీతంబు కొమరుమీఱె,

లేఁగదూడలు పల్పులు లాగికొనుచు
నఱ్ఱులెత్తుచుఁదోఁకలు జిఱ్ఱుకొట్టి
యంభరావంబుసల్పుచు నాలమందఁ
జాల కఱచుచునుండె నిబ్బరముఁగాఁగ. 69

కాముకేళుల నిశియెల్లఁ గడపి యొడలు
మఱచి నిదురించు యువతుల మందలింపఁ
జూరుసందులనుండి బంగారుసూదు
లవలె వ్యాపించె నరుణాంశులవము లిండ్ల. 70

ప్రకృతి చైతన్య భావమువాపినట్టి
సంతమసమును హరియింప సమయవైద్యుఁ
డలరుపారద సిందూర గుళిక వైచె
ననఁగ నుదయించె రవిబింబ మరుణదీప్తి. 71

పడకలనుండి లేచి చలివాయఁగఁ జీరలుగప్పి, చేతులం
దిడికొని పేఁడచేటలను, 'హే' యని బఱ్ఱె నదల్చి నాదియా
కడియని మెత్తఁబర్విడుచుఁ గాఁపులపిల్లలు బఱ్ఱెతండముల్
వడిఁజను వీథులందు నటువచ్చుచుఁ బోవుచునుండిర త్తఱిన్.

దుర్భరంబగు గర్భంబుతోన నపుడు
కదలఁజాలక కదలుచుఁ గాఁపువెలఁది
ప్రాఁచిపనులెల్లఁ దీరిచి బఱ్ఱెదూడ
వదలి పాల్పిండె గంకణక్వణన మొలయ. 73

అంత వెడవెడ నొప్పులు గానిపించుటయు, గర్భవేదన
గాఁ దలంచి, నలజారమ్మ తన తల్లినిం బిలువనంప నాకెయు
మంత్రసానిం బిలిచికొని కూఁతురుంజూడవచ్చె. ఇట్లుండ మాదిగ
యొకండు, తన జొన్నచేనిలోఁ గంకులు విఱిచియుండుటఁ గన్గొని
చేని ప్రక్కన యాలమేపు మాలపిల్లల విచారించి, వెంకటరెడ్డి
గోసెనని తెలిసికొని, ఇజారుదారుఁడును నలజారమ్మ తండ్రి
యునగు పెంచలరెడ్డిఁజేరి యిట్లని విన్నవించుకొనియె: 74

ఎన్నఁడెఱుఁగని మీయిల్లుఁడేమొకాని
నిన్నప్రొద్దునవచ్చి మా జొన్నమడికిఁ,
బెద్దకంకులు బుట్టెకుఁ ఱిచెనంట!
కంచెయే చేనుమేసినఁ గలదెదిక్కు? 75

పిల్లలు పెండ్లము నేనును
నిల్లనకయు వాకిలనక యేఁగి మడులలో,
బెల్లుగఁ గష్టము చేసియుఁ
జెల్లించఁగ లేము శిస్తు జేజే! సామీ. 76

మీరే తల్లులుదండ్రులు
మీరే బంధుగులుమాకు, మీసలవన మా
వారలు పిల్లాపిసుగులు
గారాబముతోడఁ బ్రతుకఁగలిగితి మయ్యా. 77

మీరు పెంచినమొలకను మీరె గోట
ద్రక్కలించిన మాకేది దిక్కు తండ్రి?
కడుపులోపలి యాంబలి గదలకుండఁ
సాఁకుచుండిరి మీతాత సాలినుండి. 78

పెంచలరెడ్డిను, దణ్ణము,
కొంచెము మనసుంచి మాదుగోడు దుపుమి ; మీ
పంచల నుందుముగద ; ర
క్షించినఁ గష్టంబులిడినఁ గీరితిమీఁదే. 79

అంత నిజామదారుఁడు కరుణామయహృదయుఁడై; 80
ఇవ్విధి జాలివుట్ట వచియించిన మాదిగవానిఁ జూచి యీ
సవ్వడి యల్లునింబిలిచి చక్కవిచారణచేసి, యింక నీ
కెవ్విధమైన కష్టము రహింపకయుండెడు నట్లొనర్తు, నీ
వివ్వగ మాని పొమ్మ, మడికేఁగుమ యన్న వినమ్రశీర్షుఁడై. 81
దండము దేవరా, సలవదాతలు కాఁపులు ; బుద్ధి బుద్ధి; మీ
యండలఁ గాక మాకడుపు టంగద దీరునె? గోవయాల రా
కుండగఁ జేయుమయ్య, యవియుక్కనఁ గంకులుమేసిపోవు;నా
దండుగనోర్వ లేము; దయదప్పక మమ్మలఁ జూడు రెడ్డిమా. 82

ఇటుల శ్వపచుండు వచియించి యేఁగినంత
శోకసంతప్తచిత్తుఁడై ప్రుక్కి రెడ్డి
గోడమోపునఁ గూర్చుండి కొంతసేపు
మనమునం దిటు తలపోసె మాన్యుఁడగుట: 83

మాలమాదిగవారల మందమతులఁ
గష్టపెట్టిన మనకేమి గలుగు సుఖము?
సర్వజనులను బాలించు జగదధీశుఁ
డరయుచుండెఁడె సకలాంతరాత్మ యగుచు. 84

ఇప్పుడైనను రేపైన నెప్పుడైన
ననుభవింపక తీరునే యఖిలకర్మ
ఫలము? లటుగాన జనులకు భద్రమగును
న్యాయ్య మార్గంబుఁ దప్పక నడచుకొనుట. 85

సుతుఁడైన మాతయైనను
సతియైనను నల్లుఁడైన సత్యంబునకుఁ
వ్యతిరేకత వర్తించిన
మతిమంతులు వారి పొత్తుమానుదురు ధరన్. 86

పెంచెలరెడ్డి యల్లుఁడఁట! పెంపటి మాదిగ జొన్నచేనిలోఁ
గొంచెపు బుద్ధిఁగంకులను గోసినవాఁడఁట! యంచు నూరివా
రెంచరె? దుర్యశంబు నిపు డివ్విధిఁ బోకడవెట్టనౌను; నే
మంచితనంబుఁబూన నిఁక మానముదక్కునె? కీర్తినిల్చునే?
అల్లుఁడటంచు నాతఁడు దయామతి మన్ననచేసెఁ, గాక తాఁ
బెల్లుగశిక్షసేయఁడె? విభేదము లెంతురె యోగ్యులంచు న
న్నెల్లరుఁ దూలనాడరె? యహీనయశంబెటు వీడనౌను? నా
కెల్లవిధంబులన్ విధిగ నేర్పడె నాతని శిక్షసేయఁగన్. 88

నలజారమ్మను గర్భిణిఁ
దలపోసిన నామనంబు తద్దయు నీరౌ;
తెలుపక పతికృత్యమునే
మెలకువఁ బ్రశ్నింతు మున్ను మించుంబోణిన్. 89

అనియిటు లేవఁబోవు సమయంబున నంబుజనేత్ర యోర్తు వ
చ్చి నయముమీఱఁ జెప్పె నొకచిన్నినిసుంగు జనించె నిప్డు కూఁ
తునకు నటంచు; నంత నెదఁ దోరము సంతసముప్పతిల్ల వే
చని పురిటింటిలోఁ గనియె సారసనేత్రను, జిన్నిపాపనున్. 90

నలజారమ్మయుఁ దండ్రిఁ గాంచి మది నానందమ్ము దైవాఱ వె
ల్వెలఁ గ్రొన్నిగ్గులు కన్నుఁదమ్ములొలయ నీక్షించి యోతండ్రి యా
జలజాతాక్షు కృపావిశేషమున మత్సర్వాఘము ల్దూలి న
వ్య లతాతన్వి యొకర్తు గల్గెఁ గనుమా వాత్సల్యమేపారఁగన్.
అని యిటులూరకున్న సుత నల్లనఁ గాంచి వచించుఁ దండ్రి యో
తనయరో, బంధువర్గము ముదంబును బొందగఁ గందునోర్తు నా
వనజభవుండొసంగె; మఁనుభక్తి నొనర్చిన నోము లియ్యెడం
దనియఁగ రూపముం బడసి ధాత్రి జనించెనుగాక యన్యమే?
నామది నొక్క సందియము నాటెను; బాటిగ దానిఁ బుచ్చ స
త్యామల నీతివాక్యముల నమ్మ, వచింపుమ యుత్తరంబుగన్;
ధీమహితుండవేని యొక తీరునఁ జిత్తము తత్తఱింపఁ దా
నేమియుఁ జేయఁజాలఁడు, మఱెవ్వరు యోజన సెప్పనంతకున్
చౌర్యము నీచకృత్యమని, శాస్త్రవిరుద్ధమటం చెఱింగియున్
మర్యశ మొప్ప సల్పు నతిదుష్టున కెమ్మెయి శిక్ష సేయఁగా
నార్యులకున్ముదంబగును న్యాయము సెప్పు; మిజారుదారు దు
ష్కార్యనియుక్తచిత్తులను గాఱియ వెట్టక వీడవచ్చునే? 94
అని జనకుండు వల్క, వినయంబునఁ బుత్రి వచించు నాయనా,
మనము తురుష్కభూపతుల మాట లతిక్రమణంబు సేయఁగాఁ
జనదు; తదీయధర్మములె శాస్త్రములట్లు దలంచి శిక్షలం
బొనరుప శ్రేయమౌను; దలపోయుమ వేఱువిధంబుగల్గినన్. 95

యువనుల న్యాయముఁ దలఁప నారటగూరును జిత్తమందుఁ బ్రే
మవిలసనంబు శూన్య; మొకమానిసిచౌర్యముసల్పఁ గొర్రమే
దవిలిన శిక్షయంచుఁ బ్రథితంబుగఁ జాటును; పూర్వభూభుజుల్
సవురుగ నిట్టిశాసనముల న్రచియించిరె క్రూరచిత్తులై ? 96

అని యీరీతిగఁ బల్కెడు
తనయను దిలకించి తండ్రి ధర్మంబునకుం
దనవార లూరివారని
చనునే భేదంబు? నోడువు సత్యంబనఁగన్. 97

సరసిజబాంధవుండు కరజాలము లోకమునందు భేదముం
బూరయక సర్వవస్తువులఁ బూర్ణముగాఁ బ్రసరింపఁజేయు న
ప్పురుసున న్యాయదాత తమవా ర్పెఱవారను భేదబుద్ధి మొం
దరయక ధర్మరక్షణ నయంబుగఁ జేయఁదొలంగు నిందయున్
మును రక్షోహృతయైన సీతను సతీమోహంబునన్ రామచం
ద్రనరేంద్రుండు గ్రహించె నంచు బలునింద ల్వలుకఁ బౌరుల్ధరా
జను గాంతారనివాసినిన్ సలుపఁడే శంకింప కారాముఁడున్ ;
మనవారల్పెఱవారలంచు సుజనుల్ న్యాయంబువోఁజూతురే?
మును గౌరవ్యలు ద్రౌపదింగినుకమై భూపాలసంఘుంబు మూఁ
గిన పేరోలగమందుఁ జీరలొలువం గీడ్పాటు వీక్షించుచున్
ఘనులా పాండవులుండరే వెడఁగులై న్యాయైక బద్ధాత్ములై,
జనకా, కూడవు పక్షపాతవిధముల్ సత్యంబుఁ బాలించుచో.

అని తనుజాత వల్కఁ విని యారట దోరముగూరఁ గన్నులం
జినుకఁగ బాష్పతోయములు చెప్పెడిదేమియు లేక దీనతన్
జనకుఁడు వెచ్చనూర్చుచు వనారిలుచుండఁగఁ జూచి కూఁతు రీ
వనటకు హేతువేమి యని వందురుతండ్రిని బ్రశ్నచేయఁగన్.

అక్కట! యిట్టివార్త నెటులాడుదు? నాడక పోవరాదు; నే
నక్కటికంబుమాని యెటులాత్మజభర్తనుజంపనేర్తు;నం[ లేచుఁగ్రై
చొక్కెడఁ గూఁతుఁజూచు; మఱియొక్కెడ మోమునువాంచు
పెక్కనవానిపోల్కనటులేఁగును వచ్చును, నేడ్చుఁబెల్లుగన్. 102

తనయా, యంచను, నేమియున్న వినుమాధర్మంబనున్, ఏమినా
నిను నెవ్వారలు పిల్చిరంచుఁ గినియున్, నీవేగదాయన్న ఏ
మనుఁ; దండ్రీ,యిదియేమి వెఱ్ఱియనఁగా హాయంచునవ్వాంగడున్
ఘనశోకావిలచిత్తుఁడై శిరము వీఁకందాకుఁ బెన్భ్రాంతికిన్. 103

మాటికి జొన్నకంకులన, మాదిగవాఁడనఁ గొర్తవేఁత ము
మ్మాటికిఁ దప్పునేయన, క్షమాపణలేదన, నౌను గాదనం,
బాటిలె దుఃఖమెట్లు విడఁబాటగు నంచనఁ దండ్రి, భీతి న
ప్పాటలగంధి డెందము గభాలన గంటకితాంగవల్లియై. 104

చేతఁ బొత్తుల నిదురించుచున్న చిన్నపాప మంచం
బున జాఱుటయైనఁ దెలిసికొనక, తండ్రినిం బరికించి, నాయనా,
మాదిగవాఁడెవండు? జొన్నకంకు లెక్కడివి?, కొర్తవేఁత
యేమి? యని ప్రశ్నించుచుండు నంత, వెంకటరెడ్డియు జొన్న

కంకులు దుప్పటియందుఁగట్టి భుజముపై వైచికొని యిలుసేరి,
భార్య ప్రసవించుటవిని సంతోషించుచుఁ బురిటింటిలోనికి
వచ్చె. 105

వచ్చినభర్తమూఁపుపయిఁ బట్టుగ మూటెఁడు కంకులుంట నీ
తెచ్చిన కంకులెచ్చటివి ? తెచ్చితివో మన చేనినుండి, లే
కెచ్చటనుండి తెచ్చితివి? యేమనఁ, దొయ్యలి వెల్ల బోయి రా
పచ్చు పడంగఁజిత్తమున నచ్చటఁ గంకులువోసి భర్తయుఁ.

జొన్నపాడు సేయు దున్నలఁ బందులఁ
దోలితోలి కొంతసోలి, రాత్రి
నిదురవోయి లేచి నిదురమత్తున మాది
గ చినవాని చేని కంచెదాటి. 107

నేనటు కంకులు గోయఁగ
మానసమునఁ దట్టెనదియు మాదిగచేనం
చోనలినాక్షిరో, యింతట
మానితిఁ గంకులను విఱువ; మడిపీడి వెసఁ 108

వచ్చితి; నని చెప్పుచు నేఁ
దెచ్చిన కంకులను జూడు తెల్లగ ముత్యా
లచ్చొత్తినట్లు సొంపగు ;
గిచ్చినఁ బాల్గారుననుచుఁ గెలన నిలువఁగఁ. 109

అంతఁ జెంచలరెడ్డి యిట్లనియె: 110

గొప్పవారికైనఁ జొప్పడుఁ బొరపాటు
ఇదియె తప్పుగాఁగ నెంచఁదగదు;
బుద్ధిదెలిసి యెవఁడు పొనరుచుఁ జౌర్యంబు
నట్టివాఁడ శిక్షకర్హుఁ డిలను. 111

అని జనకుండు వల్క సుత న్యాయపురీతి వచించుఁ దండ్రి, నీ
వనుఁనుడికార మెంతయునయంబె? యశంబె? వెలుంగునిష్పకల్
గనకయత్రొక్కినం బదము గాలకయుండునె? ధర్మమార్గముఁ
మనమెతొలంగినం బరులు మాన్యతఁ జూతురె? నిందదప్పునే?

ఇటులఁ బల్కుచు నలజారమ్మ, భర్తనువిలోకించి,113
విను హృదయేశ, నాపలుకు వీరుల వంశమునందుఁ బుట్టియీ
దినమున నిట్టి దుర్యశముదెచ్చిన యల్లుని శిక్షసేయకే
తనయనుజూచి యేమొ నిజధర్మము పెంచలరెడ్డి దప్పెనం
చను నప కీర్తిరాని విధి యారసి యట్లుచరింపఁ బెంపగుఁ.114
సతము శరీరమంచుఁ బెలుచం దలపోయుటెకాని, వృంత సం
చ్యుతకుసుమంబురీతి నెటనో యొకచోటను, నేఁడో రేపో, యె
వ్వితమున నైన నేలఁబడు; విశ్వమునందు యశంబె నిత్యమై
పతి విలసిల్లు దిఙ్ముఖవిభాసితమై సుజనప్రపూజ్యమై. 115

నలజారమ్మయు నిట్లని
తళుకుల కడగంటి చూపు తనపతిఁ గప్పం
దిలకింప, భర్త యిట్లనెఁ
బొలఁతీ నిన్నెటుల వీడిపోఁ గలనొంటిఁ? 116

శారికమిథునం బటుపలెఁ
గూరిమి నివసింపఁజేసి క్రూరత నిపుడా
వారిజసంభవుఁ డేలొకొ
దారుణ విరహాంబుగూర్పఁ దలఁచెను గట్టా! 117

అని దీనత గద్గదరుతి
మొనయగఁ వచియించు భర్తమొగముం గని, యే
మనియెదునాథా, నీసతి
నిను వీడునె స్వర్గమందు నిరయంబున నేఁ? 118

అన: విని, నీలపుగాజులు
గునిసెడు ముంజేతిముద్దుగొని పతియేఁగన్
మనమున శ్రీహరిఁ దలఁచుచు
ననువుగ బాలెంత స్నానమాడి పసపునన్. 119

జాళువా బంగారు డాలుడీలఁగఁజాలు
హారిద్ర చేలంబు నంతఁగట్టి;
పసపునిగ్గులుదేరు ఫాలభాగంబున
సిందూర తిలకంబు పొందుపఱచి;
కన్నుఁగల్వలుకొంత వన్నెమీఱఁగఁగ్రొత్త
కాటుక రేఖలు నీటుపఱచి,
గుబగుబ నెత్తావి గుల్కెడు జవ్వాది
కలపంబు బాహులఁ గలయనలఁది;

జాజిపూవులు చేమంతి సరుల కీలు
గంటునకుఁ జుట్టి వాల్గంటి కరుణమెఱయఁ
బేర్చుఁడిప్పుడు గుండము భీతిలేక
యనఁగఁ, దండ్రియుఁ గడు భక్తి నట్లుచేసె. 120

అల్లుఁడు దుర్మరణంబు నొందెనని దురపిల్లి పెంచలరెడ్డి
భార్య, పుత్రిగూడ గుండంబునంబడ నుద్యమించెనని తెలిసి. 121

కన్నీరుమున్నీరు గాఁగ నేడ్చుచువచ్చి
సుతనుగౌఁగిటఁ జేర్చి వెతలఁబడుచుఁ,
గూఁతురా, మమ్మిట్లు గుందించి నీవేల
గుండాన దూకంగ? గుణమె చెపుమ,
కూఁతురైనను నీవె కొడుకైన నీవె, మా
కెవ్వరున్నారిఁక నిజ్జగమునఁ
గాటికిఁగాల్సాచు కాలంబునన్ మమ్ము
దుఃఖాన ముంపంగఁ దొడరితేఁటవె?
నన్నుఁగన్నతల్లి, నామాట వినవమ్మ,
కన్నకడుపు నిట్లు కలఁచిపోవ
ధర్మమగునె? యంచుఁ దల్లి మెలుఁగురాయఁ
బలికి, చెక్కునిమురఁ బడఁతి యనియె: 122

నాకొఱకుఁగాదె నాపతి
వీఁకను బ్రాణంబు విడిచి విశ్వమునందుం

బ్రాకట యశమును బొందెను;
నాకును నట్టిదియసూవె న్యాయముతల్లీ. 123

నావుడు బంధుజాలము వనారిలె, 'మాభవనంబు లమ్మరో
పావనమౌను ద్వల్లలిత పాదసరోజ పరాగసంపదన్
భావని, రమ్మ' టంచును సునాసిను లర్మిలి వేడ, నామె ప్రే
మావృతచిత్తయై కదిలె నందఱి బందుగులిండ్లకున్ వెసన్. 124

బందుగులఁ జెలిమికత్తెల
నందఱఁ గౌఁగిటను జేర్చి యాదరమున వా
అందందు నిచ్చు కానుక
లందుచుఁ జనుదెంచి చంచలాంగియు భక్తిన్. 125

తల్లిదండ్రులకున్ మ్రొక్కి యుల్లమందు
దేవదేవుని జింతించి దీప్తిఁ జెలఁగి,
మందహాసము సెలవులఁ గ్రిందుకొనఁగ
నగ్నిగర్భంబు సొచ్చె నయ్యతివమిన్న. 126

సాంధ్యరాగచ్ఛటా సంఛాదితాస్తాద్రి
కటకసంచర దభ్రఖండ మనఁగ,
జలజరాగ పరాగ కలితోర్మి మాలికా
డోలికా చంచ న్మరాళ మనఁగఁ,

బల్లవితాశోక పాదపాశ్రియ నవ
ప్రసవభారానత వల్లియనఁగ,
గైరికసింధూర కలితపూర్వాచల
పీఠస్థ పూర్ణేందు బింబమనఁగ,
సతి రహించెను గుండాలఁ జటులవహ్ని
శిఖలు నల్గడ వ్యాపించి చిటపటోగ్ర
శబ్దభీమంబులై ధూమచయము గ్రక్కఁ,
బ్రేక్షకావళిగుండెలు పెటిలిపోవ. 127

పంచభూతాత్మకంబైన పడఁతి మేను
ప్రకృతి లీనమై పూతమై పరిఢవిల్లె,
మిగిలియుండెడు సత్కీర్తి పగిది సాధ్వి
యాత్మసర్వంబు తానయై యతిశయిల్లె. 128



# వ న కు మా రి

1918 సంవత్సరపు టాంధ్ర కావ్యపరీక్షలో

శ్రీ విజయనగరసంస్థానముచే సమ్మానముఁబడసినది.

1920

# కృతజ్ఞత

శ్రీమహిళా మనోహరుఁడు, శిష్టజనావనుఁ డార్త్తరక్షకుం
డోముత నందగోపసుతుఁ డుజ్జ్వలసారయశోభిరాము స
త్యామలనీతికోవిదుని నర్థిజనామరశాఖి శౌర్య సు
త్రామునిఁ బూసపాడ్విజయరామ మహీపుని నెల్లవేళలన్!

రాజులు లేరో? పేరుగ ధరాభరణం బొనరింపలేరో? ది
గ్రాజి యశఃకలాపముల రాజిలఁ జేయరో? యైన నేమి? యా
రాజుల దేమిలెక్క? పరరాజభయంకర ఖడ్గపాణి రా
రాజులరాజు మావిజయరామనృపాలుని సాటిసేయుచో.

సిరికిఁ దావు, మనోజ్ఞవస్తుతతికిం జేపట్టు, శిల్పంబుఁ బొం
పిరి వైవాలుకొటారు, రాజ్యరమకుం బెన్నిక్క, చంద్రోపలో
త్కరలావణ్యపుదీవి- మోహిమహా; లాస్థానంబు సేవింప నె
వ్వరిచిత్తంబులు వింత నొందవు యశోహల్లభ్యసద్భూషణా!
పాయక తొల్లి పార్థునకుఁ బ్రాణసఖుండుగ సేవకుండుగన్
దాయలయుద్ధమందుఁ బ్రముఖంబునఁ దోడయి నిల్చినట్టి నా
రాయణమూర్తిరీతి జనరంజకుఁ డాంధ్రకవిత్వతత్త్వ భా
గ్ధీయుతుఁడున్ రసజ్ఞుఁడు విధిజ్ఞుఁడు నా యనమండ్రవారి నా
రాయణమూర్తి సాయపడ రాజ్యభరంబు భరంబె భూవరా!

విద్యుత్ప్రదీపికావిభవంబు పేరోల
గంబున కొక వింత కాంతిఁ గొలుప,
సాహిత్యవేత్తలు సరసకవీశ్వరుల్
పండితు లొకవంకఁ బ్రబలియుండ,
రాజబంధువులు గౌరవమార నుచితాస
నంబులఁ గూర్చుండి యింబు మెఱయఁ,
గనుసన్నఁ జూపినకార్యంబు లొనరించి
స్వామి హాసాదంచు భటులు నిలువఁ,
బొనరు బంగారు నగిషీల పువ్వుఁబనులఁ
గాంతు లొలయుంచు మకుమల్లు గద్దెమీఁద
నిండుకొలువుండి భూపుఁ డఖండకీర్తి
మృదులహాసంబు మోమునఁ బొదల ననియె:

‘రారా బాలకవీంద్ర, కూర్మిఁ గొనరా రారాజు నీ కిచ్చు స
త్కారంబుల్, మును విూనులంబునఁ గవిత్వ ప్రాప్తిచే నల్ల మ
ల్లారెడ్డిప్రముఖుల్ చెలంగి, రటు బాల్యంబుదె సమ్మాన్యకా
వ్యారంభం బొనరించి కాంచితివి యుద్యత్కీర్తి నీ విద్యోర్జ

‘లోకోక్తిమయములై లోలోనఁ దత్త్వంబు
పరిమళింపఁగఁ బల్కెఁ బద్యములను,
గాళిదాసుని నాటకత్రయంబునకు వ్యా
ఖ్య రచించి శాశ్వతఖ్యాతిఁ గాంచె,
షట్చక్రవర్తుల చారిత్రము రచించె
సరసభావాలంబ సరణి మెఱయ,
వాసంతవైభవ వ్యాసంగపరుఁడయి
సంగీత శాస్త్రంబుఁ జక్కనుడివె,
వినుత వేమనయోగి, యావేమరెడ్డి,
మల్లరెడ్డియు, నల్ల కుమారగిరియు;
నట్టి రెడ్డివంశమ్మునం దవతరించి
వారలం బోలి సత్కీర్తి వడసినావు;

‘కవియెవఁడోయటంచు మునుగన్గొని,యాతఁడు బాలుఁడైన గా
రవ మొకయింత సూపక నిరంతర సార రసప్రవాహ బాం
ధవ పదజాల బద్ధకవితా నవ భావ మనోహరత్వముం
దవిలియు మెచ్చలేని కువిధానుల మాటఁ దలంపనేటికిన్,?

'ఎవ్వ రే మన్న నీకృతి మవ్వ మైన
యభినవాశయ సంపత్తి యలరు చుండుఁ,
బ్రొద్దువొడుపున వికసించు పువ్వుఁగళిక
రమ్యసౌరభ్య మట్టుల రామిరెడ్డి!'

---

# వనకుమారి

## ప్రథమ మంజరి.

అటమటలాడి పల్లవము లాతపసంహతి వాడువేళఁ బై
తటమున గోత్రల న్విడిచి దాహముపో సెలయేటినీర ము
త్కటముగఁ ద్రావి, తెమ్మెరలతాఁకుననుయ్యెలలూఁగుపూఁబొదం
గుటిలశిరోజ యొర్తు కనుకూర్కు జనింప శయించెఁజల్లగన్. 1

తరణి మయూఖమాలికలు తాండవమాడుచుఁబూవుటోవరిం
బూరి సొరఁబాఱుచు న్నిదురవోవు లతాంగి కపోలపాళి ము
ప్పిరిగొని జాఱు ఘర్మజలబిందువులం బ్రసరించి జాళువా
తరళపునిగ్గులం జిలికెఁ దల్లతికాలయ మెల్ల శోభిలన్. 2

పవమానచలిత వల్లీ
నివహము సుమరజముం రాల్ప, నెలఁతుక కాంతి
లై వసంత వనేందిర క్రొం
జివురాకుల సెజ్జఁ దూఁగు చెలువు వహింపన్. 3

ఆతపతాప మించుక నయంబగుడుం గనువిచ్చి పుష్పసం
ఘాత పరాగ సమ్మిళిత ఘర్మకణావళిఁ బయ్యెదన్ సరో
జాతత నేత్రి యొత్తి యలికాంచల సక్త వికీర్ణ కుంతల
వ్రాతముకన్నులందొరఁగఁ బైకెగఁద్రోయుచు లేచి,యంగదన్;.

గిరిసానుతలమునం ద
త్తఱిఁ దేనియ తెట్టెఁ గాంచి, తా నొక కోలన్
గుఱి వెట్టి నొక్కి- మధురస
మురలఁగ ననఁటాకు దొప్ప నొడిచి యపేక్షన్; 5

ఆసవం బాని, వన్యఫలాళి మెసవి,
పొద్దుచాయలఁ దిలకించి పొలఁతి మిన్న
గొఱ్ఱెమంద మరల్పంగఁ గోరి చనియె
వేణుగానంబు సేయుచు విపినసీమ. 6

అంతకుమున్నె గొఱ్ఱెలు తృణాగ్రములన్ గ్రసియించుచుండి యా
పొంతల నున్న తెల్లుపొద భోరున బెబ్బులియార్వ భీతిమై
నెంతయు లోయలం జెదరి యెయ్యెడ కేఁగెనొ జాడలేదు త
త్ప్రాంతశిలోచ్చయంబుల ఖురాంకము లేర్పడు పీలు లేమిచేన్.

లలిత రసార్ద్రవేణురవ లాలితలైన కురంగకాంత లు
జ్జ్వలకిసలంబుల న్మెసవ సాఁగక వీనులు నిక్కబెట్టి క
న్నులఁబ్రేమావలోకములు నూల్కొనఁగం బరికించి యల్లనం
గలికి చరించుమార్గమును గాంచుచునుండె విముగ్ధచిత్తయై. 8

మును దా మందను వదలిన
ఘనమగు నెత్తంబుఁ జేరి కలయం బొడఁగాం
చిన నొక్కగొఱ్ఱెయేని యుఁ
గనుపట్టకయున్న నబల కాతరమతియై. 9

కొలఁకులఁ గోనలన్ గుహలఁ గ్రూరమృగాకులకాననంబులం
బొలఁతుక చూచిచూచి, యెటుపోయిన పోఁబడి గాంచలేక, బె
గ్గలి నయనాంచలాశ్రువులు గీఁటుచు నేమియుఁ దోఁప కచ్చటం
గల వెలిఱాలపేటుపయిఁ గంపితయై మెయిమోపి యిట్లనున్:

'ఎచ్చటి కేఁగెనో తెలియ దియ్యెడ గొఱ్ఱెలమంద! యింక నే
నెచ్చటఁ జూతుఁ? జూడఁగల వెల్లను జూచితిఁ గంటకాశ్మముల్
పచ్చిక నుండఁ గానకయ పాదము వెట్టిన గాయమాయె మై
హెచ్చెగతిపరియాస, మిఁక నేగతిఁ బోఁగలదాన నింటికిన్. 11

'జనకుఁడు నాదురాకకయి సాంధ్యరుచుల్వెలసిల్లినంతఁ ద్రో
వను గిలకించుచుండును గృపామయ బాష్పజలార్ద్రదృష్టులన్,
మనమునఁ జింతనొందఁడొకో మందలు లోయలువట్టిపోయెనం
చని వచియించినంత! నెటు లాయనమోముఁ గనంగఁజాలుదున్.

'లలితపు సంజ కెంజిగి విలాసము లెల్ల శమింపఁ జీఁకటుల్
బలసి క్రమక్రమంబుగ నిలం గబళించెడిరీతి సౌఖ్యముల్
దొలఁగెడువేళఁ గష్టములు దోఁచుఁ దమంతన వృద్ధియై మనో
విలసన మింకఁగం; బ్రకృతివేడ్కలకున్ గుఱిగారె మానవుల్!

'నవకపుఁ బుష్పపత్రముల నాట్యములాడు హిమాంబుబిందులన్
నవ సరసీరుహాప్తునకు నందనలక్ష్మి సమర్చ సేయు ప్రొ
ద్దువొడుపువేళల న్మ్రాళి తోడయి వీనుల విందుసేయ మం
ద వనుల మేపుచుంటిని ముదం బలర న్వలి మంచుపచ్చికన్. 14

'ఇంక నేవ్యాజమునవచ్చి యీ ప్రదేశ
ములను దర్శింతుఁ? జెల్లెఁబో మోహనంబు
లైన ప్రకృతివిచిత్రంబు లరయుకోర్కె!
కాల మెవ్విధిఁ గడదాఁకఁ గడపికొందు. 15

'చటులానిలము వీచి పెటపెట తరుశాఖ
లుర్విపై విఱిగి యొండొండు జాఱ,
నీడజంబులు గట్టు నీడముల్ చిందఱ
వందఱై పోవంగఁ, బక్షిశాబ
కములు గాయములొంది కావు కావని కూయఁ
గరుణమై వృక్షకోటరములందుఁ,
జివురుటాకులఁ బేర్చి చిన్నకూనలఁ జేర్చి
కాచుచుంటిని గదా గహనసీమ,

నట్టియానంద మింక నా కెట్లు లబ్బుఁ?
గలలనైనను గొండలఁ గాననములఁ
బూవుఁ బొదరిండ్ల సెలయేళ్ళఁ బుష్కరిణులఁ
దలఁగు సమయంబుఁ దలఁపనే తలఁప నైతి. 16

'కొండనెత్తమ్ములఁ గోరాడు మబ్బుల
గమనసౌందర్యంబుఁ గాంచి కాంచి,
మేఘోదయంబున మినమిన పురివిచ్చి
యాడు నెమ్మల యొప్పు లరసి యరసి,
యమృతధారలరీతి నచ్ఛమై ప్రవహించు
సెలయేళ్ళలోఁ గ్రీడ సలిపి సలిపి,
ప్రకృతి మంజులమైన పక్షులగానంబుఁ
దమిదీఱ వీనులఁ ద్రావి త్రావి,
యొండవేళలఁ బూఁ బొదరిండ్ల దూఱి,
హరిణగర్భిణులకుఁ జివురాకు లొసఁగి,
ప్రసవమాలల ధరియించి ప్రతిదినంబుఁ
గాననంబుల రాణినై క్రాలు చుంటి.' 17

పలుకుచు నిట్లు లావికచపంకజలోచన తారకాద్వయీ
చలనవిహీనమై కనుల జాఱెడు నశ్రులఁ దానమాడుచూ
పులను నభోంతరాళమునఁ బూర్ణపుటైక్యము సల్పి భావని
శ్చలత వహించి యుండఁ, గడసంజవిలాసము లంకురింపఁగన్.

తైలమడంగ దీపము నితాంతవికాసముఁ జిల్కఁ గుప్పునన్
జ్వాలగమండి యాఱుగతి, సారమయూఖతతుల్ నశింప శో
భాలసతన్ దినాంతమున నంబుజమిత్రుఁడు శోణదీధితిం
జాల వెలింగి పశ్చిమదిశన్ దిగఁ బాఱెను గొండచాటునన్

సమయపుఁదూలికం బ్రకృతి సాంధ్యసువర్ణముఁగూర్చి యభ్రప
త్రమున వలాహకావృత ధరాధరశృంగములన్ నికుంజపుం
జములను శాద్వలంబుల విశంకట నిర్ఝరులన్ ఖగంబులన్
రమదొలఁకన్ లిఖించెనన రాజిలు నయ్యపరాశ యయ్యెడన్

నాటకదర్శనాంతరమునం బ్రతిసీర ఘటిల్లి రంగమున్
మాటెడురీతి దిక్కుహారమండలి వ్రేలు తమంబు నల్లడం
బాటిలి దృశ్యలోకసుషమం దన కుక్షి మఱుంగు వెట్టి యె
ప్పాటను నద్వితీయమయి భాసిలె మాయకుఁ దోడఁబుట్టువై.

సకలజీవులకును వేడ్క సలుపుకొఱకు
నవని డోలికఁ జదలుచందువకు యామి
నీ రమణి గట్టు రసగుండ్ల బారు లనఁగఁ
దారకావళి యుదయించెఁ దరళకాంతి. 22

కిలకిల కావు కావు కిలకీచని పక్షులు నీడసీమలన్
జిలిబిలి కమ్మగానములు సేయుచు నుండె; విశీర్ణపర్ణసం
కలిత మృదూర్వపై హరిణకాంత శయించె; గుహాళిఁ బాసి లో
యల హరిపుండరీక నిచయంబులు సొచ్చె మృగామిషాప్తికిన్.

విరహిణీ ప్రాణసామగ్రి మరుఁడు వేగ
వేదనాద్వీపమును జేర్ప వేడ్కఁగొలఁకు
నీల గగనాబ్ధి జలద కల్లోలములను
బాలశశి యానపోతంబు పరిఢవిల్లె. 24

వాతేరితంబైన వంశపుంజము రేఁపు
రాపిళ్ళ కీఱ్ఱనురవళి దప్ప,
నరగూర్కు నిదురించు చాకుచలించిన
నులికి యార్చెడి పక్షియులివు దప్పఁ,
దొనికి బండల జాఱి తుంపరముత్యాలు
వెదచల్లు సెలయేటిరొదలు దప్పఁ,
బగలెల్లగుహలలోఁ బడియుండి రాతిరి
మెఱకేఁగు మెకముల మెలువు దప్ప,

శాంతనిశ్శబ్దతాలక్ష్మి సంతసమున
గిరి వనాంతరసామ్రాజ్యభరము మోచి
సకలజీవ సుఖస్ఫూర్తి సలుపుచుండెఁ,
జీమ చిటుకని యన్నను శిక్షగలదు! 25

సంజకెంజాయ లుడుగుట, సంతమసము
లలమికొనుటయుఁ, బక్షుల కలకలములు,
శీత లానిల సంస్పర్శ, శిశిరకరుని
రాకపోకల నెఱుఁగ దా రమణి యపుడు. 26

భావనారూఢ మిథ్యాప్రపంచమందు
సంచరించుచునుండె **నా** చాన మనము
కాయ మాద్యంతమును జీవకాంతి దొఱఁగి
వాసి యుండె బాహ్యేంద్రియ స్పందములను. 27

ఐందవోపలవిగ్రహంబా! యనంగ
సకియ నిశ్చేష్టయై యున్న సమయమందు
నభ్ర మందందుఁ జుక్కల నలమికొనుచు
నాకసంబునఁ జరియించె నసితకాంతి. 28

అరరె! యిదేమిచిత్రమొ వియత్తలమంతయు నీలనీరదా
కరమయి తారకానికరకాంతుల నైతముఁ గోలుపోయి శ
ర్వరిని మఱింత సాధ్వసకరంబుగఁ జేసెఁ! బృషన్నికాయముల్
తఱచుగ రాలుచుండెను గులాయములన్ ఖగముల్వణంకఁగన్

కన్నులకు న్విద్యుల్లత
క్రన్నన మిఱుమిట్లుఁగొల్పఁ గంపితయయి యా
కన్నియ దిగ్భ్రాంతిని దా
నున్నవిధం బేమి యనుచు నున్మలికమునన్. 30

అటునిటు పాఱఁజూచి జలదావృతయామినిగా నెఱింగి, 'య
క్కట! తిమిరంబు నల్గడలఁ గాఱుకొనెం గనుగానరాదు, మి
క్కుటముగ వానజల్లుబికెఁ, గంపిలెఁ గాయము చల్లగాలికిం,
బటముల నీరు జొబ్బిలె, నుపాయము సాయముగాన నిత్తఱిన్

'ఎంత నిశియయ్యె నయ్యయో! చింతఁ జిక్కి-
యెఱుఁగ సంధ్య యడంగుట నిరులు గ్రమ్మె,
నెటులఁ బోఁగల నొంటిగ నీ భయాన
కమ్ము లగు కొండలోయలఁ గాననముల? 3

"నను జింతించుచుఁదండ్రి యేమనునో! యేనాఁడైన నేనొంటిఁ గా
ననమధ్యంబులనుంటినే నిశల? నీనాఁడేమొ దుర్బుద్ధి రేఁ
చినయట్లాయె; మృగంబు లేవయిననం జెండాడెనో యంచుఁ బా
యనిశోకమ్మునఁ గుందునో, కనలునో యత్యంత మీఁచేఁతకున్!

'నను నన్వేషించుచు వనిఁ
జనుదెంచి తమోనిరుద్ధచక్షుండయి బా
టను దప్పి జనకుఁ డేగతి
ఘనకాంతారములఁ జొచ్చి గాసిల్లెడినో!

"తనయనుగా జనించి యిటు తండ్రిని గష్టముపాలు సేయఁ బూ
నిన ననువంటి దంట నవనిం గలరే యెవరైనఁ? బిన్ననాఁ
టనె జనయిత్రి వోయిన దిటంబగు కూర్మి కొఱంతలేక సాఁ
కెనుబడరాని పాటులకుఁ గేవలమున్ గుఱియయ్యె నయ్యయో!

'మంజులారామవీథులు మనము నెంతొ
సంతసంబునఁ దేలింపఁ జాలియును ని
రంతశోకార్తుఁడౌ తండ్రిస్వాంతమందు
నిస్తులాహ్లాద రసమును నింపలేవు. 36

‘జ్ఞానసమాశ్రయం బగు విశాలలలాటమునన్ మనోవ్యథా
నూన హాలప్రకర్షమున నొప్పె వళుల్, పొరలెక్కె కన్ను లీ
షూనిశితత్వముం దొఱఁగెఁ, జంచలభావము నొందె నాత్మ, తం
డ్రి, నెలవయ్యె నీతనువు పెక్కుడొలంగిన యంగపాళికిన్. 37

‘అట్టి నినున్ వయఃపరిణతాంచిత కుంతలు, సాధుచిత్తునిన్,
దిట్టతనానఁ గష్టముల దించితి, ముంచితి దుఃఖవార్ధి, నా
యట్టి యదృష్టహీన తనయం గనుతండ్రికి శోకభారసం
ఘట్టనగల్గు టబ్బురమె! కష్టము లొంటిగవచ్చునే యెటన్?’

అని జనకు న్మదిం దలఁచి యారటఁ గూరుచు నీరజాక్షి దృ
ష్టిని బ్రసరింపనీయక కడిందిఁ గలంచెడు బాష్పపూరముల్
గనుగొనలం దొరంగి చిఱుకాల్వలుగట్టఁ గుటీరసీమకుం
జనఁ దమకించునంత నొకచాయను లవ్వని కూఁత కేఁగినన్, 39

విని, యదియేమటంచు నతివిస్మితయై లలితాంగి యంతఁ ద
ద్వనినికట ప్రదేశములఁ బాఱగఁ జూచి చలత్తటిల్లతా
జనిత హరాత్ప్రభాసమున సానుతలంబున మేయుగొఱ్ఱెలన్
గనె శునకంబు మందచెడఁగా నెడమీయక వెన్నడింపఁగన్.

పెన్నిధిఁ గాంచినట్టి నిఱుపేదవిధంబున సంతసించి యా
కన్నియ మందఁ జేరి తమకమ్మునఁ గాఁపరికుక్క నెత్తిపై
కొన్నదయన్ శిరఃస్థలము గోళులదువ్వుచు నుచ్చుగొట్టుచున్
మిన్నక ముద్దువెట్టెను దమిన్ శునకంబు గదల్పఁ బుచ్ఛమున్.

అటపయి గొఱ్ఱెలఁ గనుఁగొని
'కటకట! సగమాయె మంద, గాంధాంధమునం
దెటు చెట్టుపుట్ట కొకటయి
తటములఁ గ్రుమ్మరునొ పులులు తత్తరపెట్టన్! 42

'ప్రాచి వెలివాఱ నిద్దుర లేచి, కొండ
దండ నడయాడు తఱిపి లేయెండలఁ జలిఁ
గ్రాఁగుచుం బోయి వెదకెదఁ గాననముల
మూఁడఁజెదరిన గొఱియల కందువలను.' 43

అని చింతించుచు నంధకార బల మత్యంతంబు శంపాలతా
జనితాశాంతవిభా విరామమున హెచ్చం గొంత సేపాఁగి, త
ద్వనవల్లీవిచలత్పలాశ నిపత ద్వర్షాంబు బిందూత్కరం
బనయంబుం బయిఁబాలఁ గంటకితమై యంగంబు కంపిల్లఁగన్.

జాఱునటంచుఁ బాదములు సానుతలంబుల మెల్ల మెల్లగం
జేరుచుఁ, జేతికఱ్ఱ నెడసేయుక తొట్టును బుర్వుపుట్టలా
దారుల నుండు నంచు, సతతంబును జల్లనిగాలి వీవమై
జాఱును గప్పు నప్పొలఁతి శైత్యచలన్ మృదులాధరోష్ఠియై.

అడుగడుగున కొక యాపద
జడియక తప్పించుకొనుచు శాతోదరి పెం
జడి నుబ్బి పాఱువాఁగులఁ
గడచుచు మల దాఁటి వెదురుగమి చేరువగన్. 46

చలితాఁకు నొక్కు మెయి నె
మ్మలలో దిగఁబాఱి రుధిరమున బేరింపన్
లలితాంగి వణఁకు చొక్కడ
నిలంబడి తటాన మేఘనిర్ఘోషముతోన్, 47

జలదముఁ జీల్చికొంచు నొకచంచల చంచదుదారకాంతి ది
క్తలములవ్రేలు సంతమసకాండములం దొలఁగింపఁ జెంగటన్
జలజవిశాలనేత్రి గనెఁ జారుశరీరు, వికీర్ణకేశు, ను
జ్జ్వలరుధిరాంకచేలుఁ, గటిబంధ నివేశిత శాతఖడ్గునిన్. 48

# ద్వితీయ మంజరి

వనిత గనుఁగొన్న వీరుండు వనములందు
మున్నెసరి దారిఁదప్పి తా నెన్నొయెడలు
దిరిగి వేసారి, దూరాన వఱలు నెగడిఁ
గాంచి యచ్చోటి కేఁగంగఁ గౌతుకమున, 1

దారిని బోవుచుండ నొకతట్టున గొఱ్ఱెలకూయి వీనులం
దూరిన నీప్రదేశమున గొల్లలు కాఁపుర ముందురంచుఁ దా
నారవ మేదెస న్వినియె నయ్యెడ కేఁగుచు నుండఁ జారుశృం
గార రసస్వరూప నల కాంతఁ గనెం జనుదేర మందతోన్. 2

కని, విసుమానమంది తనకన్నుల నమ్మఁగఁ జాల కీ నిశీ
థిని నిబిడాంధకారమునఁ దీవ్రపుజల్లులఁ దోఁగి గొఱ్ఱెమం
ద నెలఁతయొర్తు దోల్కొనిచనం దగుకారణమే మటంచుఁదా
ననుకొని యంతయుం గనఁగ నావెదురుంబొదచక్కినుండఁగన్;

వచ్చెడుపోలఁతి తటాలున
నచ్చట నీ వీరుఁగాంచి యాశ్చర్యమునన్
రిచ్చపడి యంత సాధ్వస
మెచ్చఁగ మూర్ఛిల్లి వణఁకి యిలపై నొరగెన్; 4

ఒరగినకాంతఁ గాంచి 'అయయో! ననుఁగన్గొనియేమొ భీతయై
ధరపయిఁగూలె నిత్తరుణి! దాపున నెయ్యెడ వాసయోగ్యమౌ
నిరవులుగానరావు; మఱి యెచ్చటికేఁగునొ? లేక కొండ ద్రి
మ్మరులవలె న్వసించునొ క్షమాధర ఘోరగుహాంతరంబులన్;

'లలిత శిరీషమార్దవ విలాసములం దగుచంచలాక్షి గో
త్రైలను గఠోరకంటకదరీముఖ భీకర శైలసానుభూ
ములనిటు మేపఁబంచెనయొ మూర్ఖుఁడెవండొ; సుమంబు నెవ్వఁడేన్
దలనిడికొక పాదములఁ దాఁచునె రూపు నశించి పోవఁగన్?

'సృష్టిచిత్రంబు లెవ్వరిచిత్తములను
విస్మయాంభోధిఁ దేల్పవు వివిధగతుల?
శిశిరకరుఁ డేల కళలేది చిక్కవలయుఁ?
బెల్లు పొడఁబూ వేల శోషిల్లవలయు? 7

'నిరపాయకరుల నుపకృతి
పరులై వర్తించువారిఁ బావనమతులం
బొరయును గష్టము లిల, ము
ష్కరులను జేరంగఁ బోవు సాహసులనియో? 8

'లలితపు ముత్యపు నిగ్గి జలంబులు వాఱెడి యూటనీటి కా
ల్వలు పలుమాఱు తూల వలవంతలఁ గుందుచు శీకరాశ్రు సం
కలితములై మనోవ్యథలు గానము సేయఁగ వార్షికాంబుక
శ్మలత వహించు వాహినులు సాఁగును గాదె నిరర్గళంబుగన్! 9

'యామినీకాంత శోకబాష్పాళి యనఁగఁ
బారిజాత ప్రసూనముల్ ప్రత్యుషమున
మంద శిశిరానిలాహతిఁ గ్రింది కురల
నిలిచి యుండదె తెల్లుపూ నెలల కొలఁది?' 10

అని యిటు లోకవృత్తముల నా యువకుం డొక తెప్పపాటుచిం
తన యొనరించి, మంచుచలి తాఁకున నింపఱు వారిజంబు రీ
తిని దలపించు నా మదవతీమణి నల్లన నెత్తి, జల్లు పె
ల్చున సమలంబుగం దగు శిలాతలమం దుపవిష్టఁ జేయుచున్.

నులివెచ్చ నోటియావిరిఁ
జెలిమోమున నూఁది, తనదు చేలముఁ దడిపిం
డి లలితగతి మైఁ దుడుచుచుఁ
గలయో? సత్యంబో? యనుచుఁ గడుఁ దలపోయున్.

కోరకములు విచ్చుతీరుగాఁగ నిమీలి
తాక్షు లల్లఁ దెఱచి హరిణనేత్రి
వలి యడంగ మేను పలిపముతో నద్దు
సదయుఁ గాంచి చకితహృదయ యగుచు. 13

పలుకను నోరాడక యెం
దులఁ దాఁ గూర్చుండినదియుఁ దోఁపక, తుదకుం
బలికె సవిస్మయ గద్గద
చలితస్వర యగుచుఁ బొలఁతి చారుమృదూక్తిన్:

'ఏమెడనున్నదానవో? యిటే సదయాత్ముఁడు సత్కృపం జలిం
బాయ నవార్ద్రిచేలమున మైసోఁగియుంపఁగ సద్దువాఁడో? మా
నాయననుం గుటీరముఁ గనం దగు దా రెది? శోణితాంకితుం
డై యువకుండు దోఁచెనపు డా భయదుండెట కేఁగె, నింతలోన్.'
అనవిని యాకృపాహృదయుఁడంగనఁగాంచి 'లతాంగి, సాధ్వసం
బున వనరంగ నేల? వెఱపుం గలిగించుపదార్థ మెద్దియున్
నిను స్పృశియింప లేదు; జననీ జనకు ల్వసియించుగేహ మీ
వని నెటనున్నఁగాని తడవంబనిశే దిఁక నిన్నుఁ జేర్చెదన్; 16

'కాని మఱొక్క ప్రశ్న యడుగం దలకొంటి, నభీష్ట మైనచో
దాని వచింపుమీ' యనినఁ దన్వియు 'నేను గృతజ్ఞతాంజలిన్
మానక విన్నవింతు' నను మాటకు నెంతయు సంతసించి 'యో
చాన, నిశీథినిన్ మలలచక్కని గొఱ్ఱెలఁ దోలనేలొకో 17

తెలుపుమా?' యనఁ జిత్తమ్ము కలఁక దేఱి-
గొఱ్ఱెకదుపులు వోవుట, వఱ్ఱువాఁగు
చెట్టు పుట్టలు వెదకుట, చెలియ యొంటిఁ
జింత మ్రాన్పడి యుంట వచించె నంత. 18

ఆమృదుముగ్ధమైన వచనామృతమున్ దమిదీఱఁ గ్రోలి, యే
మేమొ మదిం దలంచుచు నహీనవిలాస సుధాబ్ధిపూరమం
దా మతిమంతుచూడ్కి కనయంబు మెఱుంగులు తెప్పవేయ శో
భామయమూర్తి దీవిపయి భావము రంజిల సంచరించుచున్.

అసితసూత్రంబులం గూర్పఁ బసలుగుల్కు
మంచిముత్యాలసరములు మదికివచ్చుఁ
గన్యకా చూర్ణకుంతలాగ్రముల నుండి
తొలఁకు వర్షాంబుబిందుల చెలువుఁ గనఁగ. 20

వానజల్లుల వలువలు, మేను దడిసి
నీరుఁ జిల్కు నొయ్యారంపు నీరజాక్షి
తియ్యతేనియ సోనలఁ దిరుగుచున్న
చైత్రమాసపు వనలక్ష్మి సౌరుఁగేరు. 21

అని యిటు యోజించుచు ని
ల్చినయెడ నాపాదశిరము చేడియ వీరుం
గనుచుఁ బరామర్శించియు
మునుపటి కరవాలధరుని పోలిక దోఁపన్. 22

'ఈతఁడే మున్ను శాతాసి భీతిఁగొలుపు
శోణితాంకితచేలంబు, జుంజురులుగఁ
బొదలు కేశాళి గల్గి యపూర్వ మైన
చిత్ర మటు విస్మయంబు రచించె మదిని.' 23

అని తలపోసి పోసి చపలాక్షి 'యితం డెవఁ? డిట్టి రాత్రి నీ
వనమున కేలవచ్చెఁ? గరవాలము దేటికి? నెత్తు రేమి? నా
యన యటువంటివారె ధరయందు వసింతురటంచు నెంతు నీ
మనుజుని దేహసౌష్టవ సమంచితరూపము తండ్రి కున్నదే? 24

‘ ఫాలతలమున ముడుతలు పడుటలేమి,
దీనభావమ్ము మోమున నూనుకొనమి,
వెండ్రుకలు పండి నొసలిపై వ్రేలలేమి,
నెసఁగు నన్యోన్యభేదమ్ము లిరువురందు; 25

‘ ఇతనిఁ గ్రీగంటఁ దిలకింప నేమొ గాని
పూర్వహృదయాకులత్వంబు పొడ వడంగి
జనక సందర్శనంబున మనము పొంగు
నటులఁ బ్రణయోదయ మ్మయ్యె’ నని తలంచు.

అవని జనకునికన్నను నన్యమైన
మనుజరూపంబుఁ గాంచి యా వనకుమారి
స్వీయ జీవితకావ్య ప్రవృత్తియందు
నభినవాశ్వాస రచనకు యత్నపడియె. 27

అభినవంబైన యనుభూతి నాత్మయందు
నవనవాశయ ఘూర్ణణం బవతరింప
మునుపు సంకుచితంబుగఁ బొనరు జగతి
విరివిగాఁ దోఁచెఁ త్రుటిలోనఁ దరుణి కపుడు. 28

కనుగొనెంచి నవప్రపంచ మనియొం గంజాక్షి యావీరునిం
గని, ‘ యాలోక నివాసులెల్ల భయముం గల్పించుఖడ్గంబులం
గాని చేలంబులు శోణితాంకములుగాఁ గ్రూరప్రచారంబులన్
దినము ల్పుత్తురె చెప్పుమా? జనకుఁ డీతీరు ల్వచింపండు మున్.

నిన్నుఁ గనుఁగొన్న వికసింప నున్న సుమము
రీతి పొడకట్టు; మాతండ్రి యాతపమ్ము
హాతిని శోషిల్లి వృంతసంచ్యుతిని బొందు
సాంధ్యకాలపుఁ బువ్వనా సడలుచుండు.' 30

వెలఁది వచించు పలుకులకు విస్మయమొంది, 'యిదేమి! జన్మమా
ది లలిత పుష్ప పత్ర తరుదీప్తి మనోహరమైన కానలం
జెలియ వసించెనో? మనుజచిహ్నము లేవి యెఱుంగదో? భువిం
గలిగిన మంచి సెబ్బరలు గాంచ దమాయిక' యంచు నిట్లనున్:

'సకల తారాశ్రయంబైన చదలు గనఁగ
నెంత విరివియై చూపట్టు నిలయు నంతె;
జన్మ మరణముల్ రెంటు విశ్రాంతి లేక
జరుగుచుండును నీ ప్రపంచంబు నందు. 32

'జననమునొంది, తల్లి తమిసాకఁ బెరింగి, విముగ్ధశైశవం
బున మది నెట్టిదుఃఖమును బూనక యాటలఁ బ్రొద్దుపుచ్చి, యౌ
వనసమయంబునన్ విషయవాంఛలఁ దేలి, జరాగృహీతుఁడై
మనుజుఁడు లోకజీవనము మాని చనుం బరలోక మంగనా.'

అనిన విని, లతాంగి యనె: 'నాదు స్మృతిపథ
మంటియుండు శైశవానుభూతి,
దానిఁ జింతసేయఁ దనరుఁ గన్నులఁ గట్టి
నట్లు బాల్యచర్య లన్ని యిపుడు. 34

'గిరిఁ దీరంబుల నల్లి, ఘుంఘుమ రవాకీర్ణ ప్రవర్ఛాఁరు ని
ర్ఝరిణీ శీకరపోషితంబు లయి యశ్రాంతంబు సౌరభ్య బం
ధురతం జిల్కు లతావితానములఁ బ్రత్యూషంబునం జేరి సుం
దర వర్ణాంకితపక్షము ల్గలుగు సీతాకోకముల్ పట్టుదుర్.' 35

కన్నె వచింప నిట్లు, తమకమ్మున శూరుఁడు పల్కు: 'ముద్దియా,
ము న్నెపుడైన నీవు వనభూములు దక్క బహిఃప్రపంచమునం
గన్నది లేదు గాన ధరఁ గల్గిన చిత్రములెల్లఁ జెప్ప నీ
తెన్నున సాఁగ దింటికడఁదెల్పెద వేగఁ గదల్పు గొఱ్ఱెలన్.

'వనభూమిన్ గృహ మేప్రదేశమున దైవాఱున్? ఏనుంగాంచకే
జనకుం డెట్లు తపించువాఁడొ? జననీ సంతాప పాథోధికిం
గన నౌనే యొకమేర? యేలతడయం గళ్యాణి, రావమ్మ! ని
న్గని దుష్టాత్మకుఁ డేనిఁ గీడుదలఁపన్ యత్నించు నేమొన్నఁడేన్?'

కరుణాకలిత రసోక్తులఁ
దరుణుఁడు భాషింపఁ బొలఁతి తరళాక్షులలోఁ
బొరలుచు బాష్పకణావళి
యురలఁగ గద్గదరవంబు లొప్పఁగఁ బలికెన్: 38

'పాలు ద్రావెడు చిన్నారిప్రాయమందె
మరణమొందెను జనయిత్రి మాన్య, నాకు;
నదియు నేఁ గన నాన్నయే యనియె నెపుడొ
తల్లులందఱుఁ జత్తురో ధరను! జెపుమ.'

'కుసుమవల్లిక ప్రసవించు కొమరు పువ్వు
వృంత మెడలకయుండునె కాంత, ప్రాచి
గనిన ముద్దులబిడ్డ యీ యినుఁడు నపర
సాంధ్యరాగంపుఁ జతిలోన సమసిపోఁడె ? 40

'పూవుఁబందిళ్ళ క్రొందావిఁ బుక్కిలింప
గున్న లేమావి నీడలఁ గూడి చైత్ర
కాంతుఁ బరిణయమాడు వాసంతలక్ష్మి
యంతమొందదె గ్రీష్మ జరాగమమున? 41

'అవియు నివి యననేల? యో యబ్జవదన,
యంతరాళ చరిష్ణుఁడౌ నర్కుఁ డాది
యఖిలనక్షత్రచయము కాలానుసృతిని
నైక్యమైపోవు మూలపదార్థమందు. 42

'జలధిఁ దరఁగలు వుట్టుచు సమసిపోయి
మరల జనియించునోజ నో హరిణనయన,
ప్రకృతిమార్పులఁ జెందు మఁ బరఁగుఁగాని
వ్యయము నుత్పత్తి లేదు మూలాంశమందు.' 43

అన విని యాలతాంగి వ్యసనాకులచిత్తత నిట్లువల్కు: 'నో మనుజవరేణ్య, యీవిషమమార్గము దప్పదో, నీవు నేను మా జనకుఁడు సర్వమున్ మృతివిషాదమునందుట? చాలునోయియీ మన మెఱింయించు బోధనలు, మందఁ గదల్చెదఁ బోదమింటికిన్'

నా విని, యట్లైకా కని, వనంబుల గొఱ్ఱెలఁదోలికొంచు శం
కావిలయా నెలంత దరి నవ్వలనివ్వల ముందు వెన్కలం
గావల మైన సత్త్వతతి గన్పడునంచుఁ గృపాణపాణి యై
పోవుచు నుండె నప్పురుషపుంగవుఁ డామెకుఁ దోడునీడ యై.

## తృతీయ మంజరి

అనయము నింపుగన్ సుమలతావళి చెట్టులకల్లి మేలుకట్లను దలపించు కాననతలంబునఁ దాళ పలాశ శాల వృద్ధనరుఁ డొకండు వెల్వడి వ్యథాభరకుంచితఫాలభాగుఁడై కన దనలంబునం జిదుగుకంపలు వైచుచు, వెచ్చ నూర్చుచున్.

పలుమాఱు లేచి యటు నిటు
నలు దెసలం జూచిచూచి నయనంబుల జొ
బ్బిలు బాష్పకణము లూడ్చుచుఁ
బలవించుచుఁ జొచ్చు వెడలుఁ బర్ణగృహంబున్. 2

అఱువదివత్సరంబులకు నవ్వలిమాట యెగాని లొచ్చులే దరయఁగ బ్రాయమాతనికి, నాయతఫాలము దీర్ఘ బాహువుల్ గరము వెడందవక్షమును గంధర యుబ్బుశరీర సత్త్వని ర్భరత నుపన్యసించు, మది రంజిల దెప్పుడు శాంతిసుంతయేన్.

హరిణచర్మమ్ము పఱచిన యరుఁగుమీఁదఁ
గూరుచుండి యా వృద్ధుఁడు కొంతవఱకు
నట్టెయుండి చివుక్కున ద్వారసీమ
కరిగి యటుచూచి యొకకొంత యాలకించి: 4

'వచ్చితే, యింతసేపేమె వనకుమారి,
రమ్మ!' యని పల్కెఁ బ్రత్యుత్తరమ్ము రామిఁ
బవనకంపిత పర్ణనిస్వన మటంచు
నతఁడు చను లోని కెంతో హతాశుఁ డగుచు. 5

మునుపటియట్టుల శోకము
తను నలమన్ వేదిమీఁదఁ దడవుండి స్మృతిం
దనరెడు పూర్వౌన్నత్యము
మనమునఁ దలపోసికొంచు మాటాడుకొనున్: 6

'కనుఁగొనవచ్చునే సమయగర్భమునం దెటువంటిచిత్రముల్
జననమునొందునో? యపరసాంధ్యవిలేఖిని పశ్చిమాశ నే
దినమున నెట్టిరూపములఁ దీర్చునో చెప్పఁగ నౌనె సత్కవీ
శునికిని సైతముం? బ్రకృతిసూత్రసమన్వయ మూహ కందునే?
'పుడమిని బ్రాఁకుపుర్వుఁజిఱు పుల్గులు, పుల్గును డేగ, దానివ్యా
ఘ్రుఁడు నిజపోషణార్థమయి త్రుంచుఁ; బరస్పర మిట్లు పోరుచే
పడి యిహలోకజీవనము వ్రాలుఁ దనంతన హెచ్చులొచ్చులం;
గడిమినె యాశ్రయించుఁ గలకాలము నైహికభోగసంపదల్.
'వననిధి నూర్మికల్ చఱచు పందెములం దిలకింప లోకజీ
వనపు రహస్యముం దెలియవచ్చును, ముంజరియించు వీచికం
జెనకును మీఁది పెందరఁగ; చేష్పఱుచు న్మతియొందు దాని నై
జ నియతి నిట్టులే భువనచక్రము శేషము సంభ్రమించెడున్;

'పరిణామశక్తి శాశ్వతముగఁ గాలచ
క్రమునకు మనుజసంఘములఁ గట్టి
త్రిప్పుచుండుటచే నొకప్పుడు కొన్నిసం
ఘము లుత్తమస్థితి గలిగియుండు,
మఱికొన్ని యధమసమ్మానంబు నొందును
నవియె విజృంభించు నవలఁ దొడరి,
సకలయ చక్రాభిహతిఁ జదునైనరాజ్యమ్ము
లెన్నియో చారిత్రి మెఱుఁగఁగలదు,

ఆదిమధ్యాంత రహిత కాలాబ్ధియందు
నీటిమార్పులు బుడగలయట్లు లుండు;
నిన్న తలపోయ నానుడి నున్నయూహ
పట్టులేకయ భ్రమియించు బహుళగతుల. 10

'పరులకునోడి రాజ్యరమ, బంధుల వీడి, సమస్తసౌఖ్యముల్
దొఱఁగి, వనీనివాసమున దుఃఖమునొందుచు నేకపుత్రి-సుం
దరి-సుమకోమలం-బ్రికృతితత్త్వ మెఱుంగని ముద్దరాలి-స్వో
దర పరిపోషణార్థవశతన్ నియమించితి మందఁ గాయఁగన్.11

'రాజ్యభోగంబు లొందు ధరాతలేంద్రు
నన్నుఁ బంవీరభైరవుఁ జిన్నపుచ్చి
వననివాసంబునకు నలవాటుపఱచె
నౌర! దుష్కాలమహిమ యేమనఁగవచ్చు? 12

'నాకయు పలవింపను బేర్చి
మాకలితార్ద్రహృదయఁ-గుసుమాంగి-సుతం గ
ష్టాకులమతిఁ జేసితి నని
శోకించెదఁ జిత్తకళిక శోషిల్లంగన్. 13

'పట్టుపాత్తులలోనఁ బన్నుండుగతి మాలి
పులితోలుపై మేను మోపవలసె,
సౌధోపవనకేళిఁ జరియింప నోఁచక
గిరులఁ గాననములఁ దిరుగవలసెఁ,
గనకాంబరంబులఁ గైసేయు సిరిలేక
మోటుకంబళి మేన మోయవలసె,
నంతఃపురీభోగ మనుభవించుటలేక
పర్ణశాలలఁ గష్టపడఁగవలసె,
ఆఁకలెట్టిదో యెఱుఁగక యావుపాలు
కండచక్కెర యుక్కెఱ గడ్డపెరుఁగు
వెన్న మీఁగడ దినఁజాలు నన్నుమిన్న
కసవుకూళుల నరపొట్ట మెసవవలసె! 14

'రాజ్యసంచ్యుతుఁడైన ధరాతలేందు
తనయ తానంచు నెఱుఁగదు వనకుమారి;
పలవరింపదో చిత్తమ్మువగుల నెప్డు
డైన సత్యమ్ము తెలియంగ నైన నయ్యె! 15

'ఏమొకొ యింతసేపువఱ కెయ్యెడనున్నదొ ముద్దుపట్టి? పె
న్బాములుఁ బుర్వులుం దిరుగుబాటల, లోయలఁ గ్రూరసత్తము
ల్వేమఱు బొబ్బవెట్టుఁ; గదలించిన గొఱ్ఱెలమంద పెంజడిం
బో మరలింపలే కిడుమఁ బొందుచునున్నదొ చిమ్మచీఁకటిన్.'

అని యిటు వృద్ధరాజు తనయ న్వెదకంగఁ దలంచి దీవపం
జును వెలిగించి చేకొని, ముసుంగుగఁ గంబళి గప్పి, చిట్కుమం
చనయము వర్షబిందుతతు లాకులపై దిగజాఱి రాలన
ల్లన వనదుర్గమాంతరములం జనుచుండఁగ నొక్కచోటునన్;

ఎల గురివెందవల్లిక లనేకవిధంబుల నల్లిబిల్లిగా
మెలిగొనియుండ నందు మిడిమేలపు శల్యమృగంబు శాబకం
బులఁ గని సొమ్మసిల్లి యరమూర్ఛఁబరుండి తటానఁ జెంగటన్
వెలుఁగును గాంచి తత్తఱము పెల్లడరం బొద దాఁటె రివ్వునన్.

తనలోఁ దా సుకుమారబాలికకుఁ బ్రాప్తంబైన యిక్కట్టులె
ల్లను జింతించుచు డోలికాచలన లీలం గేరుచిత్తంబుతోఁ
జను వృద్ధున్ గనుచక్కిఁ బిక్కలదరన్ శల్యంబు కొమ్మెత్తి పె
ల్చనఁగూలంబడ డొక్కలోఁబొడిచెఁ గీలాలంబు జొబ్బిల్లఁగన్.

పోటున రక్తపూరములు పొంపిరి వోవఁగఁ జేలపొత్తులం
బాటిగ నద్ది నొప్పులకు వందురుచున్, 'సుత నెట్లుగాంతు ని
ప్పాటును దెచ్చిపెట్టెఁ గట! పాపపుదైవము నిర్దయామతిన్;
ఓటమినాఁడె పోర మృతినొందినఁ గష్టము లిన్ని గల్గునే? 20

‘ పరభూమీశుల సంగరాంగణములన్ బాహాబలస్ఫూర్తిఁగ
ర్కశ ఖడ్గంబునఁ ద్రుంచుటో, యరులచేఁ బ్రాణంబుఁ గోల్పోవుటో
సరియౌ క్షత్త్రియవీరపుంగవునకున్; సామ్రాజ్యముం బాసి ని
ర్భరశోకమ్మునఁ గాననాంతరములన్ వాసింపఁగాఁ జెల్లు నే? 21

‘ అనయము మత్కుమారి నయనాంచల ముగ్ధవిలోకనామృతం
బున నను ముంచుచుంటఁ బ్రియపుత్రికి నైకడగండ్లనొందియున్
మనుటయుఁ బూర్వపుణ్యమని మాటికి నే ననుకొందుఁగాని, జీ
వనసుఖ మిచ్ఛగించి వనవాస మొనర్తునె యట్లుగాని-చో? 22

‘ చిఱుతతనమ్మునుండి వనసీమలఁ గొండల నుంట లోకమే
మెఱుఁగని ముద్దరాలు సుత; యేగతి నే మృతినొంద నొంటికాఁ
పుర మొనరింప నోపు వెఱపుం గఱపించు వనాంతరమ్ములం?
బురమున కేఁగి యైన నొకపూట వసింపఁగఁజాలు నే కటా! 23

‘ పరిణయార్హ వయస్కయుఁ-బ్రణయజలధి
నోలలాడెడు పూజేఁకుటోడ-తనయ
భీకరారణ్యతలముల బెగ్గిలంగ
మఱుఁగుపఱచునో మరణంపుమబ్బు నన్ను? 24

‘ అల్లుపందిరి నెడఁబాప నలరుతీవ
పట్టులేకయ యటునిటు పాఁకురీతి
మరణ మొందఁగ నేను, నిర్భరతరార్తి
నెటులఁ బెఱపంచలం బ్రాఁక నేఁగుఁ బుత్రి?’ 25

అని యిటు తేలు గుట్టినటు లాఁగనిపోటులు డొక్కలోఁగలం
చిన నిలుసేర నెంచి యిలఁ జేయిడి లేవఁగడంగఁ గన్నుల
ల్లనఁ దిరుగంగసాగె నొడలం జిఱుచెమ్మట లుప్పతిల్లె; ద
ప్పినిఁగొని శక్తిచాలక భువిన్ శయనించె సతండు మూల్గుచున్.
'మరణముగాంతునం చిఁకఁ గుమారికి నెవ్వరు సెప్పువార? లీ
మరణపుశయ్యనైన నొకమాఱు ప్రియాత్మజఁ గౌఁగిలించి ము
మ్మరమగు కూర్మితియ్యమున మంజులఫాలము మూర్కొనంగ ని
త్తఱి లభించునే కటిక దైవము!' యంచుఁ దలంచి కుందెడిన్.

# చతుర్థ మంజరి.

మందను దోల్కొనివచ్చెడు
సుందరియును దరుణుఁ డపుడు శుష్కపలాశ
స్పందారవ మెట విసఁబడు
నం దాఁగుచు మరలఁ జనుదు రటవీవీథిన్. 1

ఆరీతిం జనుదెంచుచుండ నొకచో నక్కానలో గాలిలోఁ
దోరంబై పరికీర్ణమై మిళితమై తోచెన్విరావంబు, లా
ధీరుం డారవ మాలకించి నిలువన్ దీనోక్తులున్ మూల్గులున్
ఘోరావస్థఁగలంగు మానవుని పల్కుల్గాఁగఁ జూపట్టెఁన్; 2

కాంతఁ గనుంగొని యిట్లనెఁ :
'జింతాపీడితుఁ డెవండో చీఁకటికోనన్
వంతలఁ గుందుచు మూల్గుచుఁ
బ్రాంతంబుల నున్నవాఁడు, వ్యధ యెట్టిదియో? 3

'నే నటువోయియువత్తుఁ దరుణీమణి, బాధితుఁడైన మానవుం
బూనిక రక్షసేయ మదిపుట్టనివాని హృదంతరంబు మా
నో, నెఱచిట్టెమో, కులిశమో యనసౌను; బరార్తిచాలితం
బై నవనీతమార్దవము నందనిచో నదిమానుషాత్మమే?' 4

అని యిటువల్కి, యచ్చెలువ నచ్చటనుండఁగఁ బంచి ఖడ్గముం
దనకరమునఁ దాల్చి కడుధైర్యమునఁ జని యొక్క-తావునం
మనుజుఁ డొకండు నేలఁబడి మాటికి లేవఁ గడంగుచున్ మెయిం
దనరెడినొప్పిరాపిడికిఁ దాళకఁ మూల్గుటఁ జూచి యిట్లనున్:

'అయ్యా, మీ రెవ రివ్వనిఁ
గుయ్యిడుచుండెదరు? నేలఁగూలుట కిందే
మయ్యెను దెల్పుఁడు, నాచే
నయ్యెడుసాహాయ్య మున్న నది యొనరింతున్.' 6

కరుణారస నిష్యందము
లరుసపువాక్యములు వీను లలరఁగ విని యా
తురతన్ వృద్ధుఁడు కన్నులఁ
దెఱచి శరీరము నిగుడ్చి దీనతఁ బలికెన్: 7

'తలఁపని తలఁపుగ వచ్చితి
తలకొంటివి రక్షకొఱకుఁ దడయక వని క
వ్వలఁ గ్రోసెడుదూరము చనఁ
గలదు కుటీరంబు, నన్నుఁ గడపుము యటకున్. 8

'అలపుం గొని యామీఁదటఁ
దెలిపెద నాచరిత సేదదేఱిన వెనుకన్;
బలహీనత, మాంద్యము న
న్నలయించెడు జాగుసేయ కటు గొనిపొమ్మా.' 9

అని యిటు పలుకుచు ముద్దుల
తనయం దలపోసి పోసి తలుగని దుఃఖ
మ్మునఁ గుంది 'వనకుమారీ,'
యని యొకనిట్టూర్పు విడిచె నశ్రులతోడన్. 10

వృద్ధుఁ డిటులఁబలుక విని, యను యువకుండు:
'వనకుమారి యెవతె? వనములందు
నామెయున్నదొక్క యలఁతిప్రాయముగల్గి
గొఱెలమేప గిరులఁ దిరుగుచున్న?' 11

మృత్యుదేవతకోఱల మిడుకుచున్న
వాని కమృతంబు దొరకినపగిది నలరి
ముసలితేఁడనుఁ 'గానల ముద్దుకూఁతుఁ
జూచినాఁడవె గొఱియలఁగాచు చుండ?' 12

అవు నవు నని తలయూఁచుచు
యువకుఁడు విస్మయమునొంది యుర్వికి డాకాల్
దవులంగ వంచి వృద్ధుని
యవయవములు హస్తపాళి నంటుచు నుండన్. 13

'మల నెటులున్నది నా క
న్నుల వెన్నెల, ప్రాణపద, మనుంగుతనయ, జ
ల్లుల వలివడి వడఁకుచు గొ
ఱ్ఱెలఁదోల్కొని చీఁకటిని గిరిం దిగఁ గంటే? 14

'సెలయేళ్ళ నెటుల దాఁటెనో!
పులులుం దోఁడేళ్ళు శివలు బొబ్బలువెట్టన్
లలితాంగి చిత్త మేగతిఁ
గలఁగెనో!' యని వృద్ధరాజు కటకటపడియెన్.15

'వందురఁబోకు మామె నిరపాయత నున్నది మందతోడ, నీ
వెందుకుమూల్గు చుంటి వచింపవదేమొకో, వ్యాధిబాధచే
గుందెదవో? వనోర్వఁబురుగు ల్విషసర్పము లేవియైనఁ గా
టొందఁగ ముట్టెనో చెపుమ? యొప్పగుసేఁత యొనర్తుమిత్తఱిన్'

'చెప్పకయేమిగాని మృదుచిత్తుఁడ, మత్సుత కీయుదంతముం
జెప్పిన నప్పుడే పొగులుఁ జిత్తము శోకవిపాటితంబుగన్,
అప్పొలఁతిం గనుంగొన వనాంతరముం జొరఁబాఱు చుండఁగా
గుప్పనశల్యమొండిచటఁగొమ్మునఁ గ్రుమ్మెను డొక్కనెమ్మలన్

'నెత్తుట జొత్తిలె నంగము
చిత్తమ్ముత్తలము నొందెఁ జెవులను గీ మం
చొత్తెను శబ్దం బెద్దియొ,
బొత్తిగఁ గాయంబు సడలె మూర్ఛావిలమై.'18

అనవుడు, వీరుఁ డిట్లనియె: 'నయ్యయొ! యువ్విధి నుండనూరకే
మన మిట జాగు సేయఁగఁ బ్రమాదము వాటిలునేమొ, వేగమే
తనయను దెత్తు, నందఱముఁ దద్గృహసీమకుఁ బోదమంచుఁ' దా
నన విని, వృద్ధుఁ డిట్లనియె: 'నయ్య, కుమారికి నేమిసెప్పెదో?

“జనకుఁడు కుక్షివేదన మసంగఁగఁ, దాళక మూల్గుచున్న వాఁ
డని వచింపుమీ’ యనిన, నట్టులె కాకని యంధకారికా
వనమున వేగవేగఁ జని నాతుక భీతిలుచుండఁ గాంచి, ‘యో
వనిత, కదల్పు గొఱ్ఱెలను బల్కెద నవ్వలవృత్త మంతయున్;

‘నిను నన్వేషించుచు నని
జనకుఁడు రా నుదరబాధ జనించినఁ బో
వను రాను శక్తి చాలమిఁ
బనవుచుఁ బడియున్నవాఁడు పచ్చికబయలన్. 21

“ఇఁక నొకతెప్పపాటయిన నింకఁ జరింపఁగరాదు, పోద మో
చకితకురంగనేత్ర,’ యనఁ జిత్తమకాండము వ్రీలిపోయి న
ట్లొకటియు భావనన్నిలుపనోపక యాఁపఁగలేని శోకముం
బ్రకటముసేయు బాష్పనికరంబులఁ గోళులమీఁటు చిట్లనున్:

‘కన్నుల్గానఁడు వృద్ధుఁడౌట, మఱి యీకాంతార దేశమ్మునన్
మన్నున్మిన్ను నెఱుఁగరాక తమముల్ మార్గమ్ము రోధించి క్ర
మ్మెన్నల్ ప్రక్కల నాన్న జల్లులకు బల్మేనెల్లఁ గంపిల్లఁగన్
నన్నుంగానక కానల న్వెదకుచున్నాఁడేమొ శోకార్తుఁడై !’

“పొలఁతీ, చింతిలనేల? వేగ గొఱెలం బోఁదోలు మంభోదముల్
బలమయ్యెన్ దిశలందు, మార్గము తరుల్ పల్లంబులు న్మిట్టలుం
దెలియ న్రావిట, శీతలానిలహతిన్ దేహమ్ము మ్రానయ్యె భూ
స్థలి జాగ్రత్తగ మెట్టుమీ జనకునిన్ దర్శింత మిచ్చోటనే.’ 24

వీరుఁ డిటులఁబల్కి వెలఁదియుఁ జిత్తమ్ము
లేని కీలుబొమ్మలీల గొఱలఁ
దోలికొంచుఁ జనియెఁ దోడురా యువకుండు
ఖడ్గపాణియగుచుఁ గడిమిమెఱయ. 25

జనకునిగాంచఁ జిత్తజలజాతము శోషిలి, కాంతయున్ ఘనా
ఘనపతితాంబుబిందు లటుగాఁ దరళాశ్రులు కంఠసీమకుం
దొనకఁగ నేడ్వఁ, దండ్రియునుదోరపుటుమ్మలికమ్ము మ్రింగియు
ల్లనియెను గద్గదస్వరము లస్ఫుటమై పవనార్భటిం దగన్: 26

అమ్మా ముద్దులగుమ్మ, యేల మల సంధ్యారాగము ల్వాయ మే
ఘుమ్ము ల్గ్రమ్మఁగ నొంటి నుంటివి? జడిం గంపమ్ము వాటిల్లదే?
నెమ్మే న్నగ్గురు నొందదే చలికిఁ? జన్నె యిట్లు వర్షమ్మునం
జెమ్మ ల్వాఱిన బాటలన్నడువఁ? గొంచెమ్మైన భీతిల్లవే? 27

వనతరువాటికా మృదులపల్లవపాళుల సంజకెంజిగుల్
సన, నిను వేచుచుంటిని విచార శరా కులితాత్మతన్, సుధా
జనక మనోహరస్మితముఁ జల్లెడు నీ రుచిరాస్యబింబముం
గనఁ గుతుకంబునం జెలఁగు కన్నులనించుక యప్పళించుచున్.

వనతరుచ్ఛాయల వనధరచ్ఛాయల
నంధకారము సాంద్ర మగుచు నెఱయ,
మార్గమ్ముఁ గానక దుర్గమారణ్యానఁ
బెడత్రోవఁ బట్టితో ప్రియతనూజ?

గిరిగహ్వరంబుల హరి పుండరీకాది
మృగ గర్జలకుఁ జిత్త మెట్లడరెనో!
పర్వతాగ్రములందుఁ బర్వెడు సెలయేళ్ళ
వఱ్ఱు వాఁగుల దాఁట వలనుపడెనె?
నదిని బడిపోవువానికి నావయటులఁ
బూర్వసుకృత విశేష సంభూతిచేత
భవ్యుఁ డీతఁడు దైవంబుపగిది వచ్చి
నిన్నురక్షించి ననుఁ జేర్చెఁ గన్నతల్లి'. 29

అన విని, తనయయు నేమో
జనకునకు వచింపఁ బోవ జాగగునని యి
ట్లనియెను వీరవతంసుఁడు
జనకుని సుతఁ గాంచి మధురశాంతరసోక్తిః 30

'చనము భాషింప నిటఁ బరస్పరము మీరు
వాసమున కేఁగి సర్వంబుఁ బలుకవచ్చు,
వర్షచిహ్నము లాకాశపథమునందుఁ
గలుగుచున్నవి పోదము కానదాఁటి' 32

అనుచు యువకుండు వృద్ధుని నట్టె యెత్తి
వీఁపుపై వైచికొని వనవీథి వెడలె;
వనకుమారియు గొఱ్ఱెల బాదిగొంచు
నతిరయంబున నాతని ననుసరించె. 32

చని చని యొక్క చో దహనసంస్థితి గాంచి, యదే కుటీరమం
చనుకొని దారివట్టెను రయంబుగ వీరుఁడు, పోను బోను నా
తనికి లతానికుంజవలితంబుగ నొక్క గృహంబు వెల్గునం
గనఁబడెఁ దాపసాశ్రమవికాసముఁ జిల్కుచుఁ జూడ నందమై.

అంత వనకుమారి యనియె నిటుల: 'నయ్య,
యిదియె మాకుటీర మిందుఁ జొరుము,
దొడ్డినెట్టి గొఱ్ఱెతుటుముల నే వత్తు'
ననిన నట్లకాక యనియె నతఁడు. 34

ఆలయంబుఁ జొచ్చి యజినం బరుంగుపైఁ
బఱచి యుంటఁ గాంచి బాగుపఱచి
వృద్ధు నల్ల దింపి వేదిపై శయనింపఁ
బెట్టి, యంత వీరుఁ డిట్టు లనియె: 35

'తొలుత గవోష్ణతోయములతోఁ గడుగన్వలె నెత్తు, రవ్వల౯
లలితమృణాల తంతు కిసలంబులఁ బొత్తిగఁ జేసి గాయమం
దొలికెడు నస్రబిందుతతు లొప్పుగ నద్ది శిరీషపుష్ప పే
శల వసనాంచలంబున వెస నిచ్చియుంచెదఁ గట్టునొవ్వఱ౯;
'గొఱియల దొడ్డిఁదోలియిటకుఁ౯ సుమకోమలనచ్చునంతకుం
ద్వరితగతి౯ రచింపవలె బంధము, నట్టు లొనర్పకున్న న
త్తరుణియుఁ గొర్తి త్తనెత్తురులు ధారలుగాస్రవియింపఁగాంచియు
ద్ధుర హృదయాకులత్వమున దుఃఖపయోనిధి మున్గిపోవదే!'37

అని యీరీతివచించు నయ్యువకు 'నయ్యా, యేలబంధంబు? పో
యెనుగీలాలము రక్తనాళముల, నిం కేలీల నాప్రాణముల్
మను నిమ్మేన? వృథాప్రయాసపడఁగన్ లాభంబె? నిస్సత్వభా
జన మయ్యెన్ సకలాంగకంబులును; వాచాశక్తి జీర్ణించెడిన్.'

అనిపల్కి, యంత వృద్ధుఁడు
మనమునఁ దలపోసి యిటుల మందాస్ఫుటలీ
లను వచియించెను గన్నులఁ
దానికి శ్రుతిపుటముల నసుహృతోయము జాఱన్: 39

'కడచెను బహునేఁడులు
పడితిమి పడరానిపాట్లు వనసీమల, మా
యిడుములకు లెక్కగలదే?
కుడిచితిమి మునీశులట్లు కూరలుఁ గాయల్' 40

నా విని, వీరుఁ డిట్లనె మనం బనుకంప వహింపఁ: 'బూజ్యుఁడా,
యీవనభూమినేల లలితేక్షణతో సుకుమారబాలతో
నేవిభవంబుగోరక మునీశులలీల వసింతు చెప్పుమా?'
నావుడు, వృద్ధశా జనియె నమ్రముఖంబు నిగుడ్చిచూచుచున్:

'ధరనష్టాదశవత్సరంబులు భుజాదర్పంబునన్ శాత్రవో
త్కరముందుంచి ప్రజాప్రమోదకరసౌఖ్యస్ఫూర్తిఁబాలించితి;
న్నరనాథుల్ నను నిత్యముంగొలువ దిఙ్నాగాస్యపత్రంబులం
దరళా మేయ యశోక్షరంబుల లస త్ఖడ్గంబునన్ వ్రాసితిన్. 42

'కాలమహత్త్వ మెవ్వరికిఁ గన్గొనరాదు! ప్రతిక్షణంబుఁ గా
ర్యాళి యయత్నలభ్యమగు; నబ్బవు కొన్ని ప్రయత్నయుక్తినేన్
లీల లభించు భాగ్య; మవలీల దరిద్రత వోవు, నట్టులే
తేలును మున్గుఁ గాలజలధిన్ సకలంబును నస్వతంత్రతన్. 43

'కష్టజీవితు కన్నీటికాల్వ లైనఁ
గాలచక్రము నిలువదు కనికరమున,
ధారుణీపాల పాలనాదండమునకు
వెఱచి యాఁగదు త్రుటియైన విరతిఁ గొనదు. 44

'కాలసాగర కల్లోల కాండ చలిత
తృణగణంబులు ప్రాణులు, స్థిరత లేదు;
రాజ్యములు, సంఘములు, నాగరకత లెల్ల
నిట్టి న్యాయమునన్ భ్రమియించు చుండు. 45

'ఎవని విశ్వాసపాత్రుఁడే యటంచు
నాత్మ నమ్మితి నా యమాత్యాధముండు
పర నరేశుని కేకాంతభక్తుఁ డగుచు
స్వామి వంచించెఁ బ్రబలసంగ్రామసీమ. 46

'పరధరణీశుఁ డొక్కరుఁడు బాహుబలోద్ధతిమీఱఁ గేరి యు
ద్ధుర పృతనా సమేతుఁ డయి దుర్గము లగ్గలుపట్ట, మంత్రిమా
పురమున నున్న సైన్యములఁ బోఁబనిచె న్మిష వెట్టి కాననాం
తరముల కయ్యెడం, గపటతంత్రుని మంత్రిని నమ్మి కూలితిన్.

‘ తరుణమునందు న న్విడిచి దాసులకు న్విజయంబుగూర్చ ము
ష్కరతవహింపఁ బోని బలశాలురు యుద్ధకళాధుర్యులైన కొం
ద ఱపుడు స్వామిభక్తులయి దర్పమెలర్పఁగఁ దోడు నిల్చి భీ
కర సమరప్రికారములఁ గాఁజియ వెట్టిరి శత్రుసేనలన్. 48

‘ వైరులు బొమ్మఱాలవలె భావముగోల్పడి యూరకుండ దు
ర్వారరణంబున న్విమతవాహినులం గలగుండు వెట్టుచున్
ధీరులు మాపురప్రజ లుదీర్ణపరాక్రమ కేళిలోలురై
పోరిరి మత్తపుష్కరులు పుష్కరిణిం గలఁగించునట్లుగన్. 49

‘ అయిన నదేమొ! శత్రుజన మంతకునంత కనంతమై సమి
జ్జయశుభసూచకారవము సల్పుచు వార్ధి విలోల వీచికా
చయములు మధ్యపర్వతపుఁ జాలులఁ దాఁకెడురీతి హేతులన్
హయరథమత్తకుంభి పృతనా మథనంబుగఁ దాఁకి రెంతయున్

‘ నాకై ప్రాణము విడిచెను
నీఁక నా్మసైన్య మెల్ల వీరస్వర్గ
శ్రీకమ్ముగ, నరుదెంచితి
నీకష్టము లనుభవింప నే నివ్వనికిన్. 51

‘ పరభూపాల కరాళ కంఠదళన ప్రారంభ దుర్వారమా
కరవాలంబు, శరాసనంబు, నిషువుల్, కార్తస్వరోరశ్ఛదం,
బురుశీర్షణ్యము భూమిదాఁచితిని; అయ్యో! శౌర్యచిహ్నంబు లి
ద్ధరగర్భంబునఁ ద్రిప్పుపట్టెడిని; క్షాత్త్రస్ఫూర్తియిట్లాయె నే!

అన విని, వీరపుంగవుఁడు నంగమునం బులక ల్జనింపఁ, గ
న్గొనలఁ గిసాలశోణిమము గూడఁగ దిగ్గన లేచి చూచి యి
ట్లనియె నిశాతఖడ్గముఁ గరాబ్జమునన్ ధరియించి: 'చెప్పు మో
ఘనుఁడ, నినున్ సమిద్ధరణిఁ గాఱియ వెట్టిన దుష్టభూపతిన్;
'బలయుత శత్రురాజ పరివార నివారణ కేళి దుర్దమం
బు- లసితరత్నముష్టియుఁ- జమూపటుకంఠనవాస్రపాయి- యు
జ్జ్వలదరుణాంశుసన్నిభము- శౌర్యపరాక్రమచిహ్న-మిందిరా
కలితము మత్కరాసి, యదిగల్గఁగ నా కెదు రేరి శూరులన్?'

అనవిని వృద్ధుం డిట్లనె:
'మనుజాధిపుఁ డింద్రసేన మాద్గల్యుఁడు నన్
గనికరము లేక వంచన
ఘనరాజ్యచ్యుతునిఁ జేసి కానల కనిచెన్.' 55

తరుణుఁడు నయ్యుదంతము శతారము పేరెదసొచ్చి యట్టిటుల్
మెఱమినయ ట్లొనర్ప, నసి మేదిని జాఱఁగ మారుతంబు ని
ర్భరగతి వీవ మొగ్గుచు ధరంబడు నా కదళీప్రకాండము
ట్లొరగెను; నంతలోనఁ జెలియుం జనుదెంచెఁ గుటీరసీమకున్

## పంచమమంజరి

ఆతనిఁ గని చిత్తమ్మున
భీతి పెనంగొనఁగఁ జనకుఁబృచ్ఛించెను నా
శాతోదరి: 'యేలొకొ యీ
భాతిని వీరుండు ధరణిఁబడియెను? జెపుమా.'

అన విని తండ్రియు నిట్లనెఁ:
'తనయా, మూర్ఛిల్లెనేమొ తరుణుఁడు, జలముం
గొని మోమునఁ జిలికింపుము
కనుదమ్ముల నెత్తు' ననినఁ, గానిమ్మనుచుఁ; 2

కమలినీపత్ర పాత్రిన విమలజలముఁ
దెచ్చి మోమునఁ జిలికించి తీవఁబోణి
యంగుళీపల్లవంబుల నల్లనల్ల
నాస్యబింబమ్ము స్పృశియించు నంతలోన. 3

వీరుఁడు నిర్ణిద్రుఁడు గాఁ
గా, రమణీమణి విశేషకౌతూహల మొ
ప్పారఁగ జనకుం గనుటకుఁ
దారెను నవ్వేది యున్న తట్టుల కంతఁ 4

శారదశీర్ణపర్ణముల ఛాయలఁ దేలుచు వెల్లనౌ వ్యథా
భారసమంకిత భ్రుకుటి ఫాలము, జీవకళావిహీన దృ
గ్వారలతాలవాల మగు కన్నులుగాంచి 'యిదేమి? రక్తసం
చారము రుద్ధమయ్యెనొకొ, చల్లఁబడెం దనువెల్లఁ జెమ్మటన్!'
అనుచు నిటాలఘర్మకణికావళిఁ గుంతలరౌప్యసూత్రముల్
మునుఁగుచుఁ దేలుచుం గనులమూఁగ, నిగారపుఁబైటచెంగున
న్జనకునిమోము నద్ది విలసన్నవ పల్లవకోమలంబు లౌ
తన యధరోష్ఠముల్గదిపెఁ దండ్రికపోలముఁ గాంత ప్రీతితోన్.

కన్నుల బాష్పపూరములు గాఱుచు వీనులనంటి జాఱి, నా
సన్నమృతిం గనుంగొని విచారముతో జనకుండు వల్కెఁ: 'నా
కన్నులవెన్నెలా తనయ, కాలపయోనిధి బుద్బుదంబునా
నిన్నెలవుం ద్యజించి దివికేఁగు దినం బరుదెంచె నిత్తఱిన్; 7

'లలిత వసంతవేళఁ గిసలంబులఁ దావులఁ జల్లు పూల ను
జ్జ్వలలగు వల్లికల్ తమదు చక్కఁదనంబు శరత్సమాగమం
బలవడ నోడి పండు వగుడాకుల రాల్చుచు నస్థిపంజరం
బులొ యనునట్లుచూపఱులఁబొక్కఁగజేయు నహృద్యరూపతన్

'కావున నెట్టివారలును గాలముడాయ సమస్తవైభవం
బేవిధినైనఁ బాసి దివికేఁగకతప్పదు, మృత్యుదేవతా
భావమునన్ దరిద్రులని భాగ్యయశఃప్రథితాత్ములంచు సం
భావన యున్నె? కూటమియుఁ బాయుట నిత్యనిసర్గధర్మముల్;

‘మరణద్వారకవాటముం దెఱచి సన్మానింప మీతల్లి ప్రే
మ రసావిష్కృతదృష్టుల న్నెఱపి యమ్మా, నన్నుఁ గన్నన్నలన్
వర గంగా సికతా ప్రదేశములఁ గల్పక్ష్మాజ కుంజాలయాం
తఱితచ్ఛాయల విశ్రమింపఁ బిలిచెం దాపమ్ము శాంతింపఁగన్.’
జనకుం డిట్టులఁ బల్కఁ గూఁతురనె నాశ్చర్యంబు దోఁపంగ: ‘మా
జననిం జూచుట కేఁగెదో దివికిఁ జంచద్గాంగ కల్లోలసం
జనితా లోల మరుత్కిశోరములు విశ్రాంతి న్నివేదింప? నే
నును నీతో నరుదెంతుఁ దల్లిఁగని యన్యోన్యంబు ముద్దాడఁగన్;
‘నాజనయిత్రి యెట్టిదో కన న్మది వుట్టెడు, జన్మమాదిగా
నాజననీమతల్లి, ప్రణయాంకిత కోమలసుస్మితంబు ని
ర్వ్యాజకృపామహత్త్వము నిరంతదృగంచల శీతలత్వము
నార్జిల నన్ను ముద్దిడియెనా యెప్పుడైన వచింపు నాయనా.’

‘గిరుల సెలయేళ్ళఁ దోఁగెడు తరుణములను
నందుఁ బ్రతిబింబితంబా మదాననంబుఁ
గాంచి యనుకొందు నాతల్లి యుంచుమోము
సైత మిటులుండునో యని సంతసమున.’ 13

అంతలోననె వృద్ధుని యాస్యరంగ
మందు మృత్యువు తాండవ మాడఁదొడఁగె;
నెత్తలేక పక్ష్మలముల నెత్తి సుతను
దరుణు నర్థగర్భిత దృగ్విధంబు దోఁప— 14

కాంచు చుండఁగ మెలమెల్లఁ గన్నుదోయి
ముకుళితం బాయె రేఁదమ్మిపూవుపగిదిఁ,
బక్ష్మలంబులు జీవక వాటములును
నొక్కసారిగఁ బిహితమై యుండునేమొ! 15

వీరుఁడు వృద్ధుని మరణము
నారసి లోలోన శోకమాఁపి, చెలియతో
నోరాడక గద్గదగతి
నీరీతి వచించె నేమి యెఱుఁగనియటులన్: 16

'జనకుఁడు సొమ్మసిల్లి యిటు శయ్యపయిం జలనంబులేక నె
మ్మన మొకయింతశాంతిగన మాంద్యమునన్నిదురించువాఁడు నీ
వును శయనింపఁబొమ్మ; ఖగపుంజము నీడములందు 'రాత్రివో
యెను నగ'మంచుఁ గూసెడిని; నేల హృదంతకచింతనల్ చెలీ?'

తరుణుం డిమ్మెయిఁ బల్కిన
దరళాయతనేత్రి యతిముదంబున శయ్యం
బొరసి వినిర్మల వదన
స్ఫురణ మ్మలకముల నింపుఁబూన శయించెన్. 18

అంత ననంతచింతలకు నాలయమైన మనోంతరంబుఁ దా
నెంతయుఁ బూన్కితో ననునయించి దృగంచలబాష్పధార న
త్యంతముఁ నాఁపికొంచుఁ హృదయమ్మునఁ జింతనసేయుఁ గాంతుఁ డా
చెంత శయించియున్న సరసీదళనేత్రిను గాంచి ప్రీతిమై: 19

‘సరసీ లోలతరంగ డోలల శరచ్చంద్రాంశుపూరంబు రా
ప్యరమం జిల్కఁగ బాలశైవలపుఁ దీవల్ గ్రాలు నున్నాన్పుగన్
నెరయం దూఁగు మరాళబాలికవలె న్నిర్మాయికాస్యంబుతో
హరిణీలోచన నిద్రవోయెడిని నాహా! సుప్తి మేలెట్టిదో! 20

‘మరణసౌఖ్యమ్ము రుచిచూప మానవులకు
నిన్ను సృజియించెనేమొ వనేజభవుఁడు;
కాకయున్న విశ్రాంతి యీలోకమునకు
నొక్కత్రుటియైన స్వప్నమా, దక్కఁగలదె? 21

‘శోకసంతాపమున నాత్మ సొమ్మసిల్లు
కష్టజీవికి నిశ్చింత గలుగఁజేయ
స్వర్గనిశ్వాస మోహన పవనమటుల
నిద్దురా, వీచుచుందువు నిశలయందు. 22

‘నీదు సంస్పర్శనంబున నిఖిలజగతి
యేకజీవసమాధిగ నెసఁగు చుండు,
గగన మందుల్లసిల్లు నక్షత్రగణము
పైని వెదచల్లు పువ్వులపగిదిఁ దోఁచు. 23

‘కాలమునఁ దక్క మఱియేమికార్యమందు
మరణమునకును నీకు నంతరముగలదు?
స్వర్గసౌఖ్యమ్ము నిరయ సంసర్గబాధ
స్వప్నమా, నీదుగర్భాన సంభవించు. 24

'ప్రణయ శేషుల మృత మిత్ర బాంధవులను
కౌఁగిలింపఁగ గల్గు నీకరుణకలిమి,
స్వర్గ మర్త్యలోకముల సంసర్గసూత్ర
మీవు స్వప్నమా, యేమని యే నుతింతు? 25

'ప్రొద్దువోడుపున వికసింపఁబోవు తమ్మి
పూవురీతిగ నిదురించుఁ బూవుఁబోణి,
ఱేఁకు లెడలిన కంజకర్ణిక విధాన
సమసిపోయెడి వృద్ధుని సంహననము.' 26

ప్రకృతి నిశోదరంబున విరాజిలు శాంతత రూపుఁదాల్చె నీ
ముకుళితనేత్ర నా మృదుచమూరుపు చర్మపుశయ్య, నా
ఆమ్రకిసలకోమలత్వమున మంజిమఁజిల్కు కపోలపాళులం
జికురములాక్రమింప సరసీరుహలోచన నిద్రవోయెడిన్. 27

'జనకుండేఁగె నిసర్గసిద్ధసరణిన్ స్వర్గంబు కాంతా, యటం
చును నేనెట్లువచింతు? నాత్మఁగొఱకచ్చున్ సూడిన ట్లాఁగదా!
జనకుండే జనయిత్రియట్టులఁ దమిన్ సాఁకంగఁ, గాంతార మే
తనలోకంబుగ నున్నముద్దియ మనస్తాపంబు నెట్లాడ్చెదన్?

'నాజనకుం డొనర్చిన యనర్థపుఁ గల్మష మంతరింప నీ
రాజమనోహరాస్య కరిరాజ సమంచితయాన ప్రేమకున్
భాజనమై ధరాభరణ భవ్యసుఖంబులనెల్ల నేఁడె సం
యోజనముం బొనర్తు వికచోత్పలనేత్ర పదాబ్జపీఠికిన్.' 29

ఇటులఁ దలపోయుచుండంగ నింతలోనఁ
గలవరించుచు మేల్కనెఁ గలువకంటి;
'చెలి, ఇదే' యని పేరుండు పలుకరింప
'నాకలోకముఁ గాంచితి' నని వచించె. 30

అన 'విని మనుజుల కయ్యది
గన రానే, స్వప్నమందుఁ గాంచినవిధమున్
వినిపింపు' మనఁగఁ, గోమలి
యనియెను విస్మయరసంబు లలరఁగ నిటులన్: 31

'పురుహూత చాపకాంతులు
విరివిగఁ దను లతలనుండి విరియుచునుండన్
సురలోకవాసు లానం
ద రస వినిర్మగ్నులగుచుఁ దనరుదు రెపుడున్. 32

'కాంతియెల్లను నమృతసంకలిత మైన
జ్యోత్స్న యేగాని మఱియొండు శోభ లేదు;
దిక్కులెల్లను నీరంధ్ర తేజమొలుకఁ
జంద్రబింబము గనరాదు చదలయందు. 33

'శబ్దమెల్లను వేణు నిష్పన్న మైన
మధురిమోద్గారి గానైక మంజిమంబె;
పవిభవ మెద్దియొ గనుఁ గొనఁ బడదు గాని,
పరగు నక్షత్రగానరావములఁ గలసి. 34

'పవనగర్భంబునం దేలు ప్రసవరజము
లటులఁ బ్రేమప్రవాహమునందు జీవ
తతులు నీఁదుచు నుండు సుందరముగాఁగ,
నచట వైరస్యపాతక మభ్రసుమము. 35

' మారుతోద్ధూత జలధర మాలలటులఁ
బక్షములు లేక పఱతురు వాయువీథి,
హృదయభావంబు లెల్ల మూర్తీభవించి
యచటఁ బ్రత్యేక దృగ్విషయంబు లగును. 36

' హృదయ పాత్రమునందు నాత్రిదివనిర్మ
లాంచి తానందరసమును నించికొంటి
నదియె యిప్పుడు సైతము నాత్మయందు
జంద్రికా శీతలామృత సరణి నొప్పు. 37

'జనకుఁడును నీవు నేను నాస్వర్గమందు
సర్వకాలము నానందసౌఖ్యములను
ననుభవింతము మిత్రమా,' యనఁగ యువతి,
గాంతుఁ డిట్లని నచియించెఁ గరుణ దొలఁక: 38

' మనకన్న మున్నె జనకుఁడు
చనె సౌఖ్యములనుభవింప స్వర్గమ్మునకుఁ
మనమును గాలక్రమమున
వనితా, పోఁగలము మృతి కవాటము దెఱవన్.'

# షష్ఠమంజరి

కిలకిల పులుఁగులు తరుశా
ఖల రుతములొనర్చె వంచకంబులు కూఁతల్
గొలుపుట మాని గుహాంతర
ములదాఁగెను దూర్పుదిక్కు పొదలెం గాంతిన్. 1

ఆయువను వైరి హరియింప ననుదినంబు
నుదయ గిర్యగ్ని నాళిక నుండి సూర్య
గోళమును బంపుచున్నాఁడొ! కాలుఁ డనఁగ
నలరెఁ దరుణార్కబింబ మత్యరుణకాంతి. 2

ప్రాగ్భాగంబున నగ్నిపర్వతము ప్రేలఁ
దరణి రుచియను మృత్తికా ద్రవము రేఁగఁ
బరిసర నివాసులో యనఁ బక్షివితతి
గూయుచును నాల్గుదిక్కుల గూడఁ బాఱె. 3

ఊర్ణనాభుల తంతుసద్మోత్కరంబు
హిమకణావళిఁ జెలువొందెఁ, గమలమిత్రు
నకు నుషఃశ్రీ సమర్పింప నవకమైన
క్రొత్త ముత్తెపుఁ బళ్ళెరం బెత్తె ననఁగ. 4

కలహంసాంగన లంబుజోదర రణద్గర్వాంధభృంగాళిఁ జం
చులతో మీటి మృణాలనాళముల గచ్ఛన్నివ్వచ్ఛుగం ద్రుంచుచున్
జలజాతాకరమందుఁ గ్రీడసలిపెం జంచద్గరుద్భిన్న ని
ర్మలవీచీ మృదుడోలికా పరిణత ద్రాజీవపత్రంబుగన్. 5

అల కుంజాంతర పర్ణశయ్యలు కురంగానీకము లీడ్వడి శృం
గలతాగ్రంబులఁ గోకికొంచుఁ దనువుల్ కాంతారముం జొచ్చెడిన్
లలితగ్రాస కిసాలచర్వణ సముల్లాసక్రియా జాత గం
ధిల డిండీర కణచ్యుతి స్స్వనలతాదేశంబు లింపారఁగన్. 6

ఘనకండూతి దోలంగ భూమిరుహ సంఘాతప్రకాండంబులం
దనువు ల్రాయుచు డీలుచున్ గవయసంతానంబు ఘాసంబులన్
వనపర్ణంబులు మేయు సానుతలము ల్వర్జించి ఛాయాతమో
జనితాఖిల నిశాటవిం జనియెడున్ సప్తాశ్వుఁ డేతేరఁగన్. 7

రాత్రి నిద్రానిబద్ధమౌ ప్రకృతి యిపుడు
విమల కల్యాణిలంబులు వీచు చుండఁ
దరుణ సూర్యాంశువులఁ బ్రబోధంబుఁ బొంది
నిత్యకృత్యపరివృత్తమై నెగడు చుండె. 8

జనకుని నిర్యాణంబును
మనమునఁ దలపోసి మాటిమాటికి శోక
మ్మునఁ గృశియించెడు కన్యకు
ననునయవాక్యములు పలుకు చట యువకుండున్.

కొన్నిదినంబులం గడపి కోమలి యుమ్మలికమ్ముఁ దీర్ప లో
కోన్నతవైభవంబు సరసోక్తుల బోధయొనర్చి, కొంత యా
పన్నత వాపి, యంతిపురిపై బలుకోరికె లుప్పతిల్లున
క్లెన్నియొ పర్ణన ల్సలుపు నింతిమనంబు కరంగునట్లుగన్. 10

తరుణుఁడు నల్కెడు లౌకిక
సరణులు చిత్రములుగాఁగ సకిమదిఁ దట్టన్
విరచింపఁబడిన ఆ చి
త్రరువో యన నిశ్చలముగఁ దా వినుచంతన్. 11

చిఱుతెమ్మెర కంసమ్ముల
నెఱికలు చెరలాడుచుండ నెలఁతుక యెటకో
పరుఁగిడు చిత్తము చలన
స్ఫురణము లేకుండ నయనము ల్దగ నుండెన్. 12

వెలఁది సమీపమందు నొక వేదికపైఁ బులితోలుపాన్పునం
జలితమనస్కుఁడై కడువిచారముగన్ యువకుండు వ్రాలి చిం
తలు బహిరంగ రూపములఁ దాల్చినవో! యనఁ గన్నుదమ్ములం
దొలఁకఁగ బాష్పధార, లెదితోఁ పకయూరకయుండె నయ్యెడన్,

కలహంసీసమయాన కొంతవడి జాగ్రత్స్వప్నమున్వడి ముం
గల వేదిన్ శయనించియున్న తరుణుం గాంచు న్విలోకించుచుం
బలికెన్ 'మిత్రుఁడ, తల్లిదండ్రులు నను న్వర్జించి కాంతారసీ
మల నాకంబునకేఁగ న్యాయమె భవోన్మాదంబు నన్నేఁచగన్;

‘ గిరులన్ గొఱ్ఱెలమేపఁబోవునెడలం గేలాన్చి చెక్కిళ్ళపైఁ
గరుణావేల్లిత బాష్పముల్దొరఁగఁగం గౌఁగింట బంధించి ని
ర్భరవాత్సల్యము పొంగ ముద్దిడుచు నం బంపించు మాతండ్రి య
మ్మరో, యింకెవ్వరిముద్దుఁగొందుఁబ్రతిసమ్మానంబుఁగాంక్షించుచున్
‘గిరికూటంబుల సాంధ్యరాగరసముల్ క్రేవన్ డిగంబాఱు ని
ర్ఝరపూరంబుల లీనమౌనపుడు నారాకం బ్రతీక్షించుచున్
సరణి న్వేచుచునుండుఁ దండ్రి; యిఁక నన్ సంతోషమేపార నె
వ్వరు వీక్షించెడువారు లేరొ? పితతోఁ బాడాయె నేప్రేమయున్?’

అనవిని వీరుఁడంతఁ జెలియం గని యిట్లనుఁ ‘గాంత, యేల నె
మ్మనమునఁ జింతవోవ వినుమా వచియించెద నొక్కమాట, నీ
జనకునికన్న మిన్నయగుచాడ్పున నం దలపోయు, మేను ని
న్ననయము మద్ధృదబ్జ సదనాంతర వాసినిగాఁగ నెంచెదన్;

‘ఆలవాలంబునం బుట్టి యుండె పెరిఁగి
పూవుఁగొమ్మలఁ బొదలెడు పుష్పవల్లి
ప్రక్క విలసిల్లుతరువునఁ బాఁకకున్నె?
లతలుఁ గాంతలు నాశ్రయోల్లసిత లెపుడు.’ 18

అనవుడు వీరుఁ, డంగనయు నాతనిఁగాంచి ప్రమోదబాష్పయై
యను: ‘సరవాస యోగ్యమగు నా నవలోకము నన్నుఁ జేర్చెదే?
కనుఁగొనవచ్చునే యచటఁ గానలనున్న మనోజ్ఞవస్తువుల్?
ఇనుఁ డవనీధరాగ్రముల నెఱ్ఱనిరంగులఁ గ్రుంకుచుండునే? 19

'గొఱియలమేఁతకుఁ గిరులు కోమలఘాస లతా నికుంజ ని
ర్ఝర కలితంబులై యచట రాజిలునే? హరిణీకుమారికో
త్కరములు నిర్భయాత్మలయి కానఁగనౌనె తృణాంకితావనిన్?
సరస కలాస్ఫుటారవము సల్పు పికాంగన లున్నె మావులన్?

'ప్రసవకిమ్మీరములుగాఁగఁ బఱఁగు లతలు
చెట్టుగొమ్మల మేల్కట్లు గట్టినటుల
నీలనీలదమాలల నెగడుచున్నె
యింద్రచాపంబు స్వార్గికసౌందర్య కాంతి?'

అని యారీతిగఁ గన్యపల్కు విని నెయ్యం బాత్మఁదోఁపంగ ని
ట్లని యెస్వీరుఁడు: 'నీప్రదేశము ప్రపంచాశంబెయౌటన్ గిరుల్
వనముల్ సూర్యుఁడుచంద్రుఁడుంగలరిఁ కేలాతర్కమం దెన్నియేఁ
ఘనసౌధంబులుసౌఖ్యసంపదలు కాంతా, గల్గు నశ్రాంతముఁ;

'నాతో నీవరుదెంచినం గమలినీనాళంబు ఖండంబులన్
మేఁతల్మేయు మరాళబాలికలు నున్మీలత్సరోజంబులుం
జేతోమోదము గూర్చుపుష్కరిణులుం జిత్రాలయంబుల్ చెలీ,
ప్రీతింగాంచెదవందుఁ బుష్పిత లతోపేతామ్రకుంజంబులున్;

'నవరత్నఖచిత సుందరహార భూషలు
ధరియింపఁగలవు చిత్తంబు బడిసి,
చంద్రశిలా రమ్య సౌధభూమికలందు
వెన్నెల విహరింతు వేడ్కఁగొలఁది,

జాళువాబంగారు జరియంచు మేల్పట్టు
పుట్టము ల్గల వందుఁ బూవుఁబోఁడి,
యీవాజ్ఞ వెట్టిన నెల్లఁగివ ర్తింతురు
శుద్ధాంతకాంత లుత్సుకత దోఁపఁ,
దరుణి, త్రుటిలోన నీ జీవితంబు మాఱి
సకలసామ్రాజ్యధూర్వహ క్ష్మాతలేంద్రు
పట్టమహిషివి యవుదువు; వనకుటీర
తలమున వసింప నేల కాంతారభూమి?' 24

నావుడు, కన్యకామణి మనంబున నించుక చింతచేసి, 'నే
నీ వనసీమఁ బాసి యిపు డెమ్మెయి రాఁగల? జన్మమాదిగా
నీవిధిఁ బర్ణశాల వసియించుచు గొఱ్ఱెలమేపికొంచు నిం
దే విహరించుచుందు గిరులెంతయునాకుఁబ్రియంబుగూర్పఁగన్;

'జనకపదపాంసుపటలిఁ బావనములైన
కాననోర్వుల విడనోప గడియమైన;
హర్మ్యమందు శోకమ్మున నడలుకంటె
శాంతిదాయక కాననస్థలమె మేలు.' 26

అన విని చిత్తంబున మే
కు నెఱిమినయటులఁ గలంగి కోమలిఁ గని యి
ట్లనియెను గాంతుఁడు కరుణా
జనకసుధారసమయోక్తి చాతురి మెఱయన్: 27

‘తెలియకయుంటివేమొ పాలఁతీ, జగతి జ్జనించుటెల్ల ని
శ్చలబహుభోగభాగ్యములు సమ్మతిమై భుజియింపనేగదా?
లలితసుమంబు కాననతలంబునఁ బుట్టి జనోపభోగ్యమై
వెలయక వాడునట్టు లడవిం గృశియింపఁదలంపఁ బాడియే?

‘మనదగుజీవితంబు, ఘనమార్గములన్ దిగజాటి దిక్కులె
ల్లను నిజకాంతి హేమరుచుల న్వెలిఁగించి క్షణంబులోపలన్
మనిఁగెడు నాల్కఖండమనుమాట యసత్యముగాదు, కావునం
దనువునఁ బ్రాణముండఁగనె తన్విరో, సౌఖ్యములందమేలగున్.’

అనవుడు, యోజనమెయి న
వ్వనితయు మృదుమధురసరణి వాకొనె నిటు: ‘లే
వనుల వసించియు మిత్రుఁడ,
కనకుందుమొ యట్టి సౌఖ్యగతుల ముదానన్? 30

‘అకలుష నిర్ఝరీ జలరసాయనముల్, కిసలోజ్జ్వలలతా
ప్రకరములుం దృణోర్వులును బాపి కురంగకుమారి హేమ ర
త్నకలిత పంజరాంతరమున న్నివసింపఁగఁ జేయురీతిఁ గొం
కిక యవరోధసౌధమునఁ గట్టఁగ నెంచితె నన్ను నిచ్చలున్?

‘అప్పుడ విచ్చి తావులను నల్లనఁ జల్లు సరోజషండముం
గుప్పునఁ జేరి షట్పదము గ్రోలుమరందము; కృత్రిమంబుగా
నొప్పెడుపూవమూల్యమయి యుండియు నేమి గ్రహింప నందులం
జొప్పడునే మధువ్రతము చూఱలుగొట్టెడు కమ్మఁదేనియల్ ?

“పుట్టిననాఁటఁగోలెఁ దరుపూగమునీడలు విశ్రమింపఁగం
గొట్టములై చెలంగ వని గొఱ్ఱెలమేపుటె వృత్తిగా, రసం
బుట్టఁగ వేణుగానముల నోపినయట్టులఁ బాడికొంచు నా
యట్టికుమారి నేన యని యాడుచు నుందుఁ బ్రభాతవేళలన్

‘శ్యామలోర్వీధరంబుల సాంధ్యవేళ
జలధరాచ్ఛాదములపైకి నలమికొనెడు
కలిత కిమ్మీరవర్ణంపుఁగాంతులకును
సకలసామ్రాజ్య సౌఖ్యంబు సాటియగునె? 34

‘సరసి మృదుపంకలగ్నమై తరఁగలందుఁ
బాళిఁ జెరలాడు కమలినీనాళమేల
పెఱికి నాఁటెదు మోహానఁ బెరటియందుఁ
జావ కయ్యది బ్రతుకునే సదమలాత్మ? 35

‘నను నొంప నీయభీష్టం
బని తలఁచెదవేని నేఁడె యా నరవాసం
బునకు ననుం గొనిపొమ్మా’
యన నచ్చెలి, కాంతుఁ డనియె నాశ్చర్యమునన్:

“ప్రాణసమాన, నీదయిన భావము నే నెఱుఁగంగఁజాలమిం
బోణిమిదక్క పల్కితిని, భోగసుఖంబులు రాజ్యమేని త్వత్
ప్రాణసురక్షణార్థమయి వాయుదు; నీ కొకకీడు సల్పు హ్యా
తోఁక్షణమునం దలంచెదనె? క్రూరుఁడనే యిటుకష్టపెట్టఁగన్?

‘అదియేమో నినుఁగాంచ నాదుహృదయం బత్యంతరాగాంకురా
స్పదమై, పూర్వముచెల్మియున్నటులఁ జెప్పన్రానియిచ్ఛాలతల్
మదిలో నల్గడ నల్లువారె, నిఁక నిర్మానుష్యమౌకానన నో
సుదతీ, యొంటిగనిన్నువీడి చని యెచ్చోనైన జీవింతునే?’ 38

అనవిని, కోమలాంగి హృదయాంతర రాగరస ప్రవాహ వీ
చి నిబిడ శీకరప్రతతి చిప్పిలెనో కనుఁదమ్ములందునాఁ
దొనికెడు సమ్మదాశ్రువులు దూలఁగఁ దాఁగొన పైట నద్ది యి
ట్లనియెను గద్గదాస్ఫుటములై పదముల్ పవనానసూపలన్:

‘ఖగముల్ నీడములందు జంటలుగ నెక్కాలంబు వాసించు నిం
పుగ, నల్లే మనముంద మీసుమ లతాపుంజాలయంబు ల్వనిన్
సొగసు ల్మీఱఁగ విశ్రమస్థలములై, ఝుమ్మంచునిత్యమ్ముఁగూ
లగతాళ్మంబుల జాటి నిర్ఝరము లాలాపింప రాగంబులన్;40

‘హరినీలంబుల హీరము ల్పొదివిన ట్లాకాశదేశంబు భా
స్వరనక్షత్రమున న్వెలుంగఁగ, శరచ్చంద్రుండు దూఁగాడు కం
ధరపర్యంకము డిగ్గుచుండ, మది నెన్నన్రాని మోదంబునన్
సరసీసైకతసీమలందు మును సంచారంబుగావించితిన్. 41

> ‘పవమానచలిత పత్రా
> రవములు’ సెలయేళ్ళ గానరావము దక్కం
> బ్రవిమల రజనీశాంతత
> కు విభంగములేదు సరసికూలములందున్. 42

‘ఆనందపరవశనైన నాగానంబు
పవనకంపిత పర్ణరవము నందు
నున్నట్టు లుండి చెన్నొలయంగ నెలవులఁ
దులకించు నవ్వు వెన్నెలలయందు,
నిశ్చలజ్యోతియై నిర్మలంబైన చి
త్తము నిశాగర్భశాంతత్వమందు
మైమఱచినటించు మంజుల క్రీడలు
సరసీ తరంగలాస్యముల యందు

నైక్యమైపోయి మద్వ్యక్తియంతరించి,
యఖిలవస్తుచయాంతస్థమైన యాత్మ
యటుల, సర్వంబు నేనయై యకలుషంపు
నిర్భరానందమున నుంటి నిశలయందు. 43

‘నీ విచ్చో నివసింప నిష్టపడిన న్నిత్యమ్ముఁ దత్ప్రాంతసే
వా విద్యోతిత మానసాంబుజులమై ప్రాభాత నీరేజ షం
డావిర్భూత సుగంధగంధిల తుషారార్ద్రానిలాంకూరముల్
వీవంగ న్విహరించుచుండెదము సంప్రీతిం బిసాళించుచున్. 44

‘జనకునియట్టు లంత్యమున సర్వమువీడి ధరాతలంబునన్
మనవగుపేరు లెవ్వరు మనంబున నెంచనిరీతిఁ గాలవీ
థిని జరితాంఘ్రిచిహ్నములు తేరనియట్టుల మృత్యుసూత్రలం
బనమునఁ బ్రాఁకిపోయెదము స్వర్గముసేరఁగ నోయిమిత్రమా.

అనవుడు, పలుకక కాంతుఁడు
వనితకుఁ బ్రత్యుత్తరంబు వచియించుటకున్
మనమునఁ దోఁపక మీసము
మొన దువ్వుచుఁ గ్రిందిచూపు మొనయఁగనుండెన్;

తరుణియు జనకుని నామ
స్మరణమ్మున నాత్మచింత మదినెరియఁగఁ, దొం
తరలుగఁ గన్నుల బాష్పము
లురలఁగఁ బయ్యెదను ఱెప్ప లొత్తుచునుండెన్.

# సప్తమమంజరి.

ఇరువురు కొన్ని నిమేషము
లరిగినఁ గుటివేదినుండి యవలికిఁ జని ప
య్యరలకుఁ బువ్వులురాలెడు
తరుపుంజమునీడ సూర్యతాపము వాఱఁ. 1

తరుణ మరకతచూర్ణంబు పఱచినటుల
లేఁతపచ్చిక విలసిల్లి ప్రీతిఁగొలుపు
చల్లపట్టునఁ గూర్చుండి, సంతసమున
రమణుఁ డిటువల్కెఁ బ్రియసౌరభ్యమొలుక: 2

'అళిపక్షాహతి మొక్కవోవని మనోజ్ఞాంభోజ లావణ్యముం
దోలఁకంజేసెడు నీదు ముద్దుమొగముం దోరంబువీక్షింప నో
లలితాంగీ, ప్రణయార్ద్రమౌచు రసవాల్లభ్యంబునం బొంగు ని
చ్చలునాచిత్తము, పూర్వజన్మఫలముల్ సంబంధబాంధవ్యముల్!

'నిశఁ దనుంబు లడంచ వెన్నెలలకందు
గున్నపొదరిల్లు వలపింపఁ గొమరు కుసుమ
మటులఁ బురుషునిజీవితం బలరఁజేయ
స్త్రీల నిర్మించెను విరించి సృష్టియందు. 4

'మనుజుండేమయి యెట్లువోవునొ గదా మాధుర్యధుర్యాత్మలై
చను కాంతామణులుండకుండిన? నిలన్ సద్భావము ల్మాని దు
ర్జనుఁడై ఘాతుకసత్త్వమృట్టుల సహోరాత్రంబులుం గూరిగవ
ర్తనమే వృత్తిగఁ గర్కశాత్ముఁడయి నిందంబొందు నేమో చెలీ!

'ప్రేమకుఁ గేంద్రస్థానము
లై మెలఁతలు కటికవానియాత్మను నైనం
గోమల కరుణాంకూర
స్తోమము పుట్టింపఁగలరు శుభదృష్టులచేన్. 6

'సలిల ప్రవాహ వీచీ
చలితంబు తృణద్వయంబుచాడ్పున మన మో
చెలియా, దైవప్రేరణఁ
గలసితి మీవనులఁ; గౌతుకంబగు నిదియున్. 7

'కాని, మఱొక్కమాట, నినుఁ గాంచినదాదిగ వీడిపోవఁగన్
మానసమొప్పదేమొ; వని మాపరివారము నన్నుఁగాన కే
నే నెట కేఁగితో యని యనిశ్చితబుద్ధిఁ జరించుచుందు నో
మానిని, చూచివత్తు, ననుమానము చిత్తముఁ దీవరించెడిన్.'

అనవుడు, కన్యక విస్మయ
మున నిట్టులఁ బల్కె: 'నేమి? మును నొక్కఁడవే
వని కరుదెంచితివని నే
ననుకొందును, ప్రేయసుఁడ, యథార్థముఁ జెపుమా!'

నావిని కాంతుఁ డిట్లనియె: ‘ నాతిరో, నే మృగయావినోదచిం
తావివశుండనై వనుల దవ్వుల బోయల నిల్పి యొంటిగన్
ద్రోవనుబట్టిపోవ నెటనో సరిమార్గముఁ దప్పి చీఁకటిన్
శా వని నిన్నుఁ గంటిని ధరాధరపార్శ్వముఁ జేరుచుండఁగన్;

‘ ఇఁకఁ గొంతసేపు కానన
నికటతలంబులను వెదకి నే మృగయుల నూ
రికిఁ బంపించి యమాత్యున
కొకవార్తను బుచ్చి వత్తు నుత్పలనేత్రా.’ 11

అన విని సమ్మతింపఁ దరళాక్షియుఁ, గాంతుఁడు లోనిప్రేమ గు
ప్పున నెగఁదట్టెనో! యనఁగఁ బొల్పగు నెచ్చెలి యోష్ఠపల్లవం
బునకు నిజోష్ఠముం గదిపి, మున్నడి బాహులఁజాఁపి కౌఁగిటం
గొనె ఘనసాత్త్వికోచ్ఛ్వసితఁ గోమలి నుల్లము పల్లవింపఁగన్.

ఎంతసే పిట్టులుండిరో యెఱుకపడక
యిరువు రన్యోన్య నిశ్వాసపరిమళంబు
లాను చానందపారవశ్యమున నుండఁ
దనకుఁ దానుగ బాహుబంధంబు సడలె. 13

మారుత చాలితం బయిన మంజులవల్లికయో యనంగ శృం
గారశరీర కొంతవడి కంపిలి యర్ధనిమీలితాక్షులం
గూరిన మాంద్యముం దొఱఁగి కుంతలముల్ సరియొత్తికొంచు నా
భీరునితోడ నిట్లనియె: ‘ వే యరుదెంతువె సంజకీవలన్?’ 14

వీరుం డటువలెకా కని
సారసలోచనను వీడి చనుదెంచుచుఁ బ
ల్మాఱును వెనుకకు ముందుకుఁ
దారుచుఁ గనుచూపు దాఁటెఁ దద్వనసీమన్. 15

యువతియుఁ జెట్టునీడఁ గుసుమోజ్జ్వలమౌ సెలకొమ్మఁ బాణిప
ల్లవమునఁ బట్టి నెన్నుదుట లాస్యములాడు శిరోజమాలికం
జెవులకు నెట్టి, పూరసముఁ జిల్కుసమీరము వెంటనంటు భృం
గ విసరమట్టులం బ్రియుని గాంచఁగ నేఁగు నిరీక్షణావళిన్. 16

వెనుక మరల్పలేక పలవించుచు నెట్టకు నేని లోనికిం
జనఁ దమకించెఁ గాని, తనస్వాంతము కాంతునియందు లీనమై
తనరుట నెట్లుచూచినను దన్వికి నాతని సుస్వరూపమే
కనఁబడుగా, వియోగమునఁగాంక్షయుఁ బ్రేమయుమల్లడింపవే!

తటుకున నిల్లుసొచ్చి, క్షుభితంబగు చిత్తమునన్ మరాళసం
త్రుటితమృణాళమట్లు వసిదూలిన యంగముతోడ వేదిపైఁ
గుటిలశిరోజ పండుకొని కోర్కెలు ప్రేళ్ళులుకన్ భవిష్య ద
స్ఫుటనిజదిష్ట మాత్మఁ దలపోయుచు నుండెఁ దదేకచిత్తయై:

'తరుణుఁడు నన్ను రమ్మని ముదమ్మునఁ బిల్చుచునున్నవాఁడు, భూ
ధరములఁ గానలన్ గొఱెలతండము మేపుటమాని సౌధమం
దిరముల నేవొ రత్నరమణీయ విభూషలు జిల్గుపట్టు టం
బరములుఁ దాల్చియుంట యనుభావ్యసుఖంబఁటయాస్థలంబునన్

'శబలితంబైన పురుహూతచాప మంత
రాళమునఁ గాంతి విలసిల్లు వేళ లేఁత
పచ్చికబయళ్ళ మిన్నులుపడ్డయెడకుఁ
బఱువిడఁగనీయరఁట యంతిపురిజనంబు.' 20

అని తలపోయుచు నిట్లా
వనితామణి పవనచలిత పర్ణరవంబుల్
వినఁబడ, వచ్చెను నాప్రియుఁ
డని చూచుచునుండుఁ దమిని ద్వారమువంకన్. 21

'నవకపు సాంధ్యరాగకిరణంబులు -మారుల నల్లువాఱె లోఁ
దవిలి కుటీరకుడ్యములఁ దాల్రమ సుమావళి జాలెగట్ట నిం
తవఱ కదేల రాఁడొ, వనిఁదప్పెనొ మార్గముకాంతుఁ'డంచు నా
యువతి విదీర్ణ భావయయి యుండఁ దమిస్రము నిండె నల్గడన్.

పూవుఁబోదరింట నిండారఁబూచి క్రొత్త
పరిమళంబులు వెదచల్లు ప్రసవ మొండు
గాలితాఁకున ముండ్లలోఁ దూలినటుల
నతివహృదయంబు శోకసంపతిత మయ్యె. 22

జనకుఁడు లేఁడు, కాంతుఁడును సంజకు రాఁడు, తమోవితానముల్
దనరెను దిక్కులందు, మదిఁ దాపమువోదు, కుటీరమందు నెం
దు నెగడు శాంతికిం బొలతి దుఃఖరవంబె విభంగహేతు; వ
వ్వని నిశ నొంటిగా నెటుల వాసముసేయును గాంతచింతతోన్?

కిసలయాచ్ఛాదనాంతస్థ కుసుమకళిక
యనిలసంహతి దినకాంతిఁ గనినరీతి
హృత్ప్రపంచవైశాల్య మయ్యెంతి కనులఁ
గట్టె మోహము తీయ మార్గ్యంపుఁదెఱను. 25

ఇదివఱ కెల్ల వేళల మృగేక్షణ మోహనునంటియుంటఁ దా
నెదఁ దలపోయద య్యెఁ బితయేఁగిన లోపము; నిప్పుడన్ననో
పొదలెడిభీతిమైఁ దనదు పూర్వచరిత్రము సంస్మరించి యా
పదలను జిక్కికొంటినని పల్మఱు నుమ్మలికంబునొందెడిన్. 26

చెలియమనంబు పూర్వమటు చెన్నలరారుట లేక ఘర్షణా
కుల బహువిభ్రమాశయతఁ గుందుచునుండె నిరంతచింతలన్;
లలితసుమాంగి- లోకకుహనాగతుల స్మృతిలేనిముగ్ధ- య
శ్కలికి హఠాన్మనోవ్యథల గాటియకున్ సహింయింపఁజాలునే?

హేతువిజ్ఞానపతితమా నాతిమనము
ప్రతినిమేషముఁ జిత్రించుఁ బ్రచుర వివిధ
భీకరాకారముల భావవిగ్రహములఁ
బర్ణమర్మర నిస్వాన వర్ణయుక్తి. 28

అరరే! జీవితచిత్రవైఖరి, త్రుటిన్ హర్షంబు శోకంబుగం
బరఁగున్ శోకము హర్ష మట్లు! సుమనోవల్లీ మనోజ్ఞాంగి-సుం
దర పద్మాయతనేత్ర- నీలకచ- విన్నాణంపుబింబోష్ఠి- య
ద్దిర! యున్మాదినా వికీర్ణకచమై దీనాస్యమై చూపడున్!

నిదుర పట్టియుఁ బట్టక సుదతి కపుడు
చిత్ర చిత్రాకృతులు స్వప్నసీమఁ దోఁప
నులికిపడి లేచి యొంటిఁ దా నుంట యెఱిఁగి
గాలిగర్భాన నేడ్పులు గరఁగఁ బొగిలె. 30

కడ కెటులో ప్రభాతరవ కాంత నెగుల్గన లేక శాంతముం
గుడుపఁగ వచ్చుచున్నదని కూరిమిఁ దెల్పు సఖీజనంబు నా
వడి నరుణాంశుమాలికలు పర్ణగృహంబు నలంకరింప న
ప్పడతుక మేలుకాంచి కుటిపార్శ్వవనాంతరముల్ చొరంబడెన్.

మారుతోద్ధూతమై నభోమార్గమందు
సుడియు శుష్కచ్ఛదంబునా సుందరాంగి
యేఁగుచుండె గమ్యస్థలస్మృతియు లేక,
దైవ మీడ్చెడు కాననస్థలుల కెల్ల. 32

ఆలున్ అప్పులు కంటకంబులు తృణాగ్రంబుల్ పదాబ్జంబులన్
డీలం జేయ, సహస్కరుండు నడిమింటిం జేరి తీండ్రింపఁగం
గాలుం బెట్టఁగ లేక, కాంతుకయి యొక్క ట్రోయు కోకింబలెన్
రోలంబాలక చెట్టునీడఁ బడి యాక్రోశించుఁ బేరెల్గునన్: 33

'కాంతుఁడ, యెట్లు వోయితివి కానల నవ్విడనాడి? సంజ కీ
ప్రాంతము చేరవత్తునని పల్కియుఁ బ్రేమ రసార్ద్రచిత్త ని
క్లింతయుఁ గష్టపెట్ట మది యెట్లు సహించె? శిరీషపేశల
స్వాంతులు నిట్టివంత గుడుపం దలపెట్టుట పాడియే యెటన్ ?

‘విరహ మనార్తిదాయకము వీడక నిందలపోయుట న్మనో
హరుఁడ, కఠోరకంటకసమాకులమైన గులాబిపూఁబొదం
జొరఁబడి మంచుతుంపరలు జొబ్బిలు పుష్పముఁగాంచురీతి; ప్రే
మరస నిషేవణాత్మకుల మానసము ల్మధురంబు లెయ్యెడన్. 35

‘జనకుని నిర్యాణంబును
నినుఁగాంచుటయుం దలంప నిమర నెవేవో
గనఁబడుచు మాయమయ్యెడు
మనోహర, విచిత్ర పాళిమాడ్కిం దనరున్. 36

‘తెలియఁగనైతి మద్హృదయ దేశమునం దిటువంటి వింత శ
క్తులుజనియించునంచుఁ గొలఁదుల్గనఁజాలకయుంటి నే మొ పూఁ
గలికయు భావివిస్ఫుటవికస్వరతం గని సౌరభంబు ని
చ్చలుఁజిలికింతునంచెఱుఁగఁజాలునె చైత్రము డాయునంతకున్?’

అనియిట్టు చింతచేసి, చెలి యంతటఁ గాంతుఁడు పర్ణశాలకుం
జని, తను వేచుచుండునని చయ్యన లేచి కుటీరసీమకుం
జను, నట నెవ్వరు న్మెదలుశబ్దము గానక నిష్ఫలాశయై
గొనుఁగుచుఁ బోవుచుండు నెటకో పటుశోకవిపాటితాత్మయై!

ఒకనాఁడు గిరికూట నికట గహ్వరముల
సానుభాగంబులఁ జక్కఁజూచు,
నొకనాఁడు భీతిదాయక కాననముఁ జేరి
తొర్లిక్కనిదారులు తొర్లిక్కి వెదకు,

నొకనాఁడు నిర్ఝరీ సికతాతలంబుల
కేఁగి పాదాంక పరీక్ష సేయు,
నొకనాఁడు విభ్రమాచకితమనస్క యై
తిరిగినయెడ లెల్ల మరలఁ దిరుగుఁ,

దల్లిఁ బాసిన లేఁజింకపిల్లయటులఁ
దాను మెట్టని కాననస్థలము లేదు
నాఁగ వెదకియుఁ బ్రియుని గనంగ లేక
ఖిన్నమానసయై మేడ్చు మిన్నుఁ గనుచు. 39

దినదిన మిట్టులఁ గాంతా
ర నగముల న్వెదకి, రాత్రియుఁ బవలుగా
మనముఁ గలంచెడు చింతా
ఘనశల్యమునం దొలంగెఁ గలికి బెడంగుల్. 40

నీరు నన్నంబు విడనాడి, నిదుర మాని
విరహశోషిత చిత్తయై సరసిజాక్షి
చేతనాచేతనజ్ఞాన సిద్ధిఁ దొఱఁగి
పలుకసాఁగె మనోవ్యథ పక్షులకును: 41

‘కలరవ కోమలం బగు వికస్వర సుస్వరమెత్తి నీహృదిం
గల సరసానురాగ మెసకమ్మగఁ బాడెద, విట్టివిద్య నెం
దుల మును నభ్యసించితివి? దుఃఖనిమగ్నుఁ జేయు ప్రేయసుం
డలవడఁడేమొ నీకును బికాంగన? పలుకు మముద్దుగుల్కఁగన్;

'నీసంతోషమునన్ శతాంశమయిన న్నిత్యమ్ముశిక్షించు మో
వాసంతంబ, మనోవిషాదపథము ల్వర్జించి నక్షత్రవీ
ణాసంబద్ధ మదీయగాన రవ సంతానంబు నీగీతలన్
వాసి న్మేళముచేసి యీవనముల న్వాసింతు సఖ్యమ్ముగన్; 43

'అనిలహతిం జలించి యనయంబును డోలికయట్లు లూఁగు కొ
మ్మను బసికందునుంచి మృదుమంజులగానముసేయు శారికా,
నను విధి నీదుగర్భమున నాఁడె జనింపఁగఁజేసియున్న మో
హన వనవీథులం దెగురులాడుచు నుందునుగాదె మీవలెన్;

'నిర్మలనిర్ఝరంబ, రమణీయకలాస్ఫుట గాన నిస్వనం
బర్మిలిఁజేయుచున్ గిరితటాగ్రములం బ్రవహించుచుందు వా
మర్మముసెప్పి నీయుదరమధ్యమున న్నను జేర్చికొమ్ము త్వ
చ్ఛర్మద గర్భశీతలత సంతత శాంతి కరంబ యాత్మకున్.' 45

అనుచు విషాదచిత్తయయి యాకుసుమాంగి విషాదబాణసం
జనిత నితాంతబాధఁ బెలుచం బతితంబగు హంసమట్లుఁ దాఁ
జని నెఱిపూవుటోవరి విశాల తృణాంకురశయ్యపై శయిం
చెను నిజజీవితాభ్రమునఁ జెన్నఱెనో కడసారి తారనాన్. 46

కొఱలు బహిఃప్రపంచమునకుం దనకుం దెరచీరగాఁగ బం
ధురసుమమ్ము ల్సమీరహతిఁ దూర్ణములాల, వికాసపుంజమై
పొరసెనుగాంతి, శాపమునఁ బుష్పసమాధి విలీనయైన యు
చ్చర పువుఁబోణివోలె విలసచ్చటులాలన గుప్తవక్త్రయై.

## అ ష్ట మ మ ం జ రి .

వేఁటాడుచు మృగయులు ఘో
రాటవి నగపతిని గాన కడలుచు నాయా
చోటులు లోయలు భూభృ
త్కూటంబులు వెదకి జాడ గూడక యున్నన్; 1

'వేఁటతమకమ్మున నారాజు వీడి మనల'
వనులలోఁ గ్రూరమృగములవాతఁ బడెనొ,
గాకయుండిన నెందేనిఁ గానరాఁడె'
యనుచుఁ బలవించి పరివార మేఁగెఁ బురికి. 2

నృపకుమారుండు మృగయుల విసినమందు
వెదకివెదకియుఁ గనలేక విసుగుఁబొంది,
పర్ణశాలకు మరలుచుఁ బథము దప్పి
క్రుమ్మరుచు రాత్రిఁ బుచ్చె నా కుధరములనె. 3

చని సరిదారి గాంచి, విలస త్తరుణార్క మయూఖమాలికా
జనిత సువర్ణకాంతుల ససల్ కిసలంబులఁ బొందిసేయు చోఁ
గనె. ఖగవర్జితం బగు వికాసవిహీన కులాయమట్టులం
దనరు కుటీర సీమ నతిదారుణ శోకపరీత చిత్తుఁడై. 4

ఇంతకుమున్నె ప్రేయసి
కాంతుఁడు రాఁడనుచు నిబిడకాంతారములం
జింతమెయిఁ వెదకఁబోవుట
నింతిని గనఁడయ్యె ధారుణీశ సుతుండున్; 5

కనక, 'యిదేమి! కాంత యిటఁ గానఁగరాదు? ప్రదోషవేళ దాఁ
కను నను వేచి, వంచకునిగాఁ దలపోసి, హతాశయై కడు
న్వసరి ప్రపంచజీవనము వాయుచు శాంతికరం బటంచు నే
వనతరువాటికా లతలబంధములం ద్యజియించెనో యెందున్!'
అటునిటు పాఱఁజూచుఁ, 'జెలియా, చెలియా' యను, జెట్లనీడలం
జటుల లతానికుంజములచక్కని గాంచు, విషాదబాష్పముల్
తటుకునరా నడంచు, విదితంబుగఁ జేతులు దట్టు, వీరుఁడు
తక్కటరవ మేర్పడం బిలుచుఁ గాంతఁ గనుంగొనలేక దీనుఁడై.

వెలఁదియును దాఁ బరస్పరాన్వేషణంబు
సేయుచును దుర్గమారణ్యసీమ నొకరి
కొకరు వోయినమార్గమ్ము లొనరుపడక
తిరుగుచుండిరి వెతఁ గొన్ని దినము లిటుల. 8

కుసుమాపచయమునకుఁ దరలెనో యని
నవ లతాపుంజంబుఁ దవిలి చనును,
నట లేకయున్న మిక్కుట మగు చింతతో
మరలి, నీరాడఁబోవు రమణియని

నిర్మల నిర్ఝరీ నికట సైకతముల
కేఁగి వీక్షించు, సందేందు లేక
యున్నఁ బేరెల్గున 'నోకాంత, నను వంత
వెట్టంగనే' లని విసిగి పలుకుఁ,
దరుణుఁ డేమన్నఁ దన ప్రతిధ్వనియెగాని
యువతి ప్రత్యుత్తరంబు రాకుంట మెఱిఁగి
యచట బాటల నూత్న పాదాబ్జచిహ్న
లొనరఁ దన్మార్గమునుబట్టి చనుచునుండె. 9

చనిచని, యొక్కచో వికచ సారస షండమునందు సుప్తిమెఁ
గనుఁగవమోడ్చుహంసివలెఁ గాంతిలు నోర్తుకఁబుష్పపుంజమం
దు నిదురవోవు నిర్జర వధూమణిఁబోలినదానిఁ దీవటెం
టను బడియున్న దాని నికటంబునఁగాంచెఁ దృణంపుశయ్యపై;
కాంచి, దృగంచలంబులనె కాంచనగాత్రిని మ్రింగునట్లు కుం
జాంచలవీథిఁ జేరి: 'హృదయ ప్రతిబింబసమాన యిద్ది, నా
చంచలనేత్ర యం' చని విషాదము విస్మయ మంతమోదముం
గొంచక చిత్తముం గలఁప గుండె దడాబడఁ గొట్టుచుండఁగన్;
'ఏమని యెంతు నాసుకృత మీగతి ముత్పెతిపాదియయ్యెఁ,గాం
తామణిఁ గాననో యని వెత న్నశియించెడునాకుఁ బేద కు
ద్దామ ధనంబునా దొరకె, ధన్యుఁడనైతి' నటంచుఁ గోమలిన్
శ్యామల పత్రపుష్పనిచయంబులనుండి తెరల్చె మోఁదికిన్.

కమలిన పద్మనాళమటు కాంతి దొఱంగిన దేహవల్లి స
శ్రమముగ నెత్తుచుండఁ బయివ్రాలెను దూలికవిగ్రహంబు నా
విమల విలోలనేత్రములు వే ముకుళించిన తమ్ములట్లు మం
జిమరమఁ బాసి వ్యాపనముచేసెను సుందరతా ప్రదోషముల్.

చెలి యంసంబుల నల్లపట్టుల నిస్సీమంపుఁగాంతిన్, మరు
చ్చలితంబై పరికీర్ణమా నెఱకలన్ సంధించి బంధించి ఘ
ర్మలవంబుల్ నిటలంబునం దుడిచి 'లెమ్మా,యింకనో ప్రేయసీ,
పలుకన్ లేవె యటంచుఁ' గాంతుఁడననాపంకేజపత్రాక్షియున్;

ఘన విద్యుచ్ఛక్తిని సం
హననంబున నూత్నసత్వ మలరునటుల మో
హను హస్తస్పర్శను గ
న్గొనలం గదలించి స్మృతి గనుంగొనె మెల్లన్; 15

చాయఁ దొఱఁగిన ప్రత్యూషచంద్రిక యన
నర్ధహాసంబు మోమున నంకురింప
నరసె హృదయేశు వైశాఖ మంతరింప
మాధవునిఁ గాంచు వనలక్ష్మిమాడ్కిఁ జెలియ. 16

మెలఁత కన్నులు విప్ప నిమేషమందె
పరమ సంతోషలోక కవాటములును
గళ్ళు సడలెఁ గాంతునకుఁ, దాఁ గాల నడచు
నో తలనడచునో యదియుఁ దెలియండు: 17

తామరపాకుదొప్ప వసుధాధర నిర్గత నిర్ఝరీజలం
బామెకుఁ దెచ్చియిచ్చి, చివురాకుల వీవన వీచు, చంగనా
కోమల పాదపల్లవము గోమటి గాయము వాటియుంటఁ జిం
తామతియై వనారిలుచుఁ దన్వికి నిట్లనెఁ బ్రేమ మొల్కఁగన్:
'పదము ల్గందఁగ దేహవల్లి కృశియింపన్, ముద్దునెమ్మోము సం
పద రేకెత్తఁగ, దుర్గమాటవులలోఁ బల్మాఱుఁ గాల్మెట్టి డ
స్సి దిశల్ సూచుచు నేడ్చుచుం, దుదకు నన్ సీకొట్టుచుం గుంజమం
దుదుటున్ శోకముతోడ మూర్ఛపడితే యో ప్రేయసీ, దీనవై.

'సూర్యుఁ డపరాద్రి భవనమ్ముఁ జొరకమున్నె
మృగయులనుగాంచి గృహమున కేఁగుదెంతు
నని వచించితిఁ' గాని, యీ వనములందు
మార్గవిచ్యుతి రాత్రిఁ గ్రుమ్మరితిఁ దరుణి; 20

'కల శకుంత రవమ్ములు గడలుకొనెడు
ప్రత్యుషమ్మున వచ్చియుఁ బర్ణశాల
నిన్నుఁ గాంచక చింతించి యన్నిదెసలు
ననుదినంబును వెదకుచు నడలి బడలి; 21

'పారములేని పుణ్యపరిపాకవశమ్మున నిన్నుఁగంటి నీ
తీరున నైన నేఁడు పొలఁతీ, నినుఁ గాంచఁగఁబూర్వరూపశృం
గారపు టస్థిపంజరముగాఁ గనుపట్టెద, వెంతలోపలన్
మాఱెను మంజులప్రకృతి మంచుచలిన్ జలజాతమట్టులన్!'

అనవుడు, కాంత యిట్లనియె: 'నబ్బురమే ప్రణయానుబంధవ
ర్ధనహృదయు లిర్వియోగమునఁ గ్రాఁగుట? జక్కవపెంటి వెన్నెలం
దన ప్రియకాంతుఁగానక వ్యథాకరుణంబుగఁ గూయుచున్ సరో
వన జలతాకుడుంగముల వందురుచుం జరియించుచుండదే? **23**

'నను నిట వీడిపోయి తని నమ్మి వనంబులుసొచ్చి చూచి నెం
దును నినుఁ గానకే విసిగి తోరపు డప్పిని బూవుటెంట నె
ట్టనఁ బడిపోవ, నంతనె నిటాలమునం జెమ రంకురించి చ
ల్లని మలగాలిసోఁక నొడలన్ గగుఱెత్తి వడంకితిం గదున్;**24**

'కన్నులఁగట్టునా యిఁకను గాంతుఁ డటంచు నిరంతరంబు ని
న్నెన్నుచు మాలదైవమున కేడ్చుచు, లేవను శక్తిలేక యా
పన్నత నూర్చుచున్ బడలి బాటలుసూచుచునుండ మూర్ఛమైఁ
గన్నులు పచ్చనయ్యె; నెటుకాలమువోయెనో గాన నవ్వలన్!

'మారుతానీత శబ్దంబుమాడ్కి నల్ల
శ్రవణపథమున నెద్దియో చలన మయ్యెఁ,
జంద్రికాశీతలంబైన స్పర్శ దేహ
మందు నూతనోజ్జీవన మలరఁ జేసె; **26**

'కన్ను ఱెప్పల నెత్తంగఁ గట్టయెదుటఁ
బ్రేమ సాక్షాత్కృతిగఁ గంటి బ్రియుని-నిన్ను,
విరహశోషితచిత్తంబు వీక్షణామృ
తంపు సేచనమున రసార్ద్రింబు గాఁగ.' **27**

అన విని కాంతుఁ డిట్లనియె: ‘నారట మొందితి నానిమిత్త మి
వ్వనులఁ జరించి డస్సి; తోకపాటు నెఱుంగని ముద్దరాలి నా
వనజభవుండు కష్టముల పాలొనరించెఁ, గురంగి కంట నీ
రు నిడిన వేఁటకానికి మరు ల్జనియించునె? చింత పుట్టునే? 28

‘పర్ణశాలకుఁ బోదము పద బిరానఁ,
జెప్పెద రహస్య మొకఁడు చెలియ నీకు,
నడువఁ జాలవు మెలమెల్ల నడుగు లిడుము
మద్భుజాలంబయష్టి నెమ్మదిఁగ నూని’ 29

చెలువయు నట్లకా కని విశీర్ణపువాతెఱ నాల్క నద్దుచున్
బలితపుమాంద్యముం దొఱఁగి పయ్యెద కొంగును జక్కనొత్తిముం
గలఁ జరియించు కాంతుభుజకాండమెయూఁతగఁ, జెట్లనీడలన్
సలిలపుఁబట్టుల న్నిలిచి చల్లనిపయ్యర కూరడిల్లుచున్; 30
ఎఱలకుఁబోయి నీడముల కేఁగెడుపక్షులతోఁ బ్రదోషపుం
దరుణమునందు మందగమనంబునఁ బర్ణగృహంబుఁ జేరి య
త్తరుణియుఁ బ్రేయసుండు మును దామటనొందినకష్టపుం బరం
పరఁ దలపోయుచుండఁ దెలవాఱెను దిక్కులలక్షితంబుగన్.

తరుణార్క మయూఖంబుల
నిరువురుఁ జలి గ్రాఁగు చుండి, యిట్లనియెను సం
బరముగఁ గన్నియ: ‘ప్రియుఁడా,
పరమరహస్యం బదేదొ పలుకుము నాతోన్’ 32

నావుడు కాంతుఁ డిట్లను: 'మనంబుఁ దిరంబొనరింపు, మాధకా
రావిల మైనరాత్రి నమృతాంశుని వెన్నెల నవ్వురీతి నీ
జీవితమున్ మనోజ్ఞముగఁ జేయు నుదంత మొకండు దెల్పెదన్
భావిశుభానుభూతులకుఁ బాత్రమవై దయివాఱునట్లుగన్;
'ధరణీఖండము నేలురాజునకు మోదంబార జన్మించి, బం
గరు టుయ్యాలల నూఁగియున్ విధితిరస్కారంబునం గొండలన్
గొఱెల న్మేపుచు లోకవృత్తముల బాగుల్గాంచకే ముగ్ధవై
తరుణీ, యుంటివిగాని నీకుచితమే దాస్యంబు దారిద్ర్యమున్?

'పరభూమీశునకు న్నిజ
ధరణీభాగంబు నోడి దారుణ శోక
స్ఫురితాత్ముం డయి నీకై
పురమును విడి వన నివాసమును గొనెఁ బితయున్.'

అన విని తక్షణంబు మదియందు హఠా జ్జనితంబులైన భా
వనలు పరస్పరాహతుల భ్రాంతము లౌచుఁ గలంగ, లోకము
వ్వనిత కగోచ రాశయ నిభంబు దురూహ్యమునై కనంబడం
దన హృదయేశుఁ గాంచి చిఱునవ్వు మొగంబు నలంకరింపఁగన్:
'నను నచ్చోఁ గొనిపోవ వెంచి కడు విన్నాణంపుఁబన్నాగముం
గనుఁగొంటే! గిరులేడ? రాజ్యములు బంగారంపు టుయ్యాలలే
డ? నిరాలంబము నీదువాక్యమనుచుండం గన్య, యక్కాంతుఁ డి
ట్లనియెం బేరెదఁ జేయివెట్టికొని సత్యాలాపధుర్యంబుగన్: 37

'నన్నుఁ గపటాత్ముఁగా మదినెన్నికొంటె?
ప్రత్యయం బిప్పుడే నీకు బయలుపఱతు;
నాన్న దాచిన క్షాత్త్రచిహ్నములు గొన్ని
వసుధగర్భంబునం ద్రుప్పు పట్టు ముగుద.' 38

అని, కుటి కుడ్యపార్శ్వనిచితావని నచ్చెలి చూచుచుండఁ ద్రవ్విన శర చాప వర్మములు వెల్వడ నబ్బురమంది, 'బాపురే! జనకుఁడు గూఢచిత్తుఁడయి సంతతము న్వెత వోవుఁగాని, యి ట్లని వచియింపఁ డెద్దియును, హా! తెలిసెం బితదుఃఖహేతువుల్.'

అనుచుఁ గవచమ్ము శీర్షణ్య మస్త్రములను
బ్రీతిఁ గైకొని బాష్పము ల్విడిచి తడిపెఁ
దండ్రిఁ గాంచినయట్టు లా తన్విహృదయ
మందు స్నేహానుబంధంబు క్రందుకొనఁగ. 40

'అతివ వచ్చెదవే యిప్పుడైన నీవు
జనక పాలితమైన దేశమును గాంచ?
హర్మ్యము లవి చంద్రోపలాంచితములు
పౌరు లేఁటికి శిల్పనైపుణ్య మెసఁగ'

అనవుడు నూతనేచ్ఛ మదియందుఁ జెలంగిన, స్వీయసౌధముల్ గనఁ గుతుకమ్మునం జెలియ కాంతునితో నిటువల్కెః 'జిత్తమోహన, కొనిపోమదే యటకు? నమ్మ వసించిన నాపరిదేశముల్ గనుగొన దుర్దమం బయిన కాంక్ష జనించె, నపూర్వమద్దియుః!

అనవిని ప్రేయసుండు: 'నవునా? చనుదెంతువె? నిశ్చయంబె? మీ
జనకుఁడు మున్ను నేలిన విశాలధరావలయంబు నేన పా
లన మొనరింతు; నీవును విలాసయుతంబుగ రాజ్యభోగవ
ర్ధన గృహిణీపదంబుఁ బ్రియదా, ముదమార నలంకరింపుమీ.'

కాంతా మూకీభావమె
కాంతుఁడు సమ్మతిగ నెంచెఁ, గాంతార గిరి
ప్రాంతంబులు విడి యిరువురు
చింతాశల్యంబుఁ బాసి చేరిరి పురికిన్.

పురికిం బోయిన కొన్నిరోజులకు నాపూఁబోణి మెప్పించి బం
ధురసౌఖ్యోన్నతిఁ బెండ్లియాడె నతిసంతోషమ్మున న్వీరుఁడున్;
ధరణీరాజ్యము భోగభాగ్యముల విద్యాకీర్తుల న్మీఱ ని
ర్భర సౌఖ్యమ్ముగ నేలుచుండెఁ బ్రజసంభావింప భక్తిస్పృహన్.



# కృ షీ వ లుఁ డు

ప్రథమ ప్రచురణము 1919

ద్వితీయ సంస్కరణము. 1924

# ప్రేమాంకము.

అన్నా, మన్నెము శేషురెడ్డి, యెటులో
యావిర్భవంబొంది స్నే
హౌన్నత్యంబు పరస్పరంబు రమణీ
యానేక భావంబులం
జెన్నారెన్ హృదయానుబంధరచనా
చిహ్నంబుగన్, మాఱుపా
టెన్నండుం దలచూప దిందనుక దై
వేచ్ఛాప్రభావంబునన్.

అట్టినిర్మలమైత్రికి నానవాలు
నవ్యకవితాసుమంబుల దివ్యమాల
నెమ్మిఁ గీలించుచున్నాఁడ నీదుకీర్తి
కామినీ కంఠసీమను గాంతు లొలయ.

ప్రియమిత్రుఁడు,
దువ్వూరి రామిరెడ్డి.

## కట్టమంచి రామలింగారెడ్డి గారి

# ఉపోద్ఘాతము

ఆంధ్రవాఙ్మయమున ప్రకృతము ప్రసిద్ధికి వచ్చుచుండెడు గణ్యములగు నూతనసృష్టులలో నీకావ్య మొకటి. విషయమందును భావములందును ఇయ్యది మనదేశముయొక్క నవజీవితమునకుం జేరినది. అచ్చటచ్చట శైలియందును దూరోపమలు మొదలగు నలంకారముల యందును ప్రాచీనవాసన యింకను కొంత వదల వలసియున్నటుల తోచెడిని.

కవి కాఁపుయువకుఁడు; విషయము కాఁపులజీవితము; దృష్టి యభిమాన ప్రేరితము. కృషీవలుల జీవితమును ప్రధానాంశముగ గ్రహించిన తెలుఁగు గ్రంథములలో నిదియె మొదటిది. ఈవిషయ నవ్యతను దలంచియ కాఁబోలు రామిరెడ్డిగారు ఈక్రిందివిధమున వితర్కించి యుండుట:

అన్నాహాలిక, నీదుజీవితము నెయ్యంబార వర్ణింప మే
కొన్నన్, నిర్ఝరసారవేగమున వాక్పూరంబు మాధుర్యసం
పన్నంబై ప్రవహించుఁగాని, యితరుల్ భగ్నాశులై యీర్ష్యతో
సన్నుం గర్షకపక్షపాతియని నిందావాక్యముల్ వల్కరే?

తాను పూర్వలాక్షణికుల కరిగాఁపుగాఁడనియు స్వచ్ఛంద విహార శీలుఁడనియు నీక్రింది పద్యములలో బాహాటముగ చాటించియున్నాఁడు.

వనలతయైన నాకవిత పత్రపుటంబులఁ బూవురెమ్మలన్
దినదిన జృంభమాణయయి తేజరిలెన్ సహజప్రరోహ వ
ర్ధన నియమానుసారముగఁ, దల్లత యెన్నఁడుఁ దోఁటమాలిపా
ణినిఁ గనుగోని వన్యరమణీయతఁ జిల్కు నపూర్వపద్ధతిన్.

పంజరనిబద్ధ కీరంబు బయలుఁగాంచి
యడ్డుకమ్ములదాఁటంగ నాసచేయు
నటు బహిర్నియమంబుల నతికరించి
మన్మనంబు స్వాతంత్ర్యసీమకుఁ జరించు.

కాన, యెవరేమియనుకొన్న దాన నేమి
గలుగుఁ? గాలమనంతము, ఇలవిశాల,
భావలోకము క్రమముగాఁ బడయుమార్పు:
ఏల హృదయంబు వెలిపుచ్చ నింతయళుకు?

తన కవిత వనలత, స్వచ్ఛందవ్యాపనముగలది. చెన్నపురిలోని మాలీలదోహదములు కత్తిరింపులు మొదలగు చికిత్సలచే కృత్రిమసౌభాగ్యమువహించిన పూలచెట్లవంటిదిగాదు, " సహజ ప్రరోహవర్ధన నియమానుసారముగ " నల్లునట్టితీఁగె. " అపూర్వపద్ధతి " నవలంబించినది. శాస్త్రకారుల యాదేశములను, పారంపర్యప్రాప్త బహిర్నియమంబుల పాటింపదు. ఆగమపుంజములకుచేరిన గతానుగతికముగాదు. స్వాతంత్ర్యసీమను జరించునది. ఏమీ! పూర్వికుల విధులను అతిక్రమింపవచ్చునా? వారేర్పఱచిన కృతివిధానములుగాక అన్యము లెక్కడనైన నున్నవా? అని మూఢభక్తు లెవరైన ఆక్షే

పించినయెడల “ కాలమనంతము, ఇలవిశాల, భావలోకము క్రమముగాఁ బడయు మార్పు ” అని కవి వారిని తిరస్కరించి తనదారిని తా నేగడిని. వీరు చేసియుండెడు కవితావిషయమైన చర్చను కొన్నియేడులక్రిందట సందర్భానుసారముగ నేనును “ కవిత్వతత్త్వవిచారము ” లో చేసినాఁడను.

“ ఐరోపాలోని కవీశ్వరులు కొందఱు కాఁపువారు, సైనికులు, మొదలైన తక్కువ వృత్తులవారి బ్రదుకులను వర్ణనార్హములని భావించి యెంతో సుందరముగఁ గావ్యములలో వ్రాసియున్నారు. మనగ్రంథముల మాత్రము చదివి యీపుణ్యక్షేత్రమైన కురుక్షేత్రముయొక్క స్థితిగతుల నరయఁజూచువారికి ఈ దేశమున బీదసాదులపై నాదరముగల కవి యెవఁడైన నున్నాఁడా? తుదకు బీదసాదులైన నున్నారా? యను సంశయము పట్టినను తప్పు వారిదికాదు! శోకరసము వర్ణింపవలయునన్న ననుకూలమగు సందర్భమెయ్యది? క్రొవ్వుకా కెడి నాయికా నాయకుల యూహామాత్రములైన కష్టములా? ప్రజలు దినదినము కన్నీరుగార్చుటకైన నవకాశములేక కుడుచుచుండు పరిపరివిధములైన గోడులా? శాంత రసమునకుఁ బోషక మెయ్యది? తమకుఁ గష్టముదేనట్టివైన రాజులయొక్క యుదారచర్యలా? ఆఁకట మాడి మలమలమాడుచు నింటికివచ్చి వంట సిద్ధముకాకుండినను భార్యపైఁ గోపింపక, కన్నులు మూఁతవడుచుఁడ విధిని ధ్యానించుచు నొకమూలఁ గూర్చుండు పొలముకాఁపులయొక్క నడవడియా? ఆహా! జనసామాన్యముయొక్క ప్రతిదిన వృత్తములలో నెంతభావము, రసము, గుణము నుపగతములై యున్నవో మనకవులకుం దెలియవుగదా! రాజపుత్రులను రాజకన్యలను, చాలనందుకు బ్రాహ్మణులను వేశ్యలనుబట్టి ఝుఁఝూటమాడుటదప్ప కవితకు మేలైన యన్యకర్మములు లేవా? ”

ఉన్నవి యనుటకు ఈ “ కృషీవలుఁడు” ను, అబ్బూరి రామకృష్ణరావు, రాయప్రోలు సుబ్బరావు మొదలైన యువకులు విరచించియుండెడు

## నవ్యకావ్యములును ప్రమాణములు.

ఈగ్రంథమునందు పొలముకాఁపులయు కాఁపుటిల్లాండ్రయు దైనందిన చర్యలతోడ ఋతువర్ణనములను కవి బహు చమత్కారముగ సమన్వయించి యున్నాఁడు. ఇది భావగంభీరులకేగాని శుష్కపండితులకు సాధ్యమగు క్రియగాదు. ప్రాతఃకాలమునుండి రాత్రి నిద్రపోవువఱకు కృషీవలులుచేయు కార్యములొకకూర్పు; వీనితో సమ్మేళించిన విధమున చేయఁబడియుండెడి ఋత్వాది ప్రకృతివర్ణన మింకొకకూర్పు. రెండును భావకళానిర్మితములును శోభితములును అయిన ప్రకృతి ప్రతిబింబములట్లు సత్యమును రామణీయకమును దాల్చియున్నవి. కృతి పరిమాణమున చిన్నదైయును గుణమున నానాసౌభాగ్య శోభితముగనున్నది. వీని నన్నింటిని ఏఱఁదీసి ప్రదర్శింపవలయునన్న సూత్రమునకన్నను వ్యాఖ్యానము విపులమగును. అట్లు చూపుటచే చదువరుల భావపరిశ్రమ విక్షేపములకు నిరోధముగల్గును. కాన, కొన్నియంశములను పేర్కొని విరమించెదను.

ఇందు గ్రామాంతర నివాసము వ్యవసాయవృత్తి ఇత్యాది ప్రకృతి సామీప్యజీవితమునకును మనుష్య స్వభావ ప్రవృత్తికిని ఉండు సంబంధము చూపఁబడియున్నది. మొత్తముమీఁద పట్నవాసు లంత మంచివారుగారనియు, గ్రామవాసులు నడవడియందు మేలుతరమైన వారనియు కవి యొక్కయభిప్రాయము. ఇది నిర్వివాదము కాదని నామనవి. పట్టణస్థులకు గ్రామస్థులకు చర్యాభేదములు, స్వభావభేదములు లేవనలేముగాని, పోలికలను పెంచి యెక్కువతక్కువలను రూపించుట సాహసకార్యము. దేశాభ్యుదయమునకు పల్లెటులనో పురములును నట్లే యావశ్యకములు. మఱియు ఆర్థిక ప్రపంచమునకు ఆధారము వ్యవసాయమని కవిగారు చూపియున్నారు. ఇదినిజమేగాని తక్కిన వాణిజ్యాది యభ్యుదయములు లేనిచో దేశము సమగ్రత తాల్పనేరదు.

నవ్యపాశ్చాత్యసభ్యత నాగరకత
పల్లెలందు నస్పష్టరూపములఁదాల్చి
కాలసమ్మానితములైన గ్రామపద్ధ
తులను విముఖత్వముం గొంత గలుగఁజేసె.

నేఁటి నాగరకత నీమేలుగోరక
యప్పుచేసి బ్రతుకుమని విధించు
నాయవృద్ధికన్న నావశ్యకపదార్థ
సంఖ్య హెచ్చెఁ జిత్తశాంతియున్నె?

కవికి పరిణామము వలయునో వలదో తెలియకున్నది. కవితా భావములను శాస్త్ర తత్త్వములం బలె తార్కిక దృష్టితో విమర్శింపఁదగదు. వానియందు రసికులు గమనింపవలసిన విషయము సౌందర్యము. ఆ గుణ మీ కావ్యమందు అఖండముగ నున్నది.

అసంబంధములగు వర్ణనలు సంగతు లీ గ్రంథమున లేవు. ప్రతియంశము చిత్తరువున కనుకూలించినదియు అగత్యమైనదియుఁగా నున్నది. సంయోగతాలక్షణ మిందు ఏమాత్రము భంగము చెందకుండుట కవియొక్క భావనాగాంభీర్యమునకు అమోఘమైన సాక్ష్యము. తా వర్ణించు జీవితమును విషయములను తనకు అనుభవ వేద్యములు కాఁబట్టియు, వానియందు తనకు మనసు హృదయ సంపూర్ణముగ లీనమైయుండుటచేతను వర్ణనలన్నియు హృద్యతాగుణపరిశోభితములు. వానియందు సత్యస్ఫురణ, మనోహరత, హృదయాకర్షణాది శక్తులున్నవి. ఇదియ శిల్పముయొక్క పరమార్థము.

పాశ్చాత్యభాషలలో “పా'స్టొరల్సు” నాఁబడు పాశుపాల్యాది

గ్రామాంతర వృత్తులవారి అకృత్రిమ జీవిత స్వభావాదుల వర్ణించు కావ్య
ములనేకము లున్నవి. అయ్యవి గ్రీకులాటిన్ భాషలలో పుట్టి ఆధునిక
ఐరోపా వాఙ్మయముల యందును వ్యాపకమునకు వచ్చియున్నవి. హైంద
వ భాషలలో ఈతరగతికిం జేరిన కావ్యములలో శ్రీకృష్ణుని బాల్యక్రీడలు,
బృందావన జీవితము, గోపగోపికాసంచారములు ఎంతయు హృదయరంజక
ములు. భాగవతమునందలి దశమస్కంధమును, విశేషించి యెఱ్ఱాప్రగ్గడయొ
క్క హరివంశ పూర్వభాగమును దేశీయ వాక్ప్రపంచమున తమస్సునడంచి
చల్లని వెన్నెలను కురిపించి చిత్తానందముచేయు చంద్రబింబములవలె నున్నవి.
జయదేవకృతమైన గీతాగోవిందమును నిట్టిదియ. గోపికలను వదలిన గ్రా
మాంతర జీవిత సులభ్యమనియో, కృష్ణకాంతలకు తదనంతరము గోపికాసం
తతులు నశించిరను భ్రమగొనియో మనకవులు అట్టివర్ణనలను, ఇతరసందర్భ
ముల, ముఖ్యాంశములుగ గైకొని వర్ణించుట మానివేసిరి. ఈనాఁటికి ఆవృ
త్తములు మరల కవితాదృష్టికి నర్హములని భావింపఁబడుట తటస్థమైనది.
ఇట్లెప్పుడో నశియించిన మహోత్తరమైన వృత్తమును పునర్జీవితముం జేసి
దివ్యాకృతిగ మనముందర రామిరెడ్డిగారు నిలిపియుండుట వారి యసాధా
రణప్రజ్ఞను సూచించుచున్నది.

కృషీవలుని జీవితమంతయు పువ్వులపాన్పు గాదని కవిగా రెఱుంగక
పోలేదు. పట్నవాసులకు వారికినుండు ఆర్థికస్పర్ధ, సర్కారువారు వారియె
డల చేయు అనాదరణము, ముఖ్యముగా వారి నావరించియుండెడు అజ్ఞా
నాంధకారమును, దానిచే వారినిపట్టి బాధించెడు దురాచార పిశాచముల
విషయమును రాజకీయ సాంఘికాదినీతులను, సంస్కారముల యావశ్యకతను
సూక్ష్మముగఁ దడవియున్నారు. మింటికెగయు పక్షియైనను భూమిమీద
పెట్టియుండెడి గూటిపై చూపువేయక యుండునా? కాఁపువారియొక్క
దుఃస్థితి యెప్పుడు తొలఁగును? వారిఁకముందైన పూర్వపు రెడ్డిరాజుల స్థా

ల మందువలె ఉన్నతపదవికి రారా? అను విచారములు అసలు సహజములే గద. "కాలగర్భంబునందెట్టి ఘటనగలదో; భావి పరిణామ మెవ్వరు పలుకఁగలరు" ఎవ్వరుపలుకఁగలరో గాని నావలన మాత్రముగాదు. రైతు లెట్టి దారిద్ర్యముపాలైయున్నారు! "కార్యారంభంబును ధైర్యముఁ విడకుమయ్యా" అని కవిగారు సంబోధించుచున్నారు. వీరి మాటల నాలకించి యాదరింతురు గాక. ముఖ్యముగ మా కులమువారికి అతిథి సత్కారము ఒకరు చెప్పక చూపక వచ్చిన సదాచారము. అన్నదానము మా వారివలె చేయువారితరు లున్నారో లేదో. ఎట్లును మించినవారు లేరనుట అతిశయోక్తిగాదు. ఈ విషయమును రామిరెడ్డిగారు ఈ క్రింది విధమున రమ్యముగ నుడివియున్నారు.

ఉండి తిన్నను లేక పస్తున్నఁగాని
యాసచేయవు పరుల కష్టార్జితంబు;
నాఁక లెత్తగ నీపంచ కరగు నతిథి
తినక త్రావక పోయిన దినము లేదు.

కాఁపుటిల్లాండ్రను గూర్చి కవి చేసిన స్తుతులన్నియు సత్యమునకు మీఱినవి కావు; తక్కువ. వారియొక్క "శాంతి నీతియు నురుకష్టసహనశక్తి, నెవరెఱుంగుదురు?" స్త్రీలంగూర్చి వీరొనరించిన ప్రశంస యెంతయు సత్యము; గంభీరమును.

అతుల సంసారసాగరమందుఁ గాల
జలము సుకృతదుష్కృతవాత చలితమగుచు
సుఖవిషాదపుఁ దరఁగలై సుడియుచుండ
పడవవై గట్టుఁజేర్తువు పతిని, గృహిణి!

సంగ్రహించి వ్రాయుశక్తియందు ఈ కవిని మించినవారుండరు గాఁబోలు. ఈ గ్రంథమును జదువఁ జదువ ఏరీతిని నిన్ని యంశములను నిన్ని కొద్దిపుటల లో నిక్షేపించినాఁడు అను ఆశ్చర్యముఁ దాల్పని వారుండరు. పునరుక్తి, నిరర్థకవృత్తి, యిత్యాది కాలవ్యయమును స్థలవ్యయమును చేకూర్చుపద్ధతులు లేవు. తన కులస్థులయట్లె యీకవియు మితభాషి. అర్థము ఎక్కువ పదములు తక్కువ అను శ్లాఘనకు పాత్రుఁడు.

మనుచరిత్ర కళాపూర్ణోదయాదులలోని పద్యముల ననుకరించిన తలపోతలు వ్రాతలు ఒకటి రెండు చోటుల నున్నట్లు తోఁచెడిని. ఇది దోషముగాదు. ప్రమాదము కావచ్చును. వీరి యాధార్థ్యవర్ణనాశక్తిని చూపించుటకై కొన్ని పద్యముల నుదహరించుచున్నాను.

లయవిభాతి.

చలువగల కప్పురము చిలికినటు చల్లనయి,
లలిత కలధౌత మృదు విలసనము పోలెన్
మొలక లిడు వెన్నెలల చెలువము దిగంతముల
కలముకొని తారకల తళుకులను గప్పన్
గలువపొడి గందపొడి దొలఁక సుడిరేఁగుచును
మెలఁగు నెల పయ్యరలు నలసతఁ జరింపం,
దలఁపున రసార్ద్రమగు వలపు లిగురింప దిన
కలకల మడంచి నిశ గొలిపెఁ బ్రమదంబున్.

స్నానమొనరించి వెన్నెల చలువ బయల
బిడ్డలున్నవు నిల్లాలుఁ బ్రీతిఁ గుడిచి,
పొడుపు కతలు, సమస్యలుఁ, బూర్వచరిత
లంత వచియింపు వాగలు సంతసింప.

శ్రమ, విషాదమ్ము, లాసలు, సర్వకాల
హృదయ భేదక చింతలు, నిదుర యనెడు
శాంతవారిధి లీనమై సమసిపోవ
విశ్రమింపుము సైరికా వేగువఱకు.

నేనును విశ్రమించెదను. వేగుచుక్కగాదు. పతి రామిరెడ్డిగారు ఇంకొక గ్రంథము వ్రాయుచున్నారు. వ్రాసినతోడనే పఠనమునకుం దొడంగెద.

ఇట్లు

కట్టమంచి రామలింగారెడ్డి.



# కృషీవలుఁడు

సమయమమూల్య, మొక్క నిమిషంబు వృథాచనఁ గ్రహింపనే
రము; మనయాయువా త్రుటిపరంపరయాట నెఱింగి, నిద్రమాం
ద్యమునుదొలంగి మీపనుల నారయుఁడో జనులారయంచు డం
బముగ మెడ న్నిగిడ్చి కృకవాకము గూసెడి నింటికొప్పునన్.1
వడఁకుచుఁబాడు మేల్కొలుపుపాటకు రాటము ఝుమ్ముమాచుఁజే
సెడి మధురారవంబు శ్రుతిచెల్వువహింపఁగ, రాజనూఁది ముం
గడ నిడుకొన్న కుంపటిసెగన్ సొగియించుచు నమ్మలక్క లో
క్కడగుమిగూడినూల్వడకునిత్తఱిఁదోఁచెను రెడ్డిచుక్కయున్.

అత్తల యాఁడుబిడ్డల భయం బొకవంకయుఁ గోర్కె వేఱెడం
జిత్తములాఁగఁ గ్రొవ్విదయుఁ జీరయు వే సవరించి తూఁగుమై
మత్తున నున్నవల్లభుని మంచము మెల్లన వీడి దీనయై
చిత్తరికోడ లిల్వెడలె వేకువఁ బ్రాఁచిపను ల్వొనర్పఁగన్. 3

రచ్చ చపారమందు నిడి రాతిరిఁ బుచ్చిన బాటసారులుం
జిచ్చు:రగిల్చి మంటలకుఁ జేతులు చాఁపుచుఁ గూరుచుండి వా
రిచ్చకు వచ్చినట్టి కతలెల్ల వచించుచుఁ దెల్లవాఱఁగా
వచ్చిన మూటముల్లె గొను పైనపుసందడి సేఁగె గొల్లునన్. 4

'అమ్మో,తూరుపుదెల్లవాఱె,నిఁకలెమ్మా' యంచనన్ మూల్గి మం
చమ్మున్ డిగ్గక, బుజ్జగించినను, 'పో చాల్చాలు, వేనీళ్ళు లే
కెమ్మైనేఁ బలుదోముకొందుఁ జలిలో, నింతాగడంబా?' యటం
చమ్మం గూఁతురు కోపగించుకొనుఁగన్యాత్వంపు గారామునన్

ఉషయనెడు కాఁపుటిల్లాలు హొన్ను రాజ
నముల వరియెన్నగంప గేహమున దింప
సంబరంబున నెగురుచు సరసఁజేరు
పిల్లలనఁ బుల్గుతుటుములు వింటికెగసె. 6

అరుణమయూఖముల్ తరులతాంతరమార్గము దూరి గేహగో
పురములఁ బ్రాఁకు ప్రొద్దువొడుపుం దరుణంబున నీటికోసమై
సరసులకేఁగు కాఁపునెఱజాణల నూపుర మంజులార్భటుల్
నెఱసెఁ బ్రభాతమన్ శిశువునేర్చెడి ముద్దులమాటలో యనన్.

ఇరువులఁ జూరులందుఁ జరియించి తమోహరణైక దక్ష భా
స్కర కిరణాళి నీమృదులశయ్య సువర్ణమయంబు చేసె ని
ద్దుర నిఁకనైనమాని వెలిదోలుము బీళ్ళకు నాలమంద, ని
త్తఱిఁ దమిదీఱ మేయుఁ బులుదంటులుఁ గమ్మనిమంచుపచ్చికల్

ఓయిహాలిక, యెంత ప్రొద్దాయెఁ జూడు
మింత నిదురేల? పాలకై గొంతురాయ
లేఁగ యాదూడ పలుపును లాఁగికొనుచు
నఱచుచున్నది యంభయంభా యటంచు. 9

పొదుగు నిండుగఁ బాల్చేపి గుదులు త్రెంపి
దూడకై దొడ్డిగోడ రాపాడి దాఁటెఁ
దఱిపి పెయ్య; యింకేల మాంద్యమునఁ బొదల?
లెమ్మునిద్దుర; పాల్దీయఁ దెమ్ము చెంబు. 10

బిఱ్ఱుకడుపుగ నన్నంబుఁ బెరుఁగుఁ గుడిచి
దొడ్డి వెడలించుచున్నాఁడు గిడ్డిగములఁ
దమ్ముఁగుఱ్ఱఁడు; లేదూడ లమ్మలకును
బరుగు లిడనీక కట్టము పలుపువెట్టె. 11

చెమరు ముత్యాలు చెక్కిళ్ళఁ జెదరిజాఱ
ముగ్ధచన్నులు పయ్యెద ముగిపెమాడఁ,
గాజునీలాలు మధుర నిక్వణము లొలయ
దధి మథించెడు కాంత గీతములు వినవో? 12

ఉయ్యెల నిద్రలేచి తనయుం డెదుటన్ జనయిత్రిఁ గాంచకే
కుయ్యిడు చున్నవాఁడు కులుకుంగనుదమ్ముల బాష్పబిందు లో
య్యెయ్యనఁ జిందువాఱ, సతియు న్నికటంబున లేదు, లేచి య
బ్బయ్యను నెత్తి మేనుపులకాంకితమౌనటు ముద్దు వెట్టుమా.

చలికప్పుగప్పి విచ్చులవిడి లేయొడఁ
గ్రాఁగు ముద్దులకాఁతుఁ గౌఁగిలించి,
పునికి దోఁగాడుచు బొమ్మలతో నాడు
పసిబిడ్డమోము చుంబనముచేసి,
మొగతాలి సరసాల నిల్లాలు పలుకుచు
నవ్వినందుకు మాఱునవ్వు నవ్వి,
పనివాండ్రు వచ్చియుండిరఁ దండ్రియేమను
నో యను శంక లో నారసికొనఁగఁ

జలిది కడుపారఁ గుడిచి యెద్దులను దోలి
కొనుచు మడి కేఁగుచున్నారు, గనుము! యొరులు
వారు నీతోడివారలు గారె? రెడ్డి
యువకు లెచ్చటఁ గొఱగాకయుందురయ్య? 14

మనసుఁ జేసికొన్న నవమానమె? పాఁచిపను లొనర్చుచున్
వనిత యతిప్రయాసమునఁ బర్వులిడం గనుఁగోవె? కావడిం
గొని సరసీజలంబులను గోపము సేయక తెచ్చియిచ్చి కాం
తను బరితోషపెట్టుము; వృథాచన వెప్పుడు నట్టిసాయముల్.

సోమరిపోతవై జనకు సూక్తు లలక్ష్యముచేసి కొంటెపో
రాములఁ బ్రొద్దుపుచ్చకు, నిరర్థకభూములనైనఁ జెమ్మటన్
శ్యామల సస్యవంతముగ సల్పెడు కాఁపులు నోగులైన నిం
కో మెడువార లెవ్వరు జనోత్కరమున్ సరసాన్నదాతలై? 16

అరుణకిరణుఁడు తూర్పున నవతరింపఁ
బ్రాణిలోకంబు మాంద్యమ్ముఁ బాసె; నింక
నింటనుండుట మర్యాదయే కుమార?
చలిదిచిక్కంబు గట్టుము పొలముఁ జేర. 17

అప్పుడప్పుడె విచ్చి యలరు చేమంతుల
కమ్మని నెత్తావి గడలుకొనఁగ,
రత్నకంబళ మట్లు రాణించు బీళులఁ
బలువన్నెపూవులు బలిసి విరియ,
వ్రాలఁబండిన రాజనాల కేదారంబు
పంటలక్ష్మికి నాటపట్టుగాఁగ,
ప్రొద్దునిగ్గులు సోఁకి పొగమంచు మబ్బులు
బంగారు వలిపంబు పగిది వ్రేల,

ఈ నిమేషమందు నిల యెల్ల నందమై
స్వర్గ్యశిల్పి యింద్రజాల శక్తి
వ్రాసినట్టి చిత్రపటమున విలసిల్లెఁ;
దొంగిచూడు మిపుడు తూర్పుదిక్కు! 18

వేకువనె లేచి వైకుంఠవాకిళులను
ముంగిట రచించి గుమ్మడిపూలతోడ
గొబ్బిముద్దల నిలిపి కుంకుమను జల్లె
నీ యనుంగుకూఁతురు! గాంచుమోయి సొబగు.19

గనిమల తుంగకున్ గఱికకాడల కల్లిన సాలెగూళ్ళ స
న్నని పటికంపుమంచు పడి నాణెపు ముత్తెసరాల పోలికం
గనుఁగొన రమ్యమయ్యె రవికాంతులఁ దేలుచు, నిట్టి భావమో
హనపు నిసర్గశిల్పముల, హాలిక, త్రొక్కక దాఁటిపొమ్మిఁకన్

పొలముల కేఁగు పల్లెతలు పుత్తడిగాజులు ఘల్లుమంచు రా
పిలి యులివెత్తఁగం జిటికెవేయుచు నిన్గని యేలపాటలం
జెలువుగఁ బాడ నుప్పతిలు సిగ్గున నూరకపోక మాఱుపా
టల నెలుఁగెత్తి పాడుము, మిటారుల నవ్వుల కాస్పదంబుగన్.

గ్రామవాసుల కిట్టి నిష్కైతవంపు
ముగ్ధపరితోషములు సుఖభోగ్యములగుఁ;
బట్టణ నివాసకుల శుష్కభావములను
నిట్టి సామాజికానంద మెసఁగఁగలదె? 22

ఓయి రెడ్డియువక, యూరక యుందందుఁ
దిరుగ నేమి ఫలము? తిండిచేటు!
తండ్రి కోఁతమడుల దగ్గఱఁ బనిసేయు,
నన్నమునకు నింటి కనుపుమయ్య. 23

వ్రాలిన కొప్పులోపలి పూలరేకులు
సడలి యొక్కొక్కటి జాఱుచుండఁ,
బరువంపు రొమ్ములపైఁ బయ్యెదచినుగుల్లు
గాలికి నట్టిట్టుఁ గదలియాడ,
నెలుగెత్తి పాడెడి యేలలు విని బాట
సారు లెక్కసకెము సలుపుచుండఁ,
దమ్ములపుం బూఁత దవిలిన వాతెఱ
పైఁ బలుచాలు నవ్వొకయె నవ్వఁ,
జేతికొడవలి ఝుళుపుచుఁ జిన్నెలాఁడి
కన్నెమాలెత పిడిచుట్టి మున్నమున్న
మునువు తఱిగెడి; నింటికిఁ బోవువేళ
సందెఁడోదె యీలేవె కర్షకకుమార? 24

ఆఁకటి చిచ్చుబాధ సగమైన యొడళ్లును నంటు డొక్కలుం
జీఁకటిచూపులున్ మొలకు జేనెడుపేలిక గల్గి జీవితం
బే కడగండ్లుగాఁ, బగగ యేరెడి బీదల వెళ్ళఁగొట్టి చీ
కాకొనరింపఁబోకు; వెలిగాదల యాఁకటిమంట నీకునున్. 25

పసిఁడిపూసల పేరుల పగిది దోర
పక్కముగఁ బండి నేలకు వ్రాలు కంకి
గుత్తులఁ బిచుకతిండికిఁ దెత్తుననుచు
నింతికిం జెప్పి మఱచితే యింతలోన? 26

పడఁతి యొంటికత్తె; పనిపాటు సేయను
నిడుగు దోడుగులకును నెవరు లేరు;
చంటిబిడ్డ యొకఁడు, సంసారభారంబు
పీల్చి పిప్పిసేయు బీదరాలి. 27

చెలియా, యిత్తఱి నిన్నుఁ గన్గొనిన నాచిత్తంబు తాపార్తమై
కలఁగుం, గష్టకుటుంబకార్యముల నెక్కాలంబు నిర్మగ్నవై
మెలఁగంజూతువు మంచిచీర రవికెల్ మేలౌనలంకారముల్
దలఁపంబోవు, తలైన దువ్వ; విఁక లేదా మేర నీపాటుకున్?

మున్నూటరువది దినముల
నెన్నండును గన నశక్య మేపనియును లే
కున్న నిమేషము; కాఁపుం
గన్నియ, నీ కాటవిడుపుకాలము లేదే? 29

నిత్యకృత్యములం దొక్క నిమిషమైన
దొంగిలింపుము కై సేయఁ దోయజాక్షి,
యఖిలకామినీ సామాన్యమౌ ప్రసాద
న ప్రియత్వము నీయందు ననలుకొనదొ? 30

స్వాంతమున నీకు రామణీయక పిపాస
యంతరించె నటంచు నే నన ను గాంత,
కాని, మొడలేని సంసార కష్టములకు
స్త్రీప్రకృతి బలివెట్టుట చెల్లదమ్మ. 31

త్యాగమునకైన నొకహద్దు దగును
శలభ మట్టుల నాత్మనాశనము మేలె?
పొలఁతికి సతీత్వ సౌందర్యములును రెండుఁ
బ్రార్థనీయ వరంబులై పరఁగుఁగాదె! 32

అతివ, నాయూరడింపుల యుండె దవిలి
చిన్నకూఁతురి సంపపు జొన్నమడికిఁ,
బావురంబులుఁ జిల్కలు పాలకంకి
విఱచుకొని యాకసంబున వెడలెఁ జూడు! 33

పడెనటఁ జిల్క లన్నమిషఁ బైట దొలంగినఁ జూచిచూడకే
యొడిసెల ఱాయిఁబెట్టి పొలమోరలఁ బోయెడి బాటసారిపైఁ
బడఁ దెగ రువ్వెదేల మగువా, యిటులం బడుచుందనాల తుం
డుడుకుఁదనంబు నీయెడఁదఁ దొందర వెట్టెనె? నైజమేగదా!

‘ఐన నయ్యెఁగాని, యాఁకలి బలుదొడ్డ,
రెండు కంకు లిమ్ము రెడ్డిపడుచ,
పొద్దువోవు మాదు పొలిమేరఁ జేరను,
బాట నడచి నడచి బడలె మేను.’ 35

అని కడువేడు పాంథులకు నచ్చటఁ జేతికినందు కంకులం
దినుఁడని చెప్పి మంచెపయిఁ దియ్యనిరాగముదీయు ప్రాయపుం
గొంబునమిటారి, నీ మనసుకుందు నెఱుంగదుగాని, యింటిలో
ననయము లేమిడిక్క సయిచు నమ్మ వెతల్ దలపోయ వేలొకో?

చిన్నప్రాయమందె చీడపుర్వును దెచ్చి
నీమహృదయకళిక నిలుపఁదగము;
పచ్చపైరుచేల బాంధవ్యమునఁ జేసి
పెరిగినావు ప్రకృతిబిడ్డ వోలె. 37

పూలకారుగాలి పొలముపై వీతెంచె
వలపు మొలచి యొడలు పులకరింప,
మనసుకోఁతలెల్ల మానిపోఁ గోయిలఁ
గూడి పాడు మొక్క క్రొత్తపాట. 38

పైరుంబచ్చలు లేని లోపమును బాపంబోలెఁ గ్రొంబూలసిం
గారంబుం గయిసేసి లేఁజివురులం గాంతిల్లె వల్లీతతుల్,
దారింబోయెడు బిచ్చకత్తెయయినం దావుల్ గుబాళింపఁగం
బూరేకుల్ చికురంబులం దురిమి సొంపుంబెంపుఁ బాటించెడిన్

కనుమ, యాబిచ్చకత్తెకుఁ గలసుఖంబు
నందు సగపాలు లేదు నీయాలి కకట!
పవలు నిద్రించెదే కాఁపుపడుచువాఁడ,
పొలఁతి నిట్టూర్పు నీయెద పొగిలిపోదా? 40

కాఁపులెల్లరు నాగళ్ళు గట్టి కోడ
యడుగు దున్నెద రిపుడు; నీ వదనెఱుఁగవా?
యాలసింపక యెడ్లఁ గయ్యలను దోలు
మోయి, యెండలు ముదిరి పెల్లుక్కవెట్టె. 41

శ్రమలు లేకయె ఫలములు దుముకఁబోవు,
పిండికొలఁదియె రొట్టె; యోపిన విధానఁ
గష్టపడుము కృషీవలా, గలుగు సుఖము.
ఉత్తయాసల కన్న మే లుద్యమంబు. 42

అర్కబింబము మధ్యందినాతపంబు
గాయుచున్నది మేనెల్లఁ గమలిపోవ;
నురుగుఁ గ్రక్కుచు నూర్చుచు నోరు దెఱచి
యొక్కయెడగైనఁ బెట్టవు దుక్కియెడ్లు. 43

ఖరకరతాపతప్తములు కాయము ఘర్మకణాళి నీనుచున్
జారిగెడి సత్త్వహీనముగఁ, జూపులు దీనములయ్యెఁ బ్రొద్దునం
బొరసినమోము తేటలెటువోయెనొ! దప్పియు హెచ్చెనోయి, యు
త్తఱిఁదరుమూలశాయివయి తాపమువాయుము చల్లనీడలన్.

కరముఁ గష్టించు నిను గాంచి కనికరమున
నెండవేడిమిఁ దొలఁగించు నిచ్చతోడ
వారిదం బాతపత్రమై వచ్చెఁగాని,
మారుతాహతి శిథిలమై మరలె నదియు. 45

తరువులఁ గోటరంబులకుఁ దారెను బక్షికులంబు, బఱ్ఱెలున్
సరసులఁ జొచ్చె రోజుచుఁ, గనంబడ రెవ్వరు దారులందు, నీ
సరణి సచేతనప్రకృతి చల్లదనంబున కాసచేయ మే
నెరియఁగ నీవుమాత్ర మిటులేల శ్రమించెద వెఱ్ఱియెండలన్?

బాటల వేడిదుమ్ములకుఁ బాదములం జిఱుబొబ్బలెత్తఁ గ్రి
యాటగఁ జెమ్మటల్ మొగమునుండి దొరంగఁగఁ గూటిదుత్తతోఁ
పాటలగంధి వచ్చెడిని, బాపము! వేగమ నీట మున్గి య
చ్చోటనె మజ్జిగన్నము రుచుల్ వచియింపుచు నారగింపుమీ!

తరుణీ, ధూళులఁ గాళ్లుగాలెనని సంతాపంబునం గాంతునిం
జిఱుముట్రాడక, గేహనిర్వహణమున్ సేద్యంబు సాగంగ ని
ద్దఱుఁ గష్టింపఁ గుటుంబరక్షణము సాధ్యంబౌను; భిన్నాధ్వసం
చరణాసక్త హయద్వయంబు రథమున్ సొంతంబుగా లాఁగునే?

శ్రమ కుచితంబుగా ఫలము సంధిలదోయని చింతవొందకో
రమణి, నిదాఘతాపము దొలంగెడు నంతకు మఱ్ఱియూడజొం
పముల యుయ్యాలలూఁగి పదమాత్రిన నీటికిఁబొమ్ము, పాలకై
కుములుచు నేడ్చునేమొ యనుఁగుం బసిపాపఁడు నిద్రలేచుచున్

దారిఁ జరించుచున్నపుడు దగ్గఱనున్న తటాకమందు నిం
పారు సరోజముల్ గొని గృహంబునకుం జనుదెమ్ము, బాలకుం
డారమణీయ పుష్పముల నచ్చెరువొందుచుఁ గాంచి యాడుకోఁ
దీక్షిక వంటయింటి పని దీర్చుమ కాంతుఁడు వచ్చునంతకున్.

పూవుందేనియ లారగించి మధుప వ్యూహమ్ము కర్ణప్రియం
బై వర్ధిల్లు మనోజ్ఞగీతముల రాగాలాపముం జేయఁగా
నీవేలా కలఝుంకృతిన్ స్వరము లెంతే నైక్యముంబొందఁ గాం
తా, వాకోవాక పల్లెటూరి పదమైనం జిత్తముప్పొంగఁగన్.

సిరిగల యాఁడుబిడ్డలు విచిత్రపుశాలువగల్ ధరించి బం
గరుసరిగంచు చీరలను గట్టి చరింపఁగఁ గాంచి యాస లోఁ
బొరయకు కృత్రిమంబులగు భూషలుదాల్పు; నమూల్యరత్నమా
సరసపుఁ బ్రేమ చిత్తజలజంబు వెలుంగ నలంకరింపుమీ. 52

వెలగల రత్నభూషలను వేలకుఁదాల్చిన నిన్నుఁగాంచు చోఁ
గలుగదు ప్రేమ భర్తకు వికస్వరమౌ వదనారవిందముం
దొలికెడు ముద్దులేనగవు లొక్కనిమేషము దోఁపకున్న; భూ
షలు ప్రణయానుబంధ సదృశమ్ములు గావు కులాంగనాళికిన్

అతుల సంసారసాగర మందుఁ గాల
జలము సుకృత దుష్కృత వాతచలిత మగుచు
సుఖవిషాదపుఁ దరఁగలై సుడియుచుండఁ
బడవవై గట్టుచేర్తువు పతిని గృహిణి! 54

ఈయెడ నాతపంబు శమియించెను, నీడయుఁ దూర్పుదిక్కుకుం
బోయెడు భర్తతో నలిగి పొందెడయుం జను జాయపోలికన్
వాయువు సుప్రసన్నమయి పైఁబయి వీచెడు లేచిరమ్మ, లే
దోయి విలంబనం బనెడి యుక్తి కృషీవలవాఙ్మయంబునన్.

మనుజసమాజనిర్మితి సమంబుగ నీకొక ముఖ్యమైన వృ
త్తి నియత, మట్టి ధార్మికవిధిం జిరకాలము గౌరవంబుతో
మనిచిరి నీపితామహు లమాంద్య సుశీలురు సర్వవృత్తిపా
వన కృషిజీవనైక పరిపాలన లోకహితార్థకాంక్షులై. 56

అనుదిన మిట్లు కష్టపడ నావిధి వ్రాసె నటంచు నీమదిం
బనవకు కర్షకుండ, యిలపై జనియించినదాది చెమ్మటల్
దొనక శ్రమించి పౌరుషముతో బ్రతికించెదు నీకుటుంబముం,
మనమునఁ గైతవాశయము మందున కైనను లేదు నీయెడన్.

నేలనూతుల కుగ్గాలు నిలుపువారు,
బోడితలకు మోకాళ్ళకు ముడులు వెట్టు
వారుఁ, జటికెలఁ బందిళ్లు పన్నువారు
నిన్నుఁ బోలరు, తమ్ముఁడా, యెన్నఁడైన. 58

పలుపులుపట్టెమంచములుఁ బట్టుతలాడలు నంబరంబులుం [నన్
గరులుఁదురంగముల్ ప్రియయుఁగాంచనముం మఱియేమియుండి
ధర సకలంబు సొంతమయినం దనివోదు మనుష్యతృష్ణ, త
త్పరిచితులైన వారి నెడఁబాయదె తృప్తి నిసర్గశత్రుతన్. 59

అన్నా హాలిక, నీదుజీవితము నెయ్యంబార వర్ణింప మే
కొన్న న్నిర్ఝరసారవేగమున వాక్పూరంబు మాధుర్య సం
పన్నంబై ప్రవహించుఁగాని యితరుల్ భగ్నాశులై యీర్ష్యతో
నన్నుం గర్షకపక్షపాతియని నిందావాక్యము ల్వల్కరే! 60

వనలతమైన నాకవిత పత్రపుటంబులఁ బూవురెమ్మలన్
దినదిన జృంభమాణయయి తేజరిలెన్ సహజప్రరోహ వ
ర్ధననియమానుసారముగఁ; దల్లత యెన్నఁడుఁ దోఁటమాలిపా
ణిని గనుఁగోని వన్యరమణీయతఁ జిల్కు నపూర్వపద్ధతిన్. 61

పంజరనిబద్ధకీరంబు బయలు గాంచి
యడ్డుకమ్ముల దాఁటంగ నాసచేయు
నటు, బహిర్ణియమంబుల నతకరించి
మన్మనంబు స్వాతంత్ర్యసీమకుఁ జరించు 62

కాన, యెవ రేమి యనుకొన్న దాన నేమి
గలుగుఁ? గాల మనంతము; ఇల విశాల;
భావలోకము క్రమముగాఁ బడయు మార్పు
ఏల హృదయంబు వెలిపుచ్చ నింతయళుకు? 63

సైరికా, నీవు భారతక్ష్మాతలాత్మ
గౌరవ పవిత్రమూర్తివి! శూరమణివి!
ధారుణీపతి పాలనదండ మెపుడు
నీ హలంబు కన్నను బ్రార్థనీయమగునె? 64

దైనికావశ్యకమ్ముల దాఁటిపోవ
వెగుర ఱెక్కలురాని నీయిచ్చలెపుడుఁ;
బైరుపచ్చలె యవధిగాఁ బ్రాఁకుచుండు
నీవిచారము, నూహయు, నిపుణతయును. 65

పొద్దువొడిచిన దాదిగాఁ బొద్దుగ్రుంకు
వఱకుఁ గష్టింతువేగాని యిరుగుపొరుగు
వారి సంపదకై యీసుఁ గూరఁబోవ
వెంత నిర్మలమోయి, నీహృదయకళిక! 66

పల్లె యెల్లయె సర్వప్రపంచసీమ!
ప్రియ యొకర్తయె రమణీయ విగ్రహంబు!
బంగరుం బంటపొలములే భాగ్యనిధులు!
అనుదిన పరిశ్రమమె మత మగును నీకు. 67

ఉండి తిన్నను లేక పస్తున్నఁగాని
యాసచేయవు పరుల కష్టార్జితంబు!
నాఁకలెత్తఁగ నీపంచ కరుగు నతిథి
తినక, త్రావక, పోయిన దినములేదు. 68

కృషి సకల పరిశ్రమములకుఁ గీలుచీల;
సత్పరిశ్రమ వాణిజ్యసాధనంబు;
అఖిల వాణిజ్యములు సిరికాటపట్లు;
సిరియె భోగోపలబ్ధికి జీవగఱ్ఱ. 69

కావునఁ గృషీవలా, నీవె కారణమవు
సాంఘికోత్కృష్ట సౌభాగ్య సౌఖ్యములకు;
ఫల మనుభవించువారలు పరులు; నీకుఁ
గట్టఁగుడువను గఱవె యెక్కాలమందు!

ఫలము లెక్కెక్కడివారు తత్ఫల రసాస్వాదకౌతూహలులై
పలుమా అమ్మధురత్వము న్నుతుల సంభావింతు రేగాని, త
త్ఫల హేతుక్రమవృక్షముం దలఁప రెవ్వారైన, నట్లే రమా
కలితు లోభగముల్ భుజించుచు నినుం గన్నెత్తియుం జూతురే?

అట్టి కృతఘ్నులన్ మనమునందుఁ దలంపక సేద్యనాద్యపున్
ఘట్టన నస్థిపంజరముగాఁ దను వెండినఁగాని, వర్షముల్
పట్టినఁగాని, క్షామములు వచ్చినఁగాని శరీరసత్వమే
పట్టుగ స్వశ్రమార్జితము పట్టెఁడు నన్నముఁ దిందు వెప్పుడున్!

రాజకీయ ప్రపంచ సామ్రాజ్యమందు
శౌర్యఖడ్గంబులకు లేదు శాసనంబు;
సంఘరాజ్యంబు నేలు విస్తారశక్తి
సతము నాచార ఘోర పిశాచరాజు. 73

శౌర్యమునకును నాచార చక్రమునకు
మధ్య, లోకంబు దవిలి సమ్మథితమగును;
కాలగర్భంబునం దెట్టి ఘటనగలదొ
పూర్వ పద్ధతి విప్లవ స్ఫురణఁగొలుప! 74

కల్యకాంతికి మున్నంధకార రాత్రి,
వర్షపాతంబునకు మున్ను వారిదముల
ఢమఢమాడంబరంబులు నమరు; నిదియుఁ
బ్రకృతి భావంబునకు నూత్నపథము గాదు. 75

కష్టసుఖముల నీచోచ్చ గతులు గలవు
చక్రదండంబులకుఁబోలె; సమయమందు
నిట్టిమార్పు లనంతమై యొసఁగుచుండు
భావి పరిణామ మెవ్వరు పలుకఁగలరు? 76

ఓకృషీవల! నీవు కష్టోత్కటంపు
దుర్భరావస్థ యందె తోఁదోపువడఁగ
నెవరు శాసించువారు, నీకేమికొదువ?
ఆత్మవిజ్ఞానమయముగా నలవరింపు. 77

దారిద్ర్యింబను పెల్లుటేటి కెదురై దాఁటం బ్రయత్నించుచుం
బూరావేగమునం జలించి వెనుత్రోపులోవవు కాంక్షోదుకం
జేరా పొందక నెట్టు తెడ్డగు మనస్స్వేచ్ఛాప్రకారంబుఁ గా
ర్యారంభంబును ధైర్యము న్విడకుమయ్యా, నీవు వేయింటికిన్.

రార సైరిక, కనుఁగొమ్ము రమ్యమైన
సస్యకేదార ఖండంబు! సత్కవీశ
భావలోచన మెరవుగాఁ బడయకున్నఁ
గాంచనేర వంతర్లీన కాంతిసరణి. 79

అనిలాలోలవినీలసస్యములు భంగానీకముల్గాఁగఁ దె
ల్లని కొంగ ల్పయిఁడేలు నురువులుగ లీలన్ జెక్కలల్లార్ప, మ
ధ్యను రాజిల్లు కుజంబు లోడలుగ వాతస్ఫూర్తిఁగంపింప, స
స్య నికాయావని సాగరం బటుల నేత్రానందముం కూర్చెడిన్.
కుసుమ లతావలీ వలిత కుంజములం, గిసల ప్రకాండముల్
పసరులు గ్రక్కు వృక్షముల బాలతృణంబులఁ జేలగట్లు సొం
పెసఁగ, సమస్తరత్నముల నేరిచి కూర్చిన తాలబిళ్ళలన్
వసుధ కమర్చిరో కృషికవర్యు లనన్ వరిమళ్ళు శోభిలున్.

మరకత చూర్ణవర్ణముల మాడిత మా నవశాలిభూమి సుం
దరతను గాంచ వైదిక దినంబులలో భరతక్షమాధురం
ధరయగు సస్యలక్ష్మి దయదప్పక నేఁటికి నార్యధారుణీ
భరణ కుతూహలస్ఫురణ భాసిలునో యననొప్పు హాలికా.

కడమొదలు లేని నీదేహకష్టములకుఁ
బ్రతిఫలంబగు సస్యసంపత్తి గాంచి
కవివి గాకున్న వాగ్మిత గలుగకున్నఁ
బ్రణుతి వర్ణింపు మొకసారి భాగ్యగరిమ! 83

ఆకాశంబున మేఘమాలికల రూపైనం గనన్ రాదు, శు
ష్కాకారంబులఁ బైరులెల్ల సుకుమై యల్లాడెఁ, దీవ్రంబుగా
సోఁకెన్ సూర్యమయూఖతాప, మిఁక నేజోకన్ ఫలించున్ వరుల్
మాకీకష్టము వెట్టెదైవమని యేలా మాటికిం జింతిలన్? 84

కఱకుగ నెండగాయ నిఁకఁ గాలముతప్పె ననంగ నేల? భా
స్కర కిరణాళిలోఁ గలదు సస్యసముద్ధరణైకశక్తి; త
త్కిరణము లబ్ధివారి హంబుకింగొని యావిరిరూపునన్, నభోం
తరమున మార్చు నీరద వితానముగాఁగఁ బునఃప్రవృష్టికిన్.

అల వర్షాగమలక్ష్మి రేఖ యన దివ్యానేక వర్ణంబులం
బొలుపుంబొందు నవాబ్దమాల యదిగో భూభృచ్ఛిరోలంకృతిం
దలపించుం గనుఁగొమ్మ, వాయునిహతిం దద్దేశముం బాసి కొం
గలబారుల్ వెనువెంట నంట శకలాకారంబులన్ వచ్చెడిన్.

బావికి నీటికై యరుగు పల్లెత లంబుధరంబు గాంచి య
ప్పా! వినువీథి హాలికులపాలిటి దైవమె యంబుదాకృతిన్
భావిఫలోదయప్రకటభావమునం జనుదెంచె నంచు మో
దావృత చిత్తలై సరసమాడుచుఁ బోయెదరో కృషీవలా. 87

పొలమునఁ గంచెగా మొలిచి పువ్వులుపూచెడు కేతకంబు లు
జ్జ్వల కుసుమోపహారములఁ బత్రపుటంబుల నుంచి మారుతా
చలితకిసాలయోచ్ఛలన చాతురిఁ బిల్చెడుఁ, జేరఁబోయి త
త్కళికఁ బరిగ్రహించి కులకాంతకుఁ గానుకయిమ్ము తమ్ముఁడా.

ప్రావృడంభోదలక్ష్మి యావాసమునకుఁ
బాఱఁగట్టిన నవరత్న తోరణంబు
నాఁగఁగోమల శబల వర్ణములతోడ
నింద్రచాపంబు శోభిల్లె నదిగొ చూడు. 89

వానతూనీఁగ లాకాశ పథమునందు
మధుర ఝుంకార రవములు మొదలించెఁ;
జల్లగాలికి నురుగప్ప లెల్ల మడుల
బెకబెక మటంచుఁ గూసెడి వికటరుతుల. 90

తటములకు నాకసమున కంతరము లేక
నీలనీరదమాలలు వ్రేలుచుంట
నేలపై మిన్ను పడనీక నిలుపుచుండు
స్తంభము లనంగ గిరులు దృశ్యంబులయ్యె. 91

తపనుఁ డంబుదాచ్ఛాదన తతులలోన
మరుగువడిపోవఁ గని నీలగిరుల చల్లఁ
దనము భువి నాక్రమించిన యనువుగాఁగ
వాయుమండల మీమిరి పట్టియుండె. 92

తెల్లపట్టు మస్లీనుల తెరలలోన
నాడుకొనుచుండు పసిపాప యరువు దోఁప
వానముత్యాలు గూర్చిన వలల తెరల
దినరమామణి మృదుకాంతిఁ దిరుగుచుండె.

త్రావ నీరైన దొరకని తరుణమందు
నిమిషమాత్రాన దొరువులు నిండిపోవె!
నఖిలలో కాశ్రయుండు కృపామృతుండు
కన్ను దెఱచిన జరుగని కార్య మున్నె? 93

జల్లు పెల్లుడుగంగఁ బిల్లలు, తల్లులు
　　నిలువఁబట్టిన నింట నిలువఁబోక,
వాననీరులు వాఱు పల్లపు టిసుకలఁ
　　గయ్యగాఁ గట్టలు గట్టి చిన్న
నాగళులం బన్ని లేఁగదూడలఁ గట్టి
　　దున్నుచు విత్తులు మన్ను గలిపి
పచ్చయాకులు చల్లి పైరుపట్టె నటంచుఁ
　　గలుపుఁ దీయుచుఁ గోఁతకాల మనుచు

వరులు గోయుట నటించి పనలుగట్టి
కుప్పవేయుటగా మన్ను కుప్ప వెట్టి
కడకు నేల చదునుగాఁగఁ గాలఁ దన్ని
యాఁకలెత్తిన నిండ్లకు నరుగుచుండ్రు. 95

జడివానన్ వలిబడ్డ బక్క మొదవుల్ సంఘంబులై బీళులన్
విడియన్ బ్రాఁకుచు దొడ్డిఁజేర నవిగో వేగంబుగ న్వచ్చెఁ; బె
ల్లడుసుల్వోవని మిట్ట నేలఁ బసిఁ గొయ్యల్నాటి కట్టించి వెం
బడ వేయింపుముగడ్డిగాదములు చొప్పల్ బొందుపుల్లంటులన్.

తమ్ముఁడు కుబ్జ;గోచియను దాఁటులు వెట్టుచుఁ గ్రేపుదామెనం
గ్రమ్మచు జిబ్జకొట్టుచుఁ బరస్పరముం దల డీలుకొంచు ము
న్గొమ్ములఁ జిమ్ముచుం దిరుగఁ గొట్టినఁ బట్టిన లొగ్గిరావు, సా
యమ్మొనరింపు మీయదన నాలమరల్పఁగఁ బల్పువెట్టఁగన్

తడిసిన పచ్చికట్టియలు తంగెడు తప్పర తాటియాకులం
బడఁతుక ప్రొయిలో దుఱిగి పైఁబొగలెత్తఁగనూఁదుఁగాని కూ
డుడుకదు; కాఁకకుం బొగకు నుప్పతిలెం గడగంటబాష్పముల్;
తడయక ఎండు రెమ్మలను దట్టెఁడుత్రుంచును చెట్టుచేసులన్.

మును వేసంగిని గుచ్చివిడ్డ పిడకల్ బొప్పర్లు బొళ్ళెంబులున్
వెచుకంబెట్టిన తాటిచుండ్లు బరికెల్ వెళ్ళించె నిన్నాళ్లు; నిం
క నవాంభోధర మాలికా పిహిత దిగ్జాలంబులై వర్షపున్
దినముల్ డగ్గరెఁ, గాంత బానసము నేతీరొప్ప సాగించెడిన్.

పొలముల బీళులం దిరిగి ప్రొద్దెడగ్రుంకఁగ నిల్లుసేరి పా
పల నొడిచుట్టుఁ బెట్టుకొని భార్యను సన్నముఁ దెమ్మటంచు వే
పిలిచెద, వొంటికాఁపురము, పిల్లల గిల్లల బుజ్జగించుకో
వలసిన యాలిపాటుఁ దలఁపం గరుణింప వదేల హాలికా. 100

ఉప్పుతోఁదొమ్మిది యున్న కాఁపురములు
సేయు గృహిణుల కేచిక్కు లేదు,
ఎవ్వి లేకున్నను నిరుగు పొరుగు కులాం
గనలకుఁ జేయొగ్గి గైకొనుటకు
నిష్టపడక, యున్న దే పెట్టి యకలి
వాపుకొనెడు మానవతుల కెందు
లేమిడి సంసార మేమెంయిఁ బరువుతోఁ
గడపంగ నిక్కట్లు గలుగుచుండు,
నెన్ని కష్టములున్న నిట్లని పలుకక
పొసఁగినయంతకుఁ బాదువుచేసి
మగనికిని బిడ్డలకుఁ బెట్టి మిగిలియున్న
యింతఁ దాఁ దిని భిక్షున కిడు పురంధ్రి
శాంతి నీతియు నురుకష్టసహనశక్తి
నెవ రెఱుంగుదు రంతటి యింతి దక్క! 101

తల తాకటులువెట్టి ధనికుల దగ్గఱఁ
బన్నుకై గొన్న రూపాయలప్పు

కూలికి నాలికిం గూటికిం జాలక
నాముగాఁ గొన్న ధాన్యంబుటప్పు
చిల్లర మల్లర చేబదులుగఁ దెచ్చి
యక్కఱ గడపిన యట్టి యప్పు
పండుగపర్వాల బందుల విందుకై
సామానుగొన్న బజారుటప్పు

వాయిదా మించవచ్చిన వడ్డియప్పు
పడఁతిసొమ్ముల కుదువకుఁ బడ్డయప్పు
వేగ తీఱిచి స్వాతంత్ర్యవీథి యందు
సంచరింపుమ నిశ్చింత సంతతంబు. 102

పవలు నడచుఁ బ్రొద్దు; తోవవిందు రేవేళఁ;
బవలు రేయి నడచుఁ బాడువడ్డి!
అప్పుచేసి కుడుచు పప్పుకూళుల కన్నఁ
గాసు ఋణములేని గంజి మేలు. 103

సంఘపరివర్తనంబులు జరుగుచున్న,
రాజకీయ సంక్షోభంబు రగులుకొన్న,
విప్లవంబుల దేశమ్ము వీఁగుచున్నఁ,
గృషిఁ ద్యజింపకు కర్షకా, కీడు గలుగు. 104

నవ్యపాశ్చాత్య సభ్యత నాగరకత
పల్లెలందు నస్పష్టరూపములఁ దాల్చి
కాలసమ్మానితములైన గ్రామపద్ధ
తులను విముఖత్వముం గొంత గలుగఁజేసె. 105

పంచాయసతీభా భవనంబులో రచ్చ
కొట్టంబు లోకమూలఁ గూలిపోయె,
వీథిబడులఁ జెప్పు విజ్ఞానధుర్యులు
నోజలు దాస్యంబు నూఁతగొనిరి,
గ్రామపరిశ్రమఁ గలుగు నన్యోన్యమా
సహకారవృత్తంబు సమసిపోయె,
సత్యజీవనము, విశ్వాసమ్ము, భక్తియు
నైకమత్యము మున్నె యంతరించె
బూటకములు, కుయుక్తులు, మోసగతులు
కోర్టువ్యాజ్యాలు, ఫోర్జరీల్, కూటమైత్రి,
స్వార్థపరత, మాద్యంబు, గర్వప్రవృత్తి
నేర్పు విద్యాలయంబులు నేఁటియూళ్ళ! 106

నేఁటి నాగరకత నీమేలుఁ గోరక
యప్పుచేసి బ్రతుకుమని విధించు;
నాయవృద్ధికన్న నావశ్యక పదార్థ
సంఖ్య హెచ్చఁ జిత్తశాంతి యున్నె? 107

జీవనస్పర్శ సామాన్యచేష్టయైనఁ
గాలమున వ్యక్తివాద మగ్రత వహించు
సత్వ విరహితుఁ డన్యభోజ్యత నశించు;
సర్వజీవియె యంతరాయముల దాఁటు. 108

కాన, జీవనసంగ్రామ కార్యమందు
విజయి వగుటకు శౌర్యంబు విద్య బుద్ధి
సత్యసంధత యాత్మవిశ్వాస మనెడు
నాయుధంబుల విడువకు హాలికవర్య.

చాలు విజ్ఞానమతబోధ! సాంధ్యరాగ
కాంతిఁ బండిన కేసరి కారుచేలు
స్వర్ణసైకత ఖనులుగాఁ బరిణమించెఁ
గనుల కాహ్లాదనంబుగఁ గాంచుమోయి. 110

బారులుదీరి యంబరముపైఁ జరియించెడు నీటికోళ్ళు లిం
పారఁగ సాంధ్యలక్ష్మి మెడయందు ధరించిన తారహారరే
ఖారమణీయతం జెలుకఁ గాలువనీటికి నేఁగు కన్యకల్
వారక కొంతసేపు కనువాల్పక చూతురు విస్మయంబునన్.
గోపద ధూళి ధూసరిత గోపకుమారులుఁ గాఁపుపిల్లలున్
మూఁపునఁ గట్టెలుం జలిదిబోనపు దుత్తలు, చంకలోనఁ బె
న్మోపెఁడు దూడపల్పు లిడి మోహనవేణురవంబు సేయుచున్
మాపటివేళగాఁ బసులమందలు దోలుకొనివచ్చి రిండ్లకున్.

స్వారిచేయు నిచ్చ భావంబు గిలిగింప
బఱ్ఱె నెక్కి వచ్చు బాలుఁ డొకఁడు;
వానిఁ గ్రిందఁద్రోయువఱకు బఱ్ఱెను బాఁది
సంతసింతు రితరసఖులు నగుచు. 113

బడి విడిపించంగ బాలురు వీథులఁ
బరుగెత్తి యుప్పరపట్టెలాడఁ,
బంటచేలకుఁ బనిపాటుల కేఁగిన
కర్షకు లిండ్లకుఁ గదలుచుండ,
స్నానంబు లొనరించి సరసుల భూసురుల్
భక్తిభావన సంధ్య వార్చుచుండ,
‘సందాకవళమమ్మ సత్రమేజయ’ మని
యన్నార్థులగు భిక్షు లరుగుదేరఁ

బక్షు లెల్లను గూళులఁ బట్టిచనఁగ
నచ్చటచ్చటఁ దారక లవతరింప
మొలకచీఁకటి దిక్కులు మలినమయ్యె,
సంజ రాతిరి గర్భాన సమసిపోయె. 114

ఇంతకు రాఁడు కాంతుఁడని యింతి విచారముతోడ ద్వారబం
ధాంతరమందు నిల్చి కనులార్పక దారులు చూచుచుండ నీ
వంతగ నాలసింపఁ దగవా? మగవారలయ ట్లకాతర
స్వాంతలుగాక, కామిను లనాగతకష్టము లెంతు రెప్పుడున్.

ఆమెను రచ్చలోని వ్యవహారము, లూరక పొల్లుమాటలం బోయెను నర్ధరాత్రి, మిఁకఁబొమ్ము గృహమ్మునుజేర, బిడ్డలుగ్ నాయన నాయనంచుఁ గరుణమ్ముగ నేడ్చుచునున్నవారు, ము న్నాయితపెట్టె స్నానమునకై నులివెచ్చని నీరు భార్యయుగ్.

లయవిభాతి

చలువగల కప్పురము చిలికినటు చల్లనయి
లలితకలధౌత మృదువిలసనము పోలెగ్
మొలకలిడు వెన్నెలల చెలువము దిగంతముల
కలముకొని తారకల తళుకులను గప్పం
గలువపొడి గందవొడి దొలఁక సుడిరేఁగుచును
మెలఁగు నెలపయ్యరలు నలసతఁ జరింపం
దలఁపున రసార్ద్రమగు వలపు లిగురింప, దిన
కలకల మడంచి నిశ గొలిపెఁ బ్రమదంబుగ్

స్నాన మొనరించి, వెన్నెలచలువ బయల
బిడ్డలు న్నీవు నిల్లాలుఁ బ్రీతిఁ గుడిచి
పొడుపుకతలు, సమస్యలుఁ, బూర్వచరిత
లంత వచియింపు వారలు సంతసింప. 119

శ్రమ, విషాదమ్ము, లాసలు, సర్వకాల
హృదయభేదక చింతలు నిదుర యనెడు
శాంతవారిధి లీనమై సమసిపోవ
విశ్రమింపుము, సైరికా, వేగువఱకు. 120



# జలదాంగన.

నిలువునీరునఁ బండి రాణించుచున్న
పైరుపొలముల విహరించు పంటలక్ష్మి
యొఱపుఁబయ్యెద బంగారు మెఱపు లనెడు
సంజనిగ్గుల వఱిమళ్ళ చాయ లొలికె!

పొలముల కాలమేఁపుటకుఁ బ్రొద్దున నేఁగిన కాఁపుబిడ్డ లా
వుల పదధూళిసోఁక నెడవోయెడు దూడ లదల్చికొంచు, నిం
పులు చిలికించు వేణురవము ల్పలికించుచు, గూళ్ళఁజేరు ప
క్షులకును మున్నెయూరిదెసకు న్మరలించిరి యాలమందలన్.

గగనసీమంతినీ కంఠ గళితమైన
మల్లె పూ దండ జేఁకులు దుల్లెననఁగఁ
బైనఁ జరియించు కొంగల బారు లెంతొ
యలరు చుండెను దర్శనీయంబులగుచు. **4**

ప్రకృతియెల్లను శాంతమై పరఁగుచుండ
శాలి కేదారములలోనఁ జల్లగాలి
నల్ల నల్లన విహరించు చుల్ల మంద
నంతులేని యానందంబు నందుచుంటి.

కనుఁగొనుచుండఁగా జలదకాంతల కుచ్చెలకొక చెంగులం
దనరు జపాసుమార్ద్రరుచి దగ్గెను; దిక్కుల నుప్పతిల్లె నం
తనె యుసు; లక్కడక్కడను దారకలుం గనుపట్టె; మిక్కమం
చనయను మిణ్గురుంబురువు లాడుచునుండెను జేలగట్టులక్

గగన రత్నాకరంబు నాగ్రహమునొంది
కాలమనెడు నగ స్రష్ట, కమలబాంధ
వాంశునీరమ్ము గ్రోలిన నసటఁ దోఁచు
రత్నములనంగ నక్షత్రరాజి మెఱయు. **7**

అంత సుధాంశుబింబము వియత్తలమం దుదయించె, నా రతీ
కాంతుఁడు యామినీరమను గాంచుటకుం జనువేళ మల్లెపూ
బంతి శతాంగముం జదలబాటఁ జకోరపు హారువాలచే
వింతగఁబూంచెనా మొయిలుపిండిహిమంబుగ రేఁగునట్లుగన్.

గగన స్రవంతికా కల్లోలడిండీర
ఖండంబు లభ్రమ్ము గప్పెననఁగ
నందన కల్పద్రు సందోహములు పూచి
యెల్లెడఁ బుప్పొడి చల్లెననఁగఁ
బ్రాగద్రి శిఖర ఘర్షణమునం దొలివడి
యుడుభర్త యమృతంబు నొలికెననఁగ
దిఙ్మత్త కరిదంత దీప్తులాకాశ ద
ర్పణమున బింబించి వఱలెననఁగ

శర్వరీ మందిరాంతర స్థంబులైన
హీరమణి దీపముల కాంతి సారమనఁగ
మెత్తఁదనమును శైత్యమ్ము మిళితమైన
పండువెన్నెల నల్గడ నిండుకొనియె ! 9

వెన్నెలఁజూడ నందమగు వేసముదాల్చిన కొండనెత్తమం
దున్నపయోదమొండు పవనోద్ధతి కల్లన నూఁగియాడుచుఁ
సన్నని యంబరంబటులఁ జందురుఁగప్పుచు వీఁగిపోవు చె
న్నెన్నొ మనోహరాకృతుల నెత్తుచుఁ గన్నులఁగట్టె వింతగన్.
చూడనుజూడ నందమగు సుందరి రూపుధరించి, వేణి రా
పాడు జరీముసుంగు హరిణాంకు కళన్మిసలాడఁ గాంతునిం
గూడి నభో విహారవన కుంజతలంబుల సంచరించు పె
న్వేడుక రోహిణీ రమణి వే యరుదెంచెనంగఁదోఁచిన‌న్; 11

జలదకాంతను గాంచి యాశ్చర్యమొంది
కన్నువాల్పక సందమ్ము గనుచునుండఁ
గవికుమారుఁడ నొటఁ దక్షణమె నేను
భావమున నబ్ద సారూప్యపదవిఁబొంది 12

చెలియ! యథేష్టరూపములఁ జిత్రగతిం జరియించె దీవు; నీ
చెలువముగాంచ ప్రమోదయినచిత్తముగూడఁ జిగిర్చు; నేలకో
వలిపపు మేల్ముసుంగునిడి వచ్చితివొంటిగ, వాసమెద్ది, యెం
దుల విహరింపఁబోయెదవు, తుందుడుకొందకనిల్చి తెల్పుమా!

నిన్నుఁగనుఁగొన్నదాదిగ నీదుచరితఁ
దెలిసి కొనఁ గౌతుకంబు చిప్పిలెడి నబల,
యెవరిదానవో? తలిదండ్రు లెవరొగాని
ఘనుల సంతతిగా నీవుగానఁబడెదు! 14

అనవిని కాంత యిట్లనియె నంత, మదీయచరిత్ర మంతయుఁ
వినుచు విషాదమోదముల విచ్చినచిత్తముతోడ దైవసృ
ష్టిని దలపోసి యబ్బురముఁజెంద నభీప్సితమేని నాకథఁ
వినుము కవీశ్వరా, ప్రణయవిహ్వలత న్మొయిసొక్కు-నంతకుఁ:

నీవెఱుంగని వింతలు, నీమనంబు
చొరను శక్యంబుగాని దెచ్చోటఁగలదు ?
ఐన నానోటఁ జెప్పింప నాసయేమి
వినుము పుట్టుపూర్వోత్తరంబును కవీశ! 16

జలజభవుండు, సూర్యుఁడు నిశాకరుఁ డుర్వియు, దారకల్దిశల్
కులగిరు, లవ్వియివ్వి యనుకోఁ బనియేల? సమస్తమున్
సలుపకమున్న నాదు సరసంబగు పూర్వపు రూపొనర్చె న
న్న లవము నాత్మసంస్తుతి యనంజన రెమ్మెయిఁ దత్వదర్శనుల్!

జంట నిసుంగులట్లు, నను సంతమసమ్మున గాంచి మాయవా
ల్గంటి యదృశ్యగాఁగఁ గడగండ్లను సైఁపుచుఁ దల్లిలేని మా
చంటి తనమ్ము పుచ్చ, నిమిషమ్మును వీడనిమమ్ముఁ బాప మా
యింటనుగా నిగోళములు హెచ్చెను లెక్కకుమిక్కుటంబుగన్.

అనుజను గోలుపోయి మదియం దెడవోని వియోగవేదనన్
వనరుచునుండఁ బృథ్వియను బాలయొకర్తుక చేరవచ్చి న
న్ననునయ వాక్యముల్పలికి, యార్తియొకింత శమింపఁ జేసి నా
మనమున కెక్కుడాస్యమున మాగృహమందె వసించియుండినన్;

కాలుఁ డనియెడు సుందరాకారుఁడొకఁడు
మమ్ము నిరువుర నీక్షించి మానసంబు
ప్రణయముగ్ధంబుగా వచ్చి వలపుదెలిపి
పరిణయం బాడె సౌఖ్యసంపదలు పొదల. 20

కొన్నిదినాలు మువ్వురముఁ గోరికలీరిక లెత్త సౌఖ్య సం
పన్నతఁ గాఁపురంబు సలుపన్ ఫలియించెను నాదుగర్భ; మా
పన్నతనొంది పృథ్వి మదిఁ బాటిలునీసున నాసుఖంబు సైఁ
ప న్నెనరింత లేక చలపట్టి గృహంబునఁ బోరువెట్టుచున్; 21

అక్రమించెను నావాసమందుఁ గొంత
స్థలము; 'నదియేమొ' యన్న, 'నీసవతిఁగా నె
హక్కు లేదఁటె? నాకింట' నని యెఁ బృథివి;
చేరఁదీసిన ఫలితంబు సిద్ధమయ్యె! 22

ఇది పతిచనవని కనుఁగొని
తుద కేమియుఁ జేయలేక దుఃఖముపాలై
కుదురెఱుఁగక తొందరపడ
నోదవెను నీఫలమటంచు నూరకయుంటిన్. 23

అంతటఁ గొన్నేండ్లకు నా
కాంతకు సంతానవృద్ధి గలిగెను; నైనం
బంతంబు విడదు నాపంబు
నంతింతకు లేనితగవు లాడుచు నుండున్. 24

సవతులకు గిల్లుజగడాలు సహజమైన
బిడ్డలైనను నొండొరు ప్రీతిమెయిని
నోలపు పొరపొచ్చెములు లేక యుందురన్న
నదియు నోనఁగూడదాయె నీర్ష్యాళులగుట 25

అసురులకు నిలింపులకు నయ్యెడు తియ్యని పోరులట్ల వె
క్కసముగ మాయపత్యములుకయ్యములాడుచునుండఁబృథ్వియుం
గసిగొని మందెమేలమునఁ గాంతునిచిత్తము మ్రుచ్చిలించి యుం
పెసఁగెడు 'బుద్ధి' నాత్మజులకే నొనరించె రహస్యరీతిగన్ 26

పైతృకంబగు "బుద్ధి" సంపదను బడసి
విఱ్ఱవీఁగుచు మమ్ముల వెతలుగుడుప
నెన్నో సాధనములఁబన్ని యెట్టయెడకు
నాదు సంతతిఁబట్టి తినంగ నైరి 27

అంతంబోక మదీయగర్భమున గోప్యంబౌనటుల్ చేర్చి నే [ముల్
నెంతోమక్కువ దాచియున్నమణులున్ హీరంబులున్ ముత్య
కాంతింజిల్కు ప్రవాళవల్లులు బలాత్కారంబుగా నాచికో
శాంతింజెందునె నామనంబెటులనో సైరించుకోఁ బోయినన్?

తనరె బలంబటంచు నిడిధర్మ మధర్మ మనాక కార్యముల్
పొనరుచు పృథ్విసంతతుల పోతరముంగని, యింతగర్వముం
డినఁగొనసాఁగునే కడకు డెప్పర మౌనని యెంచికొందు; నం
తనె శివమేల? యెప్పుడయినం దుదిదాకనె దుష్టకల్పనల్? 29

తమకు బలంబు శౌర్యమును ధైర్యమునిచ్చి సమస్తసౌఖ్యముల్
క్రమముగఁగూర్చి వైరినికరంబు పదానతమౌ సమీకమా
ర్గము గనిపించుబుద్ధి నుదర న్విషమించి నిజాశ్రయంబుగా
ల్పు మొదలునొట్టుఁ; బరిపాటికిమించిన నిల్లియౌఁ గదా! 30

ప్రకృతిశాస్త్రంబు విద్యయు భవ్యకళలు
బావసంపూర్ణతకుఁ దోడుపడుట లేక
ప్రజల నాశనమందె పర్యాప్తమగుట
సెలవుకన్నెక్కు డార్జించు వలనఁగాదె! 31

నావలుచేసి, నాహృదయ నాళములెల్లను జుంజురౌనటుల్ 31
త్రోవలుదీసి, యాత్మకడఁద్రోసి, శరీరసుఖంబెగోరి యా
ర్ష్యావిలచిత్తులై తుదకు నందఱు భోగము కారణంబుగం
గావలమెత్తిపోరిరి యకావికలై తమతల్లి బెగ్గిలన్. 32

గారవించిన నాగరికంబు కడకు
ధూమ ఫూత్కారములలోనఁ దూలిపోయె
మనుజసంతాన మాహవ మత్సరమునఁ
గంఠదళనా వినోదంబు గడపు నహహా! 33

నన్నుఁ బెట్టిన కష్టంబులన్ని సవతి
పొందుచున్నది పుత్రిల మూలమునను;
కన్నబిడ్డల నెత్తురు కాల్వలందు
నీఁదుచున్నది పృథ్వి సహించి యెటులొ! 34

కోరుచుండిన తరుణంబు గూడికొంట
సవతి పుత్రుల రక్తంబు చవులుపుట్టఁ
దనివి దీఱఁగ నేను సంతానములును
ద్రావినారము క్షీరపూరంబు. లటుల! 35

ప్రతిహింసాపరమైన నామనమునై ర్పన్ లేక నీకేను జె
ప్పితిఁగానీ యిటు వంటిగాథ; ప్రణయావేశమ్మునన్ విన్నవిం
చితి నంచీవు దలంపఁబోకు సుకవీ, చిత్తంబమన్దైకపం
చితమైనప్పుడు నన్ను బోఁటి శమము న్సేవింప సాధ్యంబొకో!

మాటకుమాటవచ్చి చనుమానముతో నిటులంటిఁగాని, నా
కేటికి మున్నమున్న శమియించిన గాథలు ద్రవ్వకోఁగ; నా
పాటికి నంతరాళమునఁ బర్యటనం బొనరించి పిన్నబి
డ్డాటల నాడికొందుఁ బవనార్భకుఁడర్మిలినన్నుఁగూడఁగన్; 36

అనవిని పల్కితి: జలదాం
గన, యిట్టిసురూపమెటుల ఘటితంబయ్యెన్?
మునుపున్న వనధిరూపం
బును నెట్టుల మార్చితివి యపూర్వపురీతిన్? 37

తెలుపు మటన్న, సౌనవును, దెల్పుటకు న్విషయాంతరంబు వ
ర్తిలుటయు నెట్టులోమఱచితిన్, వినిపింతును శేష;మిద్దరన్
గలుములులేము లెప్పుడు వికారము లొందక యేకరీతి ని
శ్చలముగ నుండఁబోవనెడు సామెత నీ కెఱుఁగంగ రానిదే?

కొన్నిదినములు చీఁకటి కొన్నినాళ్ళు
వెన్నెలనియెడు లోకోక్తి విదితమయ్యె;
నాకు మనసీక వర్తించు నాహృదీశుఁ
డెలమి వశవర్తియయి నన్నె వలచియుండు; 39

ఒకనాఁడిద్దఱ మిష్టగోష్ఠిఁ బ్రణయాం బుప్పొంగి లోకంబుదోఁ
పక సౌఖ్యంబులఁదేలియాడి కడకున్ భావంబుశాంతింప, నా
యకలంకంబగు పారవశ్యమును నెయ్యం బారవర్ణించి మా
మక సౌందర్యరసాబ్ధి నీఁదుచు వచోమాధుర్య మేపారఁగన్;

కాంతుఁడు ముద్దుచెక్కు-ళులు కమ్మగినవ్వుముసుంగులోన నం
తింతనరాని సొరు రచియింపఁగ నింపగురీతిఁ బల్కె 'నో
కాంత, క్షమింపు మున్ను నినుఁ గన్నులఁ గప్పికొనంగ లేక య
త్యంత ముపేక్షతో మనముదాఁచిన నావిరసంపుఁజైదముల్!

'నెడలె గ్రహచార వేళయుఁ, బృథివియన్న
నీవ యన్నను వేఱేమి నీరజాక్షి,
మునుపు సలిపిన యపరాధములను మఱచి
నన్ను నీదాసునిగ నేలు మన్న వినవె?

'కలదు రహస్యమొండు; కినుక న్వహియింపకు మోసమంచు నేఁ
దెలుపక యూరకుంటిఁ బొలఁతీ! గతమెప్పటికిన్ గతంబె; యం
దులకు విచారమేల? ననుదుష్టుఁడ నంచని గాలఁదన్ని నం
జెలిమి నెఱింగి దగ్గఱకుఁ జేర్చిన నియ్యవె పాపపుణ్యముల్?'
అని మగవారికిం దెలుప నక్కు-జనించెడు నెన్నొతియ్యముల్
మనము గరంగఁ బల్కి- నను మన్నన వేఁడి, యనంతరంబు జం
కును గపటప్రచారమునకు న్వడనవ్వను సిగ్గుదోఁప ని
ట్లనియెఁ గపోలమంజిమము లల్లన హెచ్చుచుఁ దగ్గుచుండఁగన్:
'వనితా! యేమని చెప్పువాఁడఁ? బ్రణయవ్యామోహచిత్తుండనై
నిను గాలుండను పేఁ జేరితిని, నే నీ శేజబంధుండఁ; బ
చ్చని గుఱ్ఱంబుల తేరిపై గగనసంచారంబు గావించుచుం
దును; నారూపమెఱుంగఁగోరికయునం దోడ్తోన వీక్షింపుమీ.'

అని వచియించి, కాంచనశతాంగము హీరకిరీటమొప్ప మో
హన నవకాంతులీనెడు సహస్రకరంబులతోడ వెల్గుచున్
గనులకు వెక్కసంబగుచుఁ గానఁబడం, దలయెత్తిచూడలే
క నిలిచియుంటి నూరక వికారము నొందని ఆతిబొమ్మగన్.

అంత నిజస్వరూపము దయామయుఁడై కుదియించి, సూర్యుడుం
'గాంత, ప్రభాతకాలమునఁ గాంచనచేలము దాల్చి నామనం
బెంతయు మ్రుచ్చిలించితివి, యింక నినున్విడనాడఁజాల, నా
చెంతనె సర్వసౌఖ్యములు చేకుఱుఁ గాఁపురముండుమీ'యనన్.

కలలోఁదోఁచెడు వింతమార్పులటులం గాలంబునందోఁచె, నీ
జలజాతాప్తుని బ్రత్యహంబుఁ గనుచున్ సంతోషమేపార, నీ
చెలువంబుం గమనీయమూర్తియును నే సేవింపలేదింత, కో
చ్చెల! నాభాగ్యము పండెఁగావలయు నీచిత్రంబు సంధిల్లుటన్.

ఒక్కనిమిషంబులోన నాయుల్లమపుడు
పూలఱేఁకుల ఱెక్కలఁబూని యెగిరె
స్వర్గపవనంబు వీచు నావరణమునకు,
నౌర! రూపాంతరం బెత్తినట్టు లయ్యె.

అభ్రసంచారియౌ మోహనార్కుఁడేడ?
క్రింద ఘోషించు నేనేడ? క్రీడయేడ?
అందరాని ఫలంబుల కాసచేయు
నట్లు ప్రణయ పర్యవసాన మౌనో యేమొ? 50

అని తలపోసికొంత, ప్రణయంబు ముదంబు విషాదమున్ మనం
బునఁ బెనఁగొన్నలోనణగఁబుచ్చిహృదీశునిగాంచి కాంత యి
ట్లనియె, మనోహరా, గగనమందుఁ జరించెడిమీకు, నాకు నె
ట్లనువగుఁ గాఁపురంబు, మునుపట్టులెపుత్తము భావి కాలమున్

అయిన నను కొందు, మీదుపాదాంబుజముల
రజములకు నైన సరిపోఁ దరంబె నాకు?
అట్టి నన్నును వలచి రూపాంతరంబుఁ
బూనుటెంతయు నాపూర్వపుణ్యమేమొ! 52

అనవిని సూర్యుండిట్లనె
మనమున నెల్లెంతొ నీవుమానిని, నీ రూ
పును గాంచ దివ్యసుందర
తనువటు గన్పట్టునాకుఁ, దథ్యంబిదియున్. 53

శీకరమౌక్తికంబుల రచించిన కంకణపాళి మ్రోవ నీ
చీకరముల్ మనోహరపుఁ జిట్టకముల్ పచరింపఁ జూఁపి సం
ధ్యాకమనీయవేళల ముదంబున నం గవుఁగింటఁ జేర్చు నీ
సాకతము న్మదిందలఁప స్వర్గసుఖమ్ము నధఃకరింపదే? 54

అభ్రసామ్రాజ్యమునకుఁ బట్టాభిషిక్తఁ
జేసెదను రమ్ము నాతోడఁ జెలువమిన్న,
లోక మెల్లను నీయాజ్ఞ లొంగియుండ
నేలెదవుగాక సస్యవిశాలధాత్రి!

అని కరముల్ సహస్రమును నల్లనఁ జాఁపి ప్రమోదబాష్పబిం
దు నికరముల్ దొరంగ నవతోయజమిత్రుఁడు కౌఁగిలింప నే
మని వచింతు బాష్పమయనై యుపగూహనమందె లీనమై
తిని, తదనంతరంబు నను దేఁకువఁ జేర్చె నభోంతరాళమున్.

వలిగాలిం దనుతాపముం దొలఁగి దివ్యంబైన యీరూప ము
జ్జ్వల శంపాభరణంబులుం గలుగ నే సంతోషముం బొంది ని
చ్చలు వాతార్భకుతోడ నీతలములన్ సంచారముం జేయుచున్
మలనెత్తంబులఁ దీవటోవరుల లోనం జేరి క్రీడించుచున్. 57

సాంధ్యవేళల పడమటి చఱులయందుఁ
బొటమరించెడు నపరంజి పొడుపుటేటి
యందు నీరాడి, పెన్నెఱు లార్పుకొనుచు
వచ్చుచుందును గవుల భావంబు లలర! 58

పండువెన్నెల లలరు శర్వరుల యందు
వలిపపు ముసుంగు నోరగా వలనుపఱచి
వెన్నెల పులుంగు పిల్లల చిన్నినోళ్ళ
నమృతరసముఁ బూరింతు నెయ్యంబు గదుర. 59

పొద్దువొడుపున విరియు కొంబువులయందుఁ
గాఁపురంబుండు నిందిర కంఠసీమ
మంచుతుంపర ముత్యాల మాలగట్టి
వైచుచుందును నానందవర్ధనముగ. 60

అభ్రగంగాప్రవాహంబు నవల దాఁట
గమ్రమణుల సురేశుండు గట్టినట్టి
యింద్రధనువను వంతెన నెక్కిపోదు
జలక మాడిన తెరగంటి చెలులతోడ. 63

కనులకు నిచ్చ క్రొత్తలయి గానఁగవచ్చెడు వింతలెల్ల నేఁ
గనుచు నభోంతరాళమునఁ గాంతునితోడ వసించియుంటి నం
తన మఱికొన్నినాళ్ళకు నతర్కితరీతి నెఱుంగనయ్యె నా
యనుని పిసాళిమోస, మిఁక నెంతయొనర్పఁగ నంగవింపఁడో!
ప్రొద్దున శయ్యవీడి చెలి, పోయెదనంచు వచించి యేఁగుచో
నెద్దియొ సందియంబు మది హెచ్చ రహస్యపురీతి వెన్నడిన్
సద్దొనరింప కే నరుగఁ, జల్లగఁ బోయెను నంగమెల్ల, నిం
కెద్ది వచింతుఁబో కలుగనే కలిగెన్ సవతమ్మ నాకునున్!
నను నటు నమ్మఁబల్కి గగనంబులకుం గొని తెచ్చె, పూర్వపుం
దనువు దొఱఁగఁజేసె; మమత న్ననుబాయని పిన్నపాపలన్
నెన రొకయింతలేక విడనే విడివచ్చితి; నింతకున్ ఫలం
బనఁగ సరోజినీసతిని నర్మిలిఁ బెండిలియయ్యెఁ గ్రిమ్మఱన్! 64
అలరులబంతి యంట! తనువందిన కమ్మని మోహమంట! సొం
పొలుకు మిటారియంట! తనయుల్లమునం గలకోర్కెపంటయం
ట! లలితచిత్రయానఁట గనంగన ముద్దులమూటయంట! యీ
పలుకులఁ గాంతుఁడే సవతిఁబల్కిన, నే విని యెట్టులోర్వఁగన్?

కొదమ పిసాళి తుమ్మెదల గుంపులు ఝుమ్మని పాటపాడ వా
యు దళిత చంచలోర్మికల యుయ్యెలనూఁగుచు జల్గుమంచు ప
య్యెదనరమోముదోఁపఁగ పయిన్ముసుగట్టుల వైచిపద్మినీసుదతి
పరిమోదముం గొలుప, సూర్యుఁడు నావలిపమ్ముదీయుచున్.

అలరులమిన్న, రమ్మని సహస్రకరంబులఁ గౌఁగిలింప నా
జలజ లతాంగి యంగమున సన్ననిపుల్కలు నారువోసిన
ట్లలరఁగ, నింతమోము నిఁకనంతగ విచ్చి యొయారపుం దెఱం
గులఁ బతిచిత్తముం బడయు, గోడడకింపదె నన్ను మిత్రమా!

కామినికిఁ బ్రాణతుల్యుఁడో కాంతుఁ డెవతో
యొకతె వలపింప ముగ్ధుఁడై యుల్లమిచ్చి
మొదటి కాంత నొప్పరికించి పోవునతఁడు
గొంతుఁ గోయలేఁడే తడిగుడ్డఁ జుట్టి? 68

ఖరకరుడఁట! లోకంబుగాల్చునంట!
అట్టివానికిఁ జిత్తమింకెట్టు కోమ
లంబుగా నుండు? మోహవిలాస ముగ్ధ
నౌటఁ గపటంబుఁ దెలిసికోనైతి నకట! 69

నన్నొక భోగకామిని యనం దలపోసి, యభీష్టసిద్ధి యా
ట న్నను వీడనాడి కులట న్జలజాంగనఁ గూడెనేమొ! యీ
తెన్ను నెఱుంగకుంటఁ గడతేఱఁగరాని సపత్నిమత్సరం
బెన్నుచు వంతలం గుడుచు చెట్టులో కాలముపుచ్చ నేర్పదెన్.

ఇది యిటులుండఁగానె మఱి యింకొకవార్త వినంగనయ్యె, న
య్యది వినఁ బుంట నుప్పిడినయట్టులఁ, గాల్చినసూది వీనులం
దదిమినరీతి నయ్యె నవురా! తరుణార్కుని దుండగంబు, దా
నిదివఱ కొక్క ఛాయయను నింతిని నిల్పె యెనర్చెనంట కా!

అంతకంతకుఁ బతి యకృత్యములు హెచ్చఁ
జల్లవైచిన పాలునా జవికి మనము
విఱుగ, నాత్మహత్యయుఁ గొంత ప్రియమటంచు
నంత హిమగిరి కేఁగఁ బ్రయాణమైతి. 72

అంచలబారు **మానస** సరోంబు విహారము గోరి పోవుచోఁ
గాంచి తటస్థమయ్యె విధికల్పన నర్మపుదారితో డటం
చెంచి, యలంత లేక పథ మేత్తెఱ సాగ వచించు గాథ లూ
కొంచునె మంచుకొండ యెడకుం జనఁగల్గితి నాసపెంపునన్.
అరరే! యేమని దెల్పుదాన సుకవీ, యాకొండయందంబు! ని
బ్బరమై మంచొలికించు తెమ్మెరలు వీవన్ దిక్కులివ్వంచుఁజూ
పలు లెన్నంగ నశక్యమౌట, నచటం బల్లంబులు న్మిట్టలుం
దరులుంగాల్వలులోయలంచుఁ దెలియనా్రకుండఁ జూపట్టెడిన్

అంబుధరగర్భములు చీల్చు చాకసమున
హిమధరాధర శృంగంబు లెదిగి యెదిగి
కన్నులకు నందు మేరలకన్న దాఁటి
తారకామండలంబును దాఁకుచుండు 75

తిరువు లెల్లఁ దుషారంబు దవిలి గడ్డ
గట్ట, నద్దంపుఁదునకల కళలుదేలి
మంచు ముసుఁగులఁ బచ్చ రాణించుచున్న
చివురుటాకు జొంపంబులఁ జెలువుగొలుపు; 76

శీతగిరి గాంచినంతనే చిత్తమందు
వెలుఁగుచున్న ననుర్షకీలలు శమించెఁ;
జుట్టుపట్టుల నడయాడి చూతమంచుఁ
దరలితిని మంచుగడ్డ నెత్తమ్ములకును. 77

అనవిని నేను బల్కితిని. 'యంగన, నీదగు భాగ్య మేమి నె
ప్పను! గనుఁగోఁటవే కనులుపండువుగా హిమవద్ధరాధరం
బునఁ గలవింతలన్నియుఁ? బ్రమోదము పుట్టెడి నీవుదెల్పఁగా
విని, యిఁకఁజూచినం గలుగు వేడ్కలకుం బొలిమేరలున్న వే?

'ఏనును నీప్రకారముగ నెక్కడికైనను నేఁగు రూపముం
బూన వలంతినైన హిమభూధరశృంగము లెక్కియాడమో
దానఁ జివుక్కుమం చెగిరి దాఁటనె! యంతటి నోము నోయలే
దో నరులక్కటా! గఱులతో నొకపుల్గుగ నైనఁబుట్టనే?' 79

అనవిని యంబుదాంగనయు, నౌనవు! నాగిరి యంద మాడకీ
వును జని చూడకున్న ననుబోఁటి వచించినయంతమాత్రఁ దీ
ఱునె తమి, పుట్టతేనియలు గ్రోలినవాఁడు రుచి న్వచింపఁ దీ
పును నెఱుఁగందరంబె యొకబొట్టయినం జవిచూడకుండినన్?

అవుఁగాని యటుమీఁద, నాకొండ మాచుగ
డ్డలువ్రీలఁ బగుళుల నోలుకుచున్న
సెలయేళ్ళు వెండికమ్ముల లీలఁ జాల్కొన
నటకేఁగి చలినీళ్ళ యందు దోఁగి,
జలువైన మంచుతుప్పలు గాలిఁ దూలిన
నోరగా నటునిటు నోసరిలుచుఁ,
గన్నులుగట్టియుం గట్టక మాయమౌ
కల యట్లు నెల్లెడఁ గలయఁదిరిగి,
విష్ణు పాదాబ్జమునఁ బుట్టి విన్నువాఁక
వెడలు గుహ కడ నొకకొంత వేచిచూచి
శంకరుని యెద్దుగిట్టల జాడఁబట్టి
గదలిపోతిఁ గైలాస శృంగంబు దరికి. 81

వలకాల మంజీరవలయంబు సొంపిల్లఁ
గుడికాల బిరుదందె గులుకుచుండ,
వలకేలఁ గంకణమ్ములు ఘల్లుమని మ్రోయఁ
గుడికేలఁ జాప పెందొడవు లలర,
వలరొమ్ముపయ్యెద వలపుగుబ్బలి నిక్కఁ
గుడిరొమ్ము బూది నిగ్గులఁ జెలంగ,
వలకొప్పులోఁ దావిచిలుకు గేదఁగి పూవఁ
గుడితల నెలపువ్వు కొమరుసూప,

డక్కచేసూని, మేనులు సొక్కసోలఁ
బ్రమదగణములు నాడుచుఁ బాడుచుండఁ
బ్రకృతి యాత్మయు మిళితమౌపగిదిఁ దాండ
వించు నర్ధనారీశ్వరు వేడ్కఁ గంటి! 82

అక్కడనుండి, దేవతల యక్కఱదీర్పఁగ మన్మథుండు దా
నెక్కటి పూవువిల్లు గొని యిందుకళాధరు నొంపవచ్చినం
గక్కసమెత్తి నెన్నుదుటి కంటిసెకం గరఁగించినట్టి యా
ప్రక్కకుఁబోయి చూడ నటఁ బట్టదు పచ్చనిపూరియేనియున్

బదరికాశ్రమ వాసులౌ పరమమునుల
యజ్ఞవాటులు నేఁటికి నలరుచుండు;
నెండ కెండి వానకు నాని యిప్పటికిని
నమరు నచ్చోట యూపకాండముల గములు. 84

అటనుండి విధి వశమ్మునఁ
దటరుహ వల్లీ నికుంజ తతుల మనం బు
త్కట మోదంబునఁ దేల్చెడు
మటుమాయల కొలను గాంచి మంజులమనుచున్;

విమలజలములఁ గ్రుంకిడ వేడ్కగలుగ
మునిఁగితినొ లేదొ యంతలోఁ దనువునందుఁ
బలుక శక్యంబుగాని పెంజలియు వణఁకు
గదిరి యటునిటుఁ గదలు లాఘవము దొలఁగ; 86

అక్కటా! మోసమంచు శోకార్తనగుచు
దిక్కుదెస లేని దాననై సొక్కుచుండి
ప్రాణమేఁగిన మెయి కట్టెవాఱు నటుల
మంచుతాఱుఁగ నంతలో మాటిపోతి!

అప్పటి నాయుడంత మిసుమైన నెఱుంగను; లేచి చూచుకో
న్నప్పుడు లేఁతనవ్వు లొలయన్ జలజాప్తుఁడు జేరవచ్చి న
న్నొప్పరికించినట్టి కొల యూరడగం బరిచర్య సల్పినం
దప్పుక్షమించమం చడుగఁ దగ్గఱ నిల్చియె యుండె దీనుఁడై.

ఆతని నవ్వుగాంచి హృదయంబునఁ బట్టఁగరాని రోషము
త్యాతతరీతి గుబ్బటిల నాస్యముఁ జూడఁగనైన రోసి నా
నూతనమైనరూపము గనుంగొని నిర్ఝరగర్భమందు సం
ప్రీతిగ లీనమైతి; నిదిమేలె యగుంగద నన్ను బోఁటికిన్! 89

పగ దలంపక, నాకష్టపాటు గాంచి
సవతి యైనను పృథ్వి నాసరసఁ జేరి
యార్తి యొకకొంత శమియింప ననునయించి
నన్నుఁ దనయింట నిలిపెను గొన్నినాళ్లు! 90

అచ్చటఁ బచ్చతామొలక లట్టుల నింపగు పైరుచేల యం
దిచ్చకు వచ్చినట్లు చరియించి, యనంతర మూటకాల్వలం
జొచ్చి, కొలంకులం గలువజోటులు పుప్పొడికాన్కలీయఁగన్
హెచ్చినసంతసంబున గ్రహించి నిజాలయ మేఁగుకోరికన్;

బలిసి, కూలంకషంబుగఁ బాఱునదులఁ
గలసి, స్వస్థాన మేఁగితిఁ గాంక్షదీఱ;
దేనికై మూఁగు నీఁగల తెండెములఁ
బిల్ల లెల్లరు ననుగూడి ప్రియము నిడిరి. 92

కాంతు నుపేక్షచే నయిన కష్టము బిడ్డల ముద్దుముచ్చటం
గొంత శమింపఁజేయు చటుకొన్నిదినంబులు పుచ్చ నొక్కనాఁ
డెంతొ మనోహరాకృతి వహించి సరోజహితుండు రాఁగ నా
స్వాంత మిఁకేమిసెప్ప? రెపలాడెను బూర్వము విస్మృతంబుగాన్
ఎట్టులొ తెచ్చికొన్న బిగియింపొక యింతయు సళ్ళనీక లో
నట్టిటు వీఁగుచిత్తము రవంతయిన న్వెలిదోఁపనీక యీ
సుట్టిపడన్ మొగంబుపయి నుల్లముసూపిన, జంకిగొంకి నా
తట్టుకువచ్చి యేమన కతర్కితరీతిగఁ గౌఁగిలించినన్; 94

ఏమిది? యన్నయంత తడవేమియు లేదుపగూహనంబునన్
గోమటి బాష్పరూపనయి కూడనయేఁగి నభోంతరంబునన్
శ్యామలకోమలాంబుదమునై చరియించుచున్నదాన, నిం
కేమన నేమిలాభము? కవీశ్వర, యామెను బోమె నింతకున్

ఇంతకైనను సద్గుణవంతుఁ డగుచుఁ
గాఁపురం బగడుసేయక గడపకున్న,
నింక నీమోసముల నెవ్వరెఱిఁగివత్తు
రంత కూలికి విషమాను కాంతయెవతె? 96

అని వచియించుచుండునెడ నల్లనఁ జల్లనిగాలి వీవ నా
వనద లతాంగియు న్ముసుఁగుపయ్యెద వే సవరించికొంచు న
న్గని కవిశేఖరా, నిను నకాండమువీడి చనంగఁ జిత్త మొ
ప్పునె యటులుండియుం జను టవశ్యకమాటకుఁ జింతగల్గెడిన్

నవురువెన్నెల కమ్మదనాన నూరి
యవని యెల్ల నానందమయంబు గాఁగఁ,
బండి యొరఁగిన మొలగొల్కుపైరుచేల
కడకు రమ్ము పరస్పరేక్షణము గలుగ; 98

అను చలవోకనేఁగు జలదాంగనఁ జూపులకందు మేరకుం
గనిగని, బాష్పపూరములు కన్నులఁ గారుచునుండ చిత్త మో
హన శిశిరాంశుబింబము వియత్తలమందు రహించియున్ దెస
ల్గనఁబడవార! యాత్మవికత్వము కన్నులఁ గప్పిపుచ్చుటన్
బలసెడు పిల్లతెమ్మెరల యూర్పుల నీకలు మేన రేఁగఁగం
బులుఁగులు గూళ్లలన్నిదురవోవుచు, నెండినయాకుజొంపముల్
గలగలలాడ మేలుకని కమ్మఁగనార్చెదు నల్కడొక్కఁడే
చెలఁగెడి తోడుగా గృహముఁజేరి శయించితి వేగుజామునన్.

చల్లవెన్నెల, వలిమల, జలదకాంత
మంచుతుప్పలు, సెలయేళు, లంచబారు,
లిందుశేఖరతాండవ మేమొ యేమొ
కనుల గాంచుచు నిదుర మేల్కొంటి నపుడె! 101



# యువక స్వప్నము.

జననీ స్తన్యములాని పాలనురువుల్ సాంద్రమ్ముగన్ బుగ్గలం
దొనకంగాఁ బసిబిడ్డ పేరెదపయిన్ దోగాడురీతిం బయో
ధిని ద్రుళ్ళింతల వీచిపోతములు ధాత్రీవక్షముం బ్రాఁకుచుం
డెను సాంధ్యారుణాతీరసైకతము డిండీరంబులన్ శోభిలన్. 1

అస్తమించెడు సూర్యునియంశుదీప్తి
జలదముల వింతరంగులు సంతరింప,
గగనతలమంతయును జిత్రకరు ప్రదర్శ
నాలయంబటు రమణీయమై దనర్చె. 2

పైనఁ గీర్ణాంబుదంబౌ నభస్థలంబు
క్రిందఁ జటులవీచీ విఘూర్ణిత పయోధి,
చూపుమేరల నొండొంటిఁ జొచ్చుకొనుచు
జీవన ద్వంద్వయుద్ధంబు చేయుచుండె. 3

సందెచీఁకటి దిక్కులఁ గ్రిందుకొనఁగఁ
జుట్టుపట్టులు మసిబొమ్మలట్లు మాఱెఁ;
జదల మెఱసెడి నక్షత్రచయముదక్క
కన్నులంగట్ట దొండెద్ది కాంతియైన. 4

అంత సుధాంశుఁడు జలనిధి
యంతరముననుండి వెడలి నాఁడో యన నా
శాంతములఁ జల్లవెన్నెల
లెంతయుఁ బ్రసరింప గగనమెక్కుచుఁ దోఁచెఁ. 5

అమృత శీతలమైన చంద్రాంశు వితతి
సోఁకిన నిమేషమందె యీలోకమెల్ల
స్వప్నమోహనమై స్వర్గసౌఖ్యలేశ
ము రుచిచూపించుచుండె సమ్మోదమొదవ. 6

శుభ్రసైకత తటమందు శుక్తిగర్భ
ముల శశి ప్రతిఫలించుట వలనఁ దార
కల విలాసము మాపంగ జలధి గుప్త
హారముల బైటఁబెట్టిన తీరు దనరు. 7

జలధి తరంగమాలికల శబ్దము దప్ప నిశా గభీర ని
శ్చలతకు భంగముం గొలుపఁజాలు మఱేసడి లేదు ; పక్షులుం
బలుకవు చెట్లకొమ్మలఁ ; బ్రపంచపుఁ జిన్నదనంబు చూపు చు
క్కలగమి పూలగుత్తులటు గాంతిలుచుండె నభంపుఁబందిరిన్. 8

కనుచుండం గడుదూరమందు వనధిం గాన్పించె నక్షత్రమో
యన నేదో యొకకాంతి ; యద్ది ధవళంబౌ పక్షిరూపాంతరం
బునఁ గన్పట్టెను ; గొంతసేపటికి నంభోదంబునాఁ దోఁచెఁ ; జ
క్కన వీక్షింపఁగ యానపాత్ర బహిరాకారంబుగాఁ జూపడెన్

ఏమిది యంచుఁ జిత్తమున హెచ్చెడు నబ్బుర మాఁపలేక శో
భామయమైన యా కడలిబాటను గాంచుచునుండ డగ్గఱెం
గోమల రత్నదీధితులకున్ గగనంబున నింద్రచాప రే
ఖా మధురాకృతు ల్వెలయఁ గన్నులకు న్మిరుమిట్లుగొల్పుచున్

ఆ లలితంపుటోడ సొగసార నమర్చిన సింహపీఠి శం
పా లతికాంగి యొర్తుక విపంచిక మీటుచుఁ గూరుచుండె ; రా
గాలతివిన్న తారలు రసాధికతం గరగంగ నుల్కలు
ద్వేలముగాఁగ రాలె ; నిఁక వేఱ మనుష్యులఁ జెప్ప నేఁటికిన్ ! 12

అలలున్ గానరసంపు మాధురికి నాట్యంబాడఁ జొచ్చెన్ ; నిశా
లలనారత్నము తన్మయత్వమునఁ బుల్కల్గాంచెఁ ; జైతన్య చి
హ్నలు దోఁచెం బ్రతివస్తువందుఁ ; బ్రకృతిస్వాంతంబు ఛందోగతిం
జలియించెన్ లయదప్పకుండ నుచితస్థాయిన్ మనోజ్ఞంబుగన్ —

పరవశమైననామనము పట్టక యుబ్బి తరంగితంబునై
పొరలు ప్రమోద నిర్ఝరి కపోలములన్ డిగజాఱె నశ్రులై ;
చిర మటు గానలీనమగు చిత్తమునన్ నిలుచుండఁ గాంచి య
త్తరుణి యనూహ్యరీతిఁ దనదగ్గఱకున్ నను నీడ్చె వింతగన్. 13

ఆ యువతిఁ గాంచినంతట
నా యుల్లమునందు భక్తి ననలెత్తఁగఁ జే
దోయి వినమ్రిత మోడిచి
కాయము పులకింప నొక్క కడ నిలుచుంటిన్. 14

రకరకంపు మతాబుల రంగులీను
తరళమణిమయ మకుటంబు తరుణిశిరము
నందు వెలుఁగొందుచుండె బాలార్కబింబ
ముదయ మగుచున్నదో యను నూహవొడమ. 15

చల్లనిచూపులన్ భువనజాలము నేలఁగఁజాలు దేవి సం
ఫుల్ల ముఖారవిందమునఁ బుప్పొడియట్లు కిరీటకాంతి యుం
పుల్లసిలంగ ఘర్మకణికోత్కర బింబితమై యలేఖ్య వి
ద్యుల్లవముల్ జనించునటు లొప్పె లలాట కపోల పాళులన్. 16

బొమలఁ గుటిలత్వ మమరిన నమరెఁగాక
చూచుపర్యంత మమృతంపు వీచు లలరుఁ ;
బ్రతినిమిష నవ్యమైన యా రమణిచూపు
గనుటకై వేయికన్నులు గాంచవలయు. 17

ఆ లతాంగికిఁ బ్రక్క నాభీలవికృత
మనుజ శల్యపంజర మొండు కనులఁ గట్టె;
నది సజీవమనుష్యుని యటుల గాన
పారవశ్యమున నటించు బహుళగతుల. 18

పచ్చినెత్తుటఁ దడసిన పట్టువలువ
క్రింద జీఱాడ వీపున వ్రేలుచుండె;
నుక్కు కోటీరభరమునఁ జిక్కువడిన
యటులఁ బొడకట్టె బొమలు భయంకరముగ. 19

కరమున దండముంగొని వికారపునవ్వు దొలంక శల్యమూ
ర్తి రయమునన్ నటించు చెటుద్రిప్పునో దండము నట్టిదిక్కునం
బురముల * * * * శిఖపుట్టి దహింపఁగ భూతినుండి య
త్తఱి జనించు నంకురవితానము కోమల పల్లవంబులన్. 20

వల్లకీ తంత్రులను మీటు పల్లవోష్ఠి
పాదములకడఁ బడియుండె భగ్నదండ
ములును, సింహాసన కిరీటములును దరత
రంబుల నృపాలకత్వ గర్వంపుగరిమ. 21

ననుఁ గని యా తేజస్విని
మనమునఁ గరుణా రసంబు మల్లడిగొనఁగన్
జనని కుమారుని బిల్చిన
చనవున నను బిల్చి తేనెజాలొల్కఁ బలికెన్: 22

'ఇంత గభీర యామవతి నియ్యేడ నొంటరికాఁడవై సము
ద్రాంతర వీచికా చలన మబ్బుర మొందుచుఁ గాంచెదోయి, నీ
స్వాంతమునన్ మనోహరపు భావము లెయ్యవి మోసులెత్తె? నే
కాంత విహార మభ్యసనమాటఁ బయోధితటంబుఁ జేరితే? 23

'చదలన్ శోభిలు తారకాగణము నెంచం బిచ్చియత్నమ్ము న
ల్పుదువో! గారుడ రత్నఖండముల డాలుం జిల్కు నంభోధిపై
ముదమారం బయనింప నెంతో! గగనంబున్ దాఁట మేఘుంబ వ
య్యెదవో! యేమికుమార, రక్తియుడ లేదే లౌక్యసందర్భముల్?

'ఏల యధోముఖుండవయి హృత్పుటమున్ దహియించు శోకకీ
లాలవముల్ దృగంచల విలాసములం గసిగందఁజేయ? నీ
ఫాలము చింతమై ముడుతవాఱి, బొమల్ దిగజాఱి, బాల్యలీ
లా లలితంపు జీవనకళల్ పఱివోవఁ జఱించె దిట్టులన్? 25

'చింత శుష్కించిపోయిన చిత్తకళిక
మఱలఁ దావి గుబుల్కొని విరియునటుల
సలుప నొకప్రాణియైన విశ్వంబునందు
నిన్నుఁ బ్రేమింపదా యేమి చిన్నవాఁడ? 26

'లోకమెల్లను మోహనాలోకనముల
నరయు నక్షత్ర మంజులమా నభంబు
రోషకుటిల భ్రుకుటి భంగ రూపితేక్ష
ణముల నినుఁగాంచెనే? కాని నాఁటి కకట!' 27

అనియిటు పల్కి మాఱుపలు కాసయొనర్చు కటాక్షరోచులన్
ననుఁ దిలకించు దేవి కరుణామృదులోక్తులఁ జిత్తవీణ తం
త్రి నికరముల్ చలింప, జననిం గని చెప్పినయట్లు మానసం
బును గలఁగించు శోకభరమున్ వచియించితి నిర్భయంబుగన్:
'తమమున డాఁగి చూపులకుఁ దక్కని నాపదముద్రలన్ నిరం
తము జలరాశి తీర సికతాస్థలిఁ గన్గొన సంచరించి, గా
నమిఁ దననీడఁ బట్టఁ బయనంబగు మూర్ఖుని నాఁగ వ్యర్థభా
వమునకుఁ జింతలం బొగులు బాలతపస్విని నేను శోభినీ. 29

'అంతుగనరాని సాగరమందు సలిల
బిందువటు లెన్నఁడో మున్ను వేఱుపడితి;
నఘుపఁ జుక్కాని లేనట్టి నావమీఁదఁ
జనుచు నున్నాఁడఁ గాలవాహినిఁ దరింప. 30

'ఎన్ని రేవుల లంగరు లెత్తినానొ!
వెండి, యెన్నిట నింకను వేయవలెనొ!
నేఁడు నీవార్ధితటమున నిలిచినాఁడ
రేపు దెలియదు లంగ రే రేవునందొ! 31

'నట్టనడిబాటలఁ దుపాను గొట్టకున్నఁ
గ్రిందిచట్టము గిరిదాఁక వీఁలకున్న
దెసలు గుర్తింప ధ్రువతార యెసఁగుచున్నఁ
జేరవచ్చు జన్మస్థానసీమ త్వరగ. 32

‘జననీ, లోకచరిత్రముం గనిన నాస్వాంతంబు కీలాలపుం
దునకల్ గ్రక్కెడు; నగ్నిపర్వతము సద్యోభిన్నమై ప్రేలఁగన్
ఘనధూమంబు శిలాద్రవం బుడుకునిండం గ్రమ్మ చందాన దు
ర్జనపాపాగ్ని శిఖాపరంపరలు సంఛాదించె నల్దిక్కులన్. 33

‘బలయుతమైన జాతి యిలఁ బాలనసేయు; నధర్మమయ్యు భూ
తలపతి ముద్రవడ్డ నది ధర్మమ యౌను; ప్రజాళి సౌఖ్యముం
దలఁపక యాత్మభోగపరతం జరియించు వసుంధరాపతుల్
పలువురు లోకకంటకులు పాలనసేయఁగ శాంతిగల్గునే? 34

* * * *

‘కడుపునకుఁ గూడుదొరకక గాసిఁజెంది
అన్నమును దొంగిలించిన యతఁడుదొంగ;
రాజ్యలోభంబునను బరప్రజల హత్య
సలుప నసిపూన ధర్మశాసనుఁడతండు! 37

* * * *

అందఱును గూటిపేదలై యడలుచుండ
నెవరొ కొందఱు ధనికులై యేమిఫలము?
మత్తమాతంగమున కాకలెత్తి పఱవ
ముండ్లకంచె లడ్డంబులే ముందు కేఁగ? 40

* * * *

'సంఘుసరసి దురాచార శైవలములు
గప్పివైచెను నీరంబు కంపుపట్ట;
సతము స్వాతంత్ర్యముం గోరు సారసములు
నిలువ నొక యంగుళంబైనఁ దలములేదు. 46

'పాలకత్వ చక్రిం బొకవంక, వేఱు
ప్రక్క నాచారచక్రంబు ప్రజలనెపుడు
గానుగను ద్రిప్పినట్టులఁ గదిపి రాచు
మానవత్వ స్వభావమే మఱపు రాఁగ. 47

'ధరణి తలమెల్లఁ గంటక తరు లతలకు
నాకరంబయ్యెఁ బూలంటు లడుగు పట్ట;
దుంపమొదలంట నాఁగట దున్నకున్నఁ
దల్లిపూజకుఁ గుసుమంబు లుల్లసిలవు.' 48

అనవిని, మోమునందు దరహాస రసాంకురముల్ చివుర్ప న
జ్జనని విపంచి తంత్రిలను జక్కఁగ దిద్దుచు నన్నుఁ గాంచి: 'నీ
మనమున వల్లకీ రచిత మంజులగానము నాటె; నింక మే
ళన మొనరింపుమీ పదములన్ మధురంబగు మద్విపంచికన్.'

అన, నిటులంటి నేను వినయాంజలి: 'నే భువనంబునుండి యీ
వనధికి యానపాత్రమున వచ్చితివమ్మ? నినుం గనంగ నా
మనముఁ బరీక్ష సేయువిసుమానపువీణియమీటు దేవతా! వనితవో,
లోకమాతవోకొ, వాణివో, యేమియొఁ దోఁప దూహకున్. 50

'నీదు కనుచూపు సోఁకిన నిద్రనుండి
లేచుఁ జైతన్యజగతి చలించు నటుల,
నెవ్వ తెవొ గాని, పస లేని యెమ్ముశలందు
జీవకళల నుట్టించెదు చిత్రగతిని ' 51

నే నిటు వచియించిన విని
యా నవనీతమృదుహృదయ యాదరమున నా
యాననముఁ జూచి పల్కెను
మానసమున జ్ఞానదీప్తి మల్లడిగొనఁగన్: 52

'బాలుఁడవు నీ వెఱుఁగవు ప్రకృతిగర్భ
మందు నెంతటిశక్తి పెంపొందునదియు
నణువునందున్న తేజస్సె యధికమగును
ఒక్క భువనంబుఁ జూర్ణించి యూఁది వైన. 53

'ధర్మము నడంచి దుర్జనత్వము పెరుఁగ
జగతిఁ బ్రతికారశక్తియు జన్మ మెత్తు;
ఆస్వరూపము నేను; జనాళి నిద్ర
మేలుకొలుప విపంచిక మీటుచుందు. 54

'నాకు సహకారిణియై యాజ్ఞ నడపుచుండు
నిరత మీ శల్యమూర్తి-నిర్ణిద్రశక్తి;
ఆతఁ డెచ్చోటఁ గాలూను నా స్థలంబు
అభినవోజ్జీవనాంశుల నందగించు. 55

'అఖిలలోకంబుఁ గాలచక్రానుసరణి
యాత్రసేయుదు మిరువుర; మింతయేల?
జనుల స్వాప్నికబంధంబుఁ జదిపివైచి
మానవసమత్వ మొనరింప మా తలంపు. 56

* * * *

'పాంచభౌతిక జగతిలోఁ బఱచికొంటి
ననుచుఁ గడు విఱ్ఱవీఁగుచున్నాఁడు నరుఁడు;
ప్రకృతి హసియించుచున్న దా పరమముగ్ధుఁ
డైన మనుజుని గర్వంబు నరసియరసి. 58

'బాలకా, యింకఁజాలు నీపాటిభావ
వినిమయం; బర్ధరాత్రము వెళ్ళిపోయె;
వచ్చెదే నీలనీరధి భంగములను
నావ నడుపుచుఁ బోదము రేవుఁజేర. 59

"మనము చరించుమార్గమున మంజులమౌ నొకయంతరీప ముం
డు; నచట నొక్కహర్మ్యము కడుం బొడవై గగనంబునంటుచుం
గనక మణి ప్రభాసితముగాఁ గనుపట్టును; జూడఁగోరు నే
రును జనరాసిరీతి నమరుం బొలమెక్కెడి వేఁటకుక్కలుౕ. 60

'నేలఁబ్రాఁకు చీమయునైన నింగినెగురు
ఖగములైనను గుక్కల కంటఁబడును,
పోతుటీఁగయుఁ జొరరాక పొంచియుండు
శ్వానముల మోసగించి పోవలయు మనము.' 61

'ఏల యీకష్టమంతయు? నింతశ్రమకుఁ
బ్రతిఫలంబుగ మనమేమి పడయఁగలము?
తూర్పునకు ననుకూలమైదోఁచె గాలి,
యెత్తెదను తెరచాపల నింక జనని.' 62

* * * *

'కాదు కాదోయి, యచ్చోటఁగలదు నాకుఁ
దలఁపులంటిన బాల్యబాంధవి యొకర్తు;
ఎవ్వతెయ్యెయన్న సంశయంబేల నీకు?
వెలఁది మీతల్లియేసుమ్ము వెఱ్ఱివాఁడ.' 63

ఎన్నఁడెఱుఁగని యీవార్త విన్నయంతఁ
బిడు గడఁచినట్లు నామది వ్రీలిపోయె;
మొలకలెత్తెను బులకలు, గలఁగెఁ దలఁపు;
సుంతసేపిట్లు మ్రాన్పడి చూచుచుంటి. 64

అంతట దేవిపాదములయందలికమ్మనుమోపి మ్రొక్కి, నా
చింతలువాపు తల్లి, యనిచిత్తమునన్ భజియించి పాదప
ద్మాంతర రేణువుల్ శిరమునందువహించి వచించినాఁడ: 'ము
న్నింతకు నీరహస్యమును నెప్పుడు నే విననైతి నెచ్చటన్. 65

'తల్లిమరణించె నాచిన్నతనమునందు
ననుచుఁ గల్లరులెవ్వరో వినిచినారు;
స్తన్యమాధురి, మాతృ శీతలకటాక్ష
ములకు నెడమైతి నని మున్ను తలఁచుచుంటి. 66

'అట కేటఁబోయె మాజనని? హర్మ్యము నెవ్వరుగట్టినారు? న
న్నిటు చరియింప నొంటరిగ నేల త్యజించెను దల్లి? చిత్రసం
పుటమునఁ బ్రేమ జీర్ణమయిపోయెనె? జాగిలముల్ సతంబు న
చ్చటఁ బరిమట్టి కాఁపుఁదల సాఁప్పుటయేల? వచింపుమమ్మరో.

'జనని స్వేచ్ఛావిహారంబు సలుపునదియొ
కాక, నిర్బంధవాసంబు గడపునదియొ ?
తెలుపుమమ్మ, తల్లి ఋణమ్ముఁ దీర్పలేని
కొడుకునై పుట్టితిని, కన్నకడుపుచేటు. 68

'హృదయముఁ గోసియిత్తుఁ, గను లేనియుఁ జేతులఁదీసియిత్తు, నా
పదలకు నగ్గమైనను సహాయముగల్గినఁ దాళికొందు ; నా
యెద సుఖియింపఁ దల్లి మొగమెట్టుల నుండునొ చూడనిమ్ము; నీ
పదముల నమ్మినాఁడ, నను బాలను ముంచెదొ నీటముంచెదొ.'

అనవిని, దేవిపల్కె మనమం దనుమానము తీఱకున్కి: 'నీ
జననిని గాంచు నాతురతఁ జెప్పితివో శపథంబు లేక, ధ
ర్మనియతి గారవించెదొ కుమారక, నిశ్చలదీక్షఁబూని మా
తను గనుఁగోక వీడనని తాఁకుము నా పదపంకజంబులన్.'

చెప్పెనో లేదొ యంతలోఁ జేరవచ్చి
పాదతలమునఁ దలమోపి ప్రతిన సల్పి
నంత, నానందపరవశయైన దేవి
'కొడుక, రమ్మని' కౌఁగిటఁగ్రుచ్చె నన్ను. 71

అనుకూలంబుగ వాయువుల్ దెరలరాయన్ నావ కల్లోలవీ
చిని నుయ్యాలల నూఁగు నంచచెలి రీతిం బోవుచుండెన్ నభం
బున నక్షత్రములెల్లఁ గల్యరుచి నింపుల్వాసి శుష్కించి పో
యినదాఁకం; దదనంతరంబు గనవచ్చెన్ దీవి యల్లంతటన్. 72

భూతల స్వర్గమట్టులఁ బూర్వమందుఁ
గాంతిలిన దీవిఁ గన నేఁడు వంతగొలుపుఁ;
బువ్వు లాకులు రాలిన పూలచెట్లు
జలములేక విశీర్ణమై చచ్చు నకట! 73

అమృతదుగ్ధంబు పితికిన యావుపొదుగు
నెత్తురుం బాలు గురిపించు నేఁడు చూడ ;
నిర్మలాంబులు పాఱిన నిర్ఝరిణులు
అశ్రుశీకర కశ్మలలై స్రవించు. 74

లతలు పులకింపఁ దోఁటపొలాల మేను
మఱచి పాడిన కోయిల లురులఁజిక్కె;
భావ భేదక శోక రావంబు దక్క
మధురగానంబు వినరాదు మావులందు. 75

అస్థిమూర్తిని బోతంబునందు నిలిపి
హర్మ్యమును జేరుమార్గంబు నరయుచుండఁ
గాలిబాటలన్నియు ముండ్లకంపతోడఁ
బరులు రాకుండ మూసిన పగిదిఁ దోఁచె. 76

ఘారా దిరిగెడు కుక్కల
బారిం బడకుండ గూఢపథమున నేఁగం
జారు మణి ద్యుతిఁ గడు సొం
పారెడు సౌధంబు మాకు నగపడె నెదుటన్. 77

లోనికిఁ బోయిచూడ నతిలోక మనోహరమైన చిత్రముల్
గానఁబడెన్, సువర్ణమణి కల్పితమై సకలంబు వీక్షణా
నూన ముదంబుగొల్పె; నట నొక్కెడఁ బట్టు తివాసిపైనఁ జం
ద్రానన యొర్తు గూలఁబడినట్టుల నిద్దురఁ గన్మొగిడ్చెడిన్. 78

ఒడలెఱుంగని నిద్దుర నున్న కాంతఁ
గాంచి దేవి శోకాశ్రులు కనులజాఱ
మూర్ఛయో నిద్రయో యని ముక్కుకిందఁ
జేయిపెట్టి చూచి నిరంత చింతఁ బొగిలె: 79

"కనుము కుమార, మీజనని గాంచిన యీదురవస్థ! మూర్ఛవో
యెనో, నిదురించెనేమొ, చలియింపవ యంగములెట్లుచూడ, ము
క్కున నొకకొంతయూర్పుగలుగున్, మరణంబును గాదు; ద్రోహ
తనపుతు లెవ్వరో యిటులఁదన్నొగిలించినరీతిఁదోఁచెడిన్.'[చిం

దేవి వచించుమాటలు మదిం గరఁగించిన యుక్కవోసిన
ట్లై వెతఁ బిచ్చిపట్టినటు లమ్మ పదంబులపజ్జఁ బొర్లుచుం
జేవదొలంగి వెంద్రుకలు చిందఱవందఱ లాఁగికొంచు శో
కావిల బాష్పబిందు నిచయంబులు గాల్వలుగట్ట నేడ్చితిన్.

అంతట వీణాతంతులఁ
గాంతామణి మీటి దివ్యగానము సేయం
గొంత యెడకుఁ గనుఱెప్పల
నంతింతగ విచ్చి చూచె నన్మయు మమ్మ్రా. 82

బ్రదికెఁగదా యటంచు మదిపట్టని సంతస ముప్పతిల్ల నా
యదవదమాని తల్లివదనాంబుజముం గనుచుండఁ బల్కనో
రాదవమి మాకుఁ గన్పటిచె నుల్లమునంగల భావ ఘర్షణా
స్పద చిరకాల శోక దవవహ్ని దృగంచల చంచలాకృతిఁ. 83

ఎన్నఁడో పట్టెడన్నముఁ దిన్నయటుల
గరము కృశియించియుండెను గాయమెల్ల,
నాఱుగాలపు ముదియవ్వ తీరుగాఁగ
ముడుత వడియుండెఁ జర్మంబు మోమునందు. 84

హార మణిమయ కోటీర భారమునకుఁ
గంఠ మొక్కింత వాలినగతిఁ దనర్చు ;
హస్త వలయంబులును గాలియందియలును
రత్న కాంచీకలాపంబు రవళిగొల్పు. 85

వల్లకిని మీటుటను మాని, యుల్లమందుఁ
జిన్నతనపు నేస్తంబు క్రొంజివురు వెట్టఁ
దల్లి మేన సుఖస్పర్శ దవుల నిమిరె
నంగుళీ పల్లవంబుల నా మృగాక్షి. 86

స్పర్శవేది యంట నినుము బంగరటుల
మాఱుపగిది శోభిని సుకుమారమైన
చే దవిలి పునర్జీవన చిహ్న లమరి
యెప్పటి వెలుంగుతో నమ్మ యిట్టులనియె: 87

'రెండు తటములమధ్యఁ దరింపరాని
నీల నీరధి సలిలంబు నెగడునటుల
నెన్నియో యేండ్లు మనలను నెడముసేసెఁ
గంటి చూపైనలేని యీ కఠిన శిక్ష. 88

'మీ పరిబోధము విన్న నిమేషమందె
తరలిపోయిన జీవంబు మఱలివచ్చె;
స్వప్న బాధంబులు నలక్ష్య సరణివదలె
సారసాప్తునిఁ గన్న తుషారమటుల. 89

'క్రిమ్మఱ నాకు బాల రవికాంతులు గాంచెడి భాగ్య మబ్బునో
యమ్మ' యటంచు దీన వదనాంబుజయై హృదయంబు నేర్చు వా
క్యమ్ములు పల్కఁ దల్లి, యిటులంటిని: 'నిన్నుఁ దపింపఁజేయ హీ
నమ్మగు నిట్టి శిక్షణ మొనర్చిన వారెవరో వచింపుమా. 90

అనవిని తల్లి వచించెను:
'తనయా, రక్తంబుఁగార్చు దారుణ దుఃఖం
బును గదలింపఁగ ఫలముం
డునె? యైనను వినుము విధి కఠోరపుఁజేష్టఁ. 91

'అరుణ మయూఖ చిత్రితములై దిశలెల్లను సాంధ్యమంజిమ
స్ఫురణము గొల్పువేళ నలవోకఁ జరించెడు పూలతావి ప
య్యరలటు వీచుచుండ మది హాయి జనింపఁగఁ గాననాం
తర నలినీతటాక సికతాస్థలి నే విహరించుచుండఁగన్. 92

'కోరని కోర్కెగానటకుఁ గోఁతి యొకం డరుదెంచి మ్రొక్కి మీ
తీరునఁ బల్కెఁ:"దల్లి, వనదేశము పూవులుగాయ పండ్ల నా
హా! రమణీయనందన వనాంశము నా విలసిల్లుఁగాని, శృం
గారము నిమ్మడింప నిటఁగానము వానర మేడఁజూచినన్- 93

' "మా నివాసము కిష్కింధ; మధురసంబు
నెంతగోరిన నంతమీ కియ్యఁగలము;
కాలఁ జూపిన హీనంపుఁ గార్యమైనఁ
జేతఁ గావింతు మమ్మ విశేషభక్తి. 94

' "ఈ వనంపు సౌభాగ్యము నెఱిఁగియున్న
వన్యమృగములు నిండుండ వాంఛ సేయు
మేము వసియింప నెంతటి మొకము గాని
వనిఁ బ్రవేశింప వెఱచును భవ్యహృదయ." 95

'అని వసియింపనాజ్ఞగొని యంతఁ గ్రమంబుగఁగోఁతిమూఁక యా
వనమున నిండి పక్వ ఫల భార వినమ్రములైన వృక్షముల్
గనఁబడుచోట్ల నెల్లఁ దమ కాఁపురముల్ నెలకొల్పి, మోసపుం
దనమునఁ బండ్లకాయల దినంబును మెక్కుచుఁ గొల్లగొట్టినన్.

'ఫలభారంబున మ్రొగ్గుచున్న తరువుల్ పాడెత్తి నట్లాయెఁ గా
యలు పిందెల్ పువు లాకులుం దఱిగి హేయంబైన రూపంబునం
బొలుపేర్దన్ వన మేనుగాంచి యిఁక దాపుం జేర రాదంచుఁ గోఁ
తులకుం దెల్పిన భక్తి మ్రొక్కి యిటు నాతోఁ బల్కె దీనమ్ముగన్:

' "తెలిసి తెలియక మేమిట్లు సలిపినాము
తప్పు మన్నించి కావఁగఁ దగుదు వీవు;
ఐన మాచేతనైన సాహాయ్యమొండు
పొనరిచి కృతజ్ఞతం దెల్ప బుద్ధి పుట్టె. 98

' "రమ్ము తల్లి, పూఁదోఁట పొలమ్ము నందు
హేమ హర్మ్యంబు గల దందు నిష్టమైన
రత్న భూషణములు దాల్చి రాణి వగుచు
మమ్ము నేలుచు నుండువు సమ్మదముగ."

'అన, నిది కొంతభాగ్యమని యాసయు దొడ్డదిగాన మాఱుమా
ట నుడువ కేను సమ్మతపడన్ ముదమందుచు నన్నుఁ దెచ్చి యీ
ఘన భవనంబునం దునిచి కాంచన పీఠము వెట్టి రత్న మం
డనములఁ గొన్ని యేర్పఱచి నన్నలరింప నలంకరింపఁగన్. 100

'ఒక్క ముదికోఁతి రత్న హీరోజ్జ్వలంపు
ముకుటమును నాశిరంబునఁ బూన్చి నంత
నేమి సెప్పుదు భరము! నా హిమగిరీంద్ర
శృంగ మాఁడిలఁ దాల్చినరీతి నొప్పె. 101

'మఱియొక వానర ముఖ్యుఁడు
కరముల వలయములఁ బెట్టెఁ గదలుటయును దు
ష్కరమై దారుణ శిక్షను
జిరము ననుభవింపఁ జేయు శృంఖల లటులన్. 102

'బంగరువుటందె వేఱొక వనచరుండు
కాలఁ దగిలించినంత నే కదల మెదల
లేక యురులలోఁ జిక్కిన లేడి యటుల
నింతదశ కగ్గమై విలపింతుఁ దనయ. 103

'కప్పు మెఱుఁగు పాములు, బూజుగప్పియున్న
బావులును, మేఁకతోల్పులుల్ వానరములు;
కపటరీతిని నన్నిట్లు గట్టివెచి
స్తన్యమును గ్రోలసాగెను సంతసమున. 104

'పాలను దాగ్రివుచు నవియుం
జాలక రుధిరంబుఁ గూడఁ జవిఁగొనుచుండన్
మూలములు దెగి ధరాస్థలి
వ్రాలెడు వృక్షంబు పోల్కిఁ బడితిఁ గుమారా. 105

'అంత మైమఱచితి, నేమి యైనదియును
దలఁపలేను; వీణానినాదంబు విన్న
యంత లోకంబు దెలిసె' నంచమ్మ పలుక
విని యిటంటిని దుఃఖ గంభీర సరణి: 106

'కనులం గాల్వలు గట్టె నశ్రుజలముల్, కంఠంబడెన్ గద్గద
ధ్వని, నీ పూర్వమహత్వ మిప్పటి యధఃపాతంబు చింతింప నే
మనఁగం, బంక నిమగ్న ధేనువటు లాహాకారముల్ సల్పు నిన్
గన, నే పుత్రుని హృత్పుటం బగిలి వ్రక్కల్గాదొకో మాతరో.'

* * * *

అని నేను శోక కుంఠిత
మనమున మాటాడ లేక మాతృ పదములం
గని బాష్పంబులఁ దడుపుచుఁ
బనవుచు నుండంగ దేవి వాకొనెఁ గరుణన్: 110

'చెల్లెలా, నీవు నింత దుఃస్థితిని నుంట
దెలియరాదాయెఁ బశ్చిమ తీరమునకుఁ ;
గాకయున్న మున్నెన్నఁడో గాంచియుందు ;
శయ్య విడుమమ్మ, తరుణ మాసన్నమయ్యె. 111

'తలుపుం దీయుమ, బాలసూర్య రుచి నిద్రాశయ్య వెల్గించి నీ
తలఁపుం గల్యసరోజినీ వికచతన్ దర్శింపఁ జేయంగ ; రా
త్రులు వర్షాగమ మందు దీర్ఘములుగాఁ దోఁచంగ నేమాయె?ను
జ్వల చండార్క కర ప్రచారముల సంబాధించునే బాంధవీ.
'నిదురం గూరిన నిన్నుఁ గాంచి ఉహిహీ నీకిప్పు రూపాంతరం
బుదయం బయ్యెను; బూర్వరూపిణివి గావో బేలయా చెన్ను దు
ర్మద మాయావుల మాటనమ్మి యటు సంభావించితే, పుత్రులీ
యదనన్ దర్పణ మెత్తువారు గనుమా స్వాకారముం జెల్లెలా.

‘నిరతంబున్నిశయే చెలంగునె? తమో నిర్మూలి హేతిచ్ఛటా
భరణుండై యుదయింపఁడే? కుముదమే భాసిల్లునే? చెపు దు
ర్భరమా తమ్ములగోడువోదె? హితచక్రింబుల్ ముదంబంద వే
ధర నెవ్వారికిఁ గష్టకాలభర మంతంబందదే సోదరీ? ’ 114

అని వినినంతనే మెలఁకువాయె; సర్గస్సున కేఁగుతల్లి న
న్గని ‘ నిదురింపనేల కొడుకా, తరుణారుణ కాంతి దిక్కులం
దనరె జపా సుమంబులటు; దామెన లాఁగుచు లేఁగదూడ యాఁ
కొనియఱచుం, గులాయములఁగూసెడు పక్షులు లెమ్ము’ నావుడున్

కనులెత్తిచూడఁ దల్లియుఁ
జనుచుండెను నీటికొఱకు; శయ్యను నేనుం
టిని, తరువుల రవి కాంతులు
గననయ్యెను బొద్దువోడుపుఁ గన్నె తనమునన్.

ప్రతినిశను నిట్టి స్వప్నంబు వచ్చునేని
స్వప్నము యథార్థ రూపంబుఁ బడయునేని
దీనదాస్యాస్పదంబగు దినముకన్న
నాస గొలిపించు నిశయె సౌఖ్యావహంబు! 119





# కడపటి వీడుకోలు

అమరపట్టణ మణిమయ ద్వారములను
దెఱవఁ బురలక్ష్మి పెండ్లికూఁతురు విధాన
సిగ్గు చిగురింపఁ దొంగి చూచెడినో యనఁగ
నావరించె నుషశ్శోభ లంబరమున. 1

ఆకసపుభిత్తి నదికిన యట్టు లెదిగి
వాఁగుగట్టుల నీడలువాఱు వెదురుఁ
బొదలు తరుణారుణాంశులఁ బొదలుచుండె
జీవకళ లుట్టిపడియెడి చిత్ర మటుల! 2

కొండ సెలయేళ్ళఁ, దుంగలు మెండుకొన్న
గటికపట్టుల, మెడలు ఱెక్కల నిమిడ్చి
కూరుకుచున్న యడవిబాతుగుంపు లిపుడె
పాఁచిమేఁతకు రెపరెపఁ బరుగులెత్తె. 3

పండుటాకు పఱుపులఁ బన్నుండియున్న
లేటికొదమలు నిద్దుర లేచి పొద్దు
పొడుపుటెండల మాల్గుచు నొడలుసాఁచి
క్రేళ్ళు దాఁటుచుఁ బచ్చబయళ్ళ కరిగె. 4

స్నాన మొనరించి, దర్భాసనములు పఱచి
భూతిరేఖలు నొడలెల్లఁ బూసి, తపసు
లంజలి ఘటించి సూర్యున కర్ఘ్య మొసఁగి
సంజ మ్రొక్కిరి గాయత్రిజపము సలిపి. 5

కలువల పుప్పొడిన్ వలచు కమ్మనియూటలఁ దోఁగి మౌనిక
న్యలొడలు పులకరింపఁ దడియారని చీరలతోడఁ గుంతలం
బుల జలబిందువుల్ దొరఁగ,బుంగలు సందిటఁబూనియాశ్రమం
బుల కరుదెంచుచుండిరి తపోవన చూత తరూపవాటికన్. 6

తెలుపఁగరాని భావముల తియ్యదనాలకు నార్ద్రమైన కో
మలహృదయంబుతో ఋషికుమారికయొక్కతె వచ్చి నాఁచుతీ
వెలఁ దలలం డవిల్చికొని పెల్లుగ ఱెక్కలు తట్టియార్చు బా
తులపయిఁ జల్లు దోసిళులఁ దోయముఁ గన్నెతనంపుటాటలన్.

వాఁక నీట నీడలువాఱ వంగియున్న
మావికొమ్మను గోయిల మధురగీతిఁ
బాడు చుండఁగ,. నామృదుఫణితి నేర్వ,
దాని ననుకరించును ముగ్ధ గానలుబ్ధ! 8

సరసంబైన నవీనయౌవనపు వాసంతోదయశ్రీలు ని
బ్బరమై పూచినవో యనంగ, నతిలావణ్యంబునం బొల్చు సుం
దరి క్రీడించుచుఁ బ్రొద్దుపోయినది యైనం జూడకే పిల్ల ప
య్యెరకున్ రేఁగు కరళ్ళు బుంగ నిడి నీరాడున్ వినోదంబుగన్.

నీటిముత్యాలు చిలికెడి నిడుపుకురులు
అలలకౌఁగిట సాహూప్య మందియాడ,
నొడలి నిగ్గులు తడిచీర నుండి వెడల
సలిల లక్ష్మి విధాన నావెలఁది దోఁచె! 10

జలకములాడియాడి, యిఁకఁజాలును, బారెడు ప్రొద్దుపోయె నా
టలఁ; జెలు లెవ్వరైనను దటంబున లే, రనురాగలాలనం
బులఁ జివురాకు క్రొన్నెమరు పుక్కిలితో నను నంటివచ్చి యా
చల నిలుచున్న యా హరిణశాబము పిల్చినరా దెటేఁగెనో?
అని తలపోసి, చేతులకు నందిన తామరపూలు గోసి, బుం
గను గనుగొన్న నయ్యదియు గాలికిఁ దేలుచు వాఁకమధ్యకుం
జన, నిఁకనేమిసేయుటకుఁ జాలక దిక్కులుచూచుచుండి తూ
ళ్ళను వలకేల బాల యవలంబముగాఁగొని లోఁతుసొచ్చినన్.

పాఁచి పట్టిన బాడలఁ బదము లిడిన
సల్లు సల్లునఁ గ్రిందికి జాఱుచుండె,
సన్న తూఁడులు మోఁపున సడలియూడ
విఱుచుకొని నట్టనడివాఁక వెలఁది పడియె. 13

పడి యాబిత్తరి తత్తరంబునఁ గటా! వాపోవుచుం జేతులన్
వడి నట్టిట్టుల నీటదాఁచు, మునుగుం బైపైనఁ దేలున్, నెఱుల్
జడలై పక్కలఁ దేలియాడ, నురులై శైవాలవల్లుల్ గడుం
గడుఁ గాళ్లేతులు చుట్టుకొన్న మెదలంగాలేక తేలంబడెన్.

సమిధల నేరవచ్చి తరుశాఖ నిలంబడి, నవ్యయావనం
పు మధువు లొల్కు కమ్మవిరిబోణి వినోదములెల్లఁ గాంచుచుం
బ్రమదమునొందు సుందరతపస్వికుమారుఁ డొకండు వచ్చి వే
గమె, దురవస్థఁ జూచి చెలిఁ గావఁ దటాలునదూఁకె నీళులన్.

పసరు టాకుల పోలిక మిసలు గులికి
యంటినను మెత్తగిలు సకి యంగకములు
నీట నురియాడు నలసట నిలువలేక
చలనహీనమ్ములై కొంత చల్లవడియె. 16

కన్నులు తేలిపోయి కసిగందిన మోమునఁ గ్రిమ్మియున్న యా
పెన్నెఱిగుంపుఁ జేనొడిసి వీలగునంతకుఁ దేలలాఁగుచుం
గన్నియ నెట్టులో యిసుకగట్టునఁ జేర్చె కుమారవమౌళి తా
పోన్నతితోడ నొక్కనిడియూర్పు నిగిడ్చె, మఱేమియెంచెనో?

అంసకీర్ణంబులును నితంబాశ్రితములు
సముద భృంగపత్త్రాంకుర శ్యామలములు
శిథిలసుమముల వాసించు చెలియ కురులు
పిడిచి ముడివైచె దయతోడఁ బడుచుతపసి. 18

తెనయురంబునఁ దన్వంగి తలను వాన్చి
వల్కలము పిండి, చెమరించి వాడుపసలఁ
దోఁగు నెమ్మోము మెల్లగఁ దుడుచుచుండ
నంకురించెఁ జైతన్యచిహ్నములు మేన. 19

జేఁకులువిచ్చు పూమొగడ రీతిఁ గనుంగవ విప్పి చూచుచున్
ఆ కమనీయరూప తలఁ పాకులపాటున శూన్యమాటఁ దా
నేకడ నేయవస్థ నిటు లెందుకు నుంటయు నూహసేయఁగా
లేక సగంబు మోడ్చెఁ గదలింప భరంబగు కంటిఱెప్పలన్.

'లలనా! యెంతటిమందభాగ్యుఁడనో, బాల్యంబందు నీవాఁకయం
చల నెంతే నెడసైఁపలేని వలపున్ సఖ్యంబునుంగా నెడా
టల లేసంజలు జాఱినట్టి మన కీడ న్నేఁడు నీలాటి హృ
ద్దళనానోన్య విరక్తదర్శనము ప్రాప్తంబయ్యె నీనాఁటికిన్.

'కన్ను ఱెప్పల నెత్తి నీ పిన్ననాఁటి
యనుఁగుఁ జెలికానిఁ జూపుల నాదరింపు;
చెలిమిపూదండఁ బసినాఁడె నులిపి చిర వి
వాసినైన నాబుణ మిందుఁ బాపుకొంటి.' 22

పూర్వపరిచిత మధుర సంబోధనములు
వెలఁది వీనులవిందుగా విన్నయంత,
నటు దిరిగి చూచె బాష్పకణార్ద్రనయను
బాల్యసఖుని గౌతముని విభ్రాంత యగుచు. 23

కలయానో ! మోహమానో!
తలఁపులు చెదరినవో ! లేక తథ్యమొ! యని యా
చెలి తలపోయఁగ మెఱుఁగటు
జలపతన స్మృతియు మదిని సరగున మెఱసెఁ. 24

తన దురవస్థ కన్నులకుఁ దట్టిన పోలిక మేను కంపిలం,
గనుఁగవ నశ్రువుల్ దొరఁగ గౌతముఁ గాంచి వచించె:'మిత్రివా
తను బడనున్న నెచ్చెలిని ధైర్యముతోడ సముద్ధరింప దై
వ నియతి నీవసంబునకు వచ్చితివోయి, యతర్కితంబుగన్! 25

'అదనునకు నీవు నిచ్చోట మెదలకున్న
నకట ! యింతకే స్మరణీయ నయ్యెయుందు ;
బుంగ నడియేటి కరడులఁ బోవ, దాని
నందికొన నేఁగి యీగతి కగ్గమైతి. 26

'మున్ను తొలిసంజ పువ్వులు పూచు వేళ
నిరువురకు నాటపట్టైన యీతలంబు
దైవహతి ననురాగబంధములు దెగిన
యనుఁగుఁ జెలి హృచ్ఛ్మశాన మట్లయ్యె యుండు.

'పసితనపుఁ జెల్మి కలలెల్ల భగ్నపఱచి
మనల నెడవాపిన ప్రవాసదినము లేండ్లు
బాల్యలీలాస్మరణ బాష్పపావనములె?
తలఁపవేమి నికృత్తచిత్తముల తెఱఁగు?

'మునుపటి బాల్యసఖ్యములు బొత్తిగ వీడితి వేమిగాని మీ
జననిని జూడనైన నొకసారియుఁ జేరవు పర్ణశాల; నీ
వెనిమిది వత్సరంబు లెడ మెట్టుల సైఁచితివోయి, ప్రేమబం
ధనములఁ గోయఁజాలిన మనస్వి, రుచించునె యన్యవాసముల్!

'వ్యాసవేదాంతసూత్ర భాష్యములు చదివి
యర్థముల నభ్యసించు విద్యార్థి యింక
వలపు సూత్రంబులం ద్రెంపి పాఱవైచు
టెంతలోనిది? నిజమన్న నింతెగాదె!' 30

అని ఋషికన్యక చెమరిం
చిన కడగంటి రుచులు వికసింపఁగ సఖునిం
గని వచియింప, నతండును
మనమున గుర్తింపరాని మాధురి దొలఁకన్. 31

పలికె: 'బాల్యప్రియసఖి, ప్రవాసఖిన్న
హృదయమును అంపకోఁతఁ గారింపఁ దలఁతె?
పండుటాకుల రాల్చెడు వన్యలతలు
కిసలయింపవె వాసంతరసము వొడమ. 32

'పసితనంబున విడిపడ్డ పాపినయ్యు
నంతరింపదు చెలిమి తియ్యముల తలఁపు;
పడుక తలగడయైన యీ బాహు వతివ,
బాష్పతప్తము గాని శర్వరులు లేవు! 33

'పగలు బాలురతో నాటపాట లందు
ననఁగిపెనఁగిన మనసు యామినులలోన
బాల్యచర్యల వాసనల్ పట్టియీడ్వఁ
దిరుగుచుండెను స్వప్నవీథికల నబల! 34

'దూరవనభూమిమార్గముల్ తొయ్యలీ, ప
రస్పరేక్షణ మిడని విరక్తవిధుల
మనల నెడపె; నైనను భావమార్గచరుల
నాఁపఁగలవె యీలాటి యభ్యంతరములు? 35

'వేదవేదాంగవిద్యల విధిహితముల
నలవఱుచుకొంటి బ్రహ్మచర్యంబు నడపి;
యిపుడు యౌవన జీవనం బెదురు చూచుఁ
బ్రబల ఝంఝాకులాంభోధి పగిది నన్ను!' 36

అనవిని: 'గౌతమ, నన్నుం
గొనిపొమ్మ కుటీరసీమకున్, వృద్ధులు మా
జననీ జనకుల యాశీ
స్సు నొంది పోవచ్చు; నెదురు చూతురు నన్నున్.

'ప్రాణదాతవు; నాకథ వారు విన్న
బాష్పగద్గదకంఠులై వత్సలత్వ
మునఁ గవుంగిట నినుఁ జేర్చి ముదమునొంది
యాతిథేయ సపర్యల నాదరింతు౹'. 38

అని సకి చెప్పెనో లేదో
జనకుఁడు వృద్ధుండు పలితజటలభరమునన్
వినమితశిరుఁడై వణఁకుచుఁ
గనఁబడె వనవీథి నూఁతకఱ్ఱ పొడుచుచున్. 39

రమణి యంతట, గౌతమ బ్రహ్మచారి
భుజము నాలంబయష్టిగఁ బూని యల్ల
నడుగులిడి, తండ్రి కెదురేఁగి యశ్రునయన
యై వినిచె జలపతన వృత్తాంత మంత. 40

ఆ యతర్కితోపనత దైవాపకృతిని
వృద్ధముని యానుపూర్విగ విన్నయంతఁ
గదిసి ప్రవహించె హృత్తట కషణభంగి
గంగ యమున లటు సుఖదుఃఖస్రవంతి : 41

'నాయనా, నీవు చిన్నతనంపుఁ జెలిమి
ఋణము నీఁగితి వీబాల యెడఁ; జిరప్ర
వాసతప్తుఁడవై యలవఱుచుకొన్న
యుపనిషద్విద్య తుదిముక్తి నొసఁగుఁగాత! 42

'అతిథివై తీవి రమ్ము, దయానురక్తు
లైన తపసిపుత్రిలు సపర్యార్హు లెందు;
క్షత్రియోచిత కార్యంబు సలిపినావు,
వంశవాసన లెపుడైన వదలిపోనె ?'

అని పలికి వృద్ధసంయమి
తనయుఁడు గౌతముఁడు వెనుకతట్టుగ నల్లం
తన దన్ను ననుసరింపఁగఁ
జనుచుండె వనాగ్రసరణిఁ జల్లని నీడన్. 44

ఔరా! కాలమునందు నెంతటి విపర్యాసంబు గన్పట్టు! బా
ల్యారంభంబున నెట్టి స్త్రీపురుషభేదాధ్యాయము ల్విప్పకే
యారణ్యావని నాడినట్టి సఖు లేలా నేఁడు క్రీగంటి శృం
గారాలోకములం బరస్పరముఁ గాంక్షల్ సల్ప వ్యాజంబునన్?

తనకు నందని పువ్వులఁ దాపసిసుతుఁడు
కోసి యొడ ముద్దుమురిపెంబు గురిసినట్టి
బాల సిగ్గునఁ దనప్రక్కకు వచ్చుచున్న
నెయ్యు నొకమాఱు కన్నులనిండఁ గనదు. 46

ఇదివఱ కెన్నఁడైన నుదయింపని యేవో యనూహ్యరాగముల్
గదలుపఁ జిత్తవల్లికి నిగారపు బంగరుతంతులన్, రసా
స్పదహృదయుండు గౌతముఁడు చంచలనేత్రిమనోహరాంగసం
పదకు విముగ్ధుఁడైనయటు భావనసేయును హృద్యరూపమున్:

'ఎనిమిది వత్సరంబులకె యెంతటిమార్పు ఘటిల్లె సార! యౌవన మదిరాలసంబులయి వ్రాలెడు ఱెప్పల నెత్తలేక యెత్తి నిశితముల్ సతృష్ణములు దీప్తములున్ హృదయానురాగబంధనములు నౌకటాక్షములఁ దన్వి ననుం గను గాంచనట్లుగన్.

'వన్యరామణీయకము రూపము ధరించి
కనుల కమృతంపు వర్తియై కానిపించె
ననఁగ, నన్నియ సగము సత్యంబు, సగము
స్వప్నలీలగఁ దోఁచు నాభావమునకు. 49

'ఆమదిరాక్షి పాణి కిసలాగ్రము నాయెడ లంటినంత నేదో మధురానుభూతిరుచి దోఁచె నపూర్వసుఖంబుఁ గూర్చు చా హా! మధుమాసయామినులయం దిటువంటి వికార మబ్బ నింకేమయిపోనొ సంయమితమేని మనంబు కుశాగ్రబిందునాన్.'

లలనకుఁ బూర్వ మీ వనతలంబుల గౌతముతోడ నాటపాటల దినముల్ క్రమించె వికటంబులుగాక; కుమారుఁ డాగమంబులఁ జదువం బ్రవాసియయి పోయిన నాఁటనుగోలె వేదనాదళిత మనస్కయై పెరిగెఁ దా జతఁబాసిన గువ్వపెంటినాన్.51

ఇరువదినాలుగేఁడులకు నెక్కుడు లేవు తపస్వి, కామనోహరి పదునెన్మిదేండ్ల నవయౌవనలాలస; ప్రేమ యన్ననో విరతి యెఱుంగనట్టి యటవీ రసకుల్య, సమాగమంబు నంతర పరపీడనప్రియము; దర్శన మెంత సుఖప్రదంబొకో! 52

